# బాలచంద్రాలోకము

(సంస్కృత చంద్రాలోకమునకు ఆంధ్రానువాదము)



గ్రంథకర్త:

సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ (తెలుగు)

**ఆలపాటి వెంకటప్పయ్య, బి.ఏ.,**

రిటైర్డ్ సంస్కృతాంధ్రాధ్యాపకుడు

ఎస్.జి.కె.టి. కళాశాల, తాడికొండ-గుంటూరు (జిల్లా)

సచ్చిదానంద సదనము

ప్రథమ ముద్రణము : 1992

ప్రతులు : 1000



వెల : 35-00

ప్రతులకు :

1. సచ్చిదానంద సదనము,
C/o విద్యారణ్యా జూనియర్ కాలేజి,
రామవరప్పాడు-ఆటోనగర్ రోడ్,
ప్రసాదంపాడు, ఏలూరురోడ్-విజయవాడ.

2. C/o డా॥ యన్. జవహర్‌లాల్,
వాసు హోమియో క్లినిక్,
స్టేట్ బ్యాంకు దగ్గర, రైలుపేట-రేపల్లె.
గుంటూరు జిల్లా.

---

ముద్రణ :

శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటర్స్,
లక్ష్మీడీలక్స్ రోడ్-తెనాలి.

# అంకితము

విద్యా గంధము ఏ మాత్రములేని పల్లెటూరి రైతు కుటుంబమున జనించిన నాకు ఆయా దశలలో శిష్యవాత్సల్యముతో సముచితవిద్య గఱపినట్టి ఈ గురువర్యు లకు నిండైన భక్తి-శ్రద్ధలతో నమస్కరించి అంకిత భావముతో నీ గ్రంథమును సమర్పించుకొనుచున్నాను.

## 1. ప్రాథమిక విద్యా గురువులు

1. శ్రీ పులిపాక లక్ష్మీనారాయణగారు, 2. శ్రీ పులిగడ్డ కోటేశ్వరరావుగారు,
3. శ్రీ పాలపర్రు సుబ్బయ్యగారు.

## 2. మాధ్యమిక-ఉన్నత విద్యా గురువులు

1. శ్రీ మైనేని వెంకటప్పయ్యగారు, 2. శ్రీ పి. వెంకటశేషాచలముగారు,
3. శ్రీ చల్లా సత్యనారాయణశాస్త్రిగారు, 4. శ్రీ ఉప్పల కోటయ్యగారు,
5. శ్రీ కోగంటి రాఘవయ్యగారు, 6. శ్రీ నాగలింగం వెంకటేశ్వరశాస్త్రిగారు,
7. శ్రీ కొత్తపల్లి కృష్ణారావుగారు, 8. శ్రీ కొత్తపల్లి నానారావుగారు,
9. శ్రీ వీరమాచనేని భగవన్నారాయణగారు, 10. శ్రీ శాస్త్రి వెంకట నరసింహా రావుగారు, * 11. శ్రీ గోవాడ రాఘవయ్యగారు.

## 3. కళాశాల విద్యా గురువులు

12. శ్రీ యస్.టి.జి. వరదాచార్యులుగారు,
13. శ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రిగారు,
14. శ్రీ కరి రామానుజాచార్యులుగారు,
*15. శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు,
*16. శ్రీ పంచాంగము వెంకట నరసింహాచార్యులుగారు,
*17. శ్రీ తట్టా అప్పలాచార్యులుగారు,
18. శ్రీ తట్టా రంగాచార్యులుగారు,
*19. శ్రీ కాపూరి సుబ్బరామయ్యగారు,
20. శ్రీ గొడవర్తి సూర్యనారాయణగారు- ట్రెయినింగ్ కాలేజి,
21. శ్రీ అప్పారావుగారు-ట్రెయినింగ్ కాలేజి,
*22. శ్రీ రాచకొండ వేంకటేశ్వర్లుగారు- (హిందీ),
*23. శ్రీ మండవ రామయ్యగారు-(హిందీ)
*24. శ్రీ వెంకటేశ్వర్లుగారు-(ఇంగ్లీషు)

*ఈ గుర్తు మాననీయులగు నాయా బుధుల వలన ఆయా సందర్భములలో మదీయ విద్యాభివృద్ధికి కొంత తోడ్పాటు లభించినదను వాస్తవమును సూచించును.

యెఱుఁడన్ గణిత గురువునకు
ప్రణతు విడుదు చిత్తమందుఁ బొంగఁగన్ సతతమున్

9\. తే.గీ. అలసతయె లేక కఱపుచు నలరు శాస్త్రి
వేంకట నరసింహారావువినుతి సేతు
ప్రథిత శీలుండు గోవాడ రాఘవయ్య
యాఖ్య నొజ్జను మనసార నర్చసేతు

10\. ఆ.వె. అమల హృదయ శోభి యంచిత మితభాషి
మాన్య సంస్కృతాభిమాని యమర
విద్యకు నిలయంబు వెలయించు కులపతి
యస్.టి.జి. వరదాచార్యున కర్చ విడుదు

11\. ” సోమశేఖరుండు సుఖజీవియై యుండ
తర్కకోవిదులకుఁ దగఁగ గర్వ
మణుచుఁ బలుకఁజాలు నా గురు కొల్లూరు
సోమశేఖరాఖ్య సూరిఁ గొలుతు

12\. ” తెలుఁగు సంస్కృతీయ సిద్ధాన్త కౌముదిన్
ఛాత్రహితము గోరి చక్కఁ గఱపు
ప్రథిత గురువరు కతి రామానుజాచార్య
మది నుతింతు నేను మఱవకెపుడు

13\. తే.గీ. అపరచిన్నయసూరి నా నాఖ్యఁబడయు
వెంకటరమణశాస్త్రికిన్ వినుతు లిడుదు
అలరు పంచాంగము నరసింహాఖ్యుఁబట్టి
అప్పలాచార్యునిన్ గొల్తు నాదరమున

14\. కం. ఆర్యున్ దట్టా రంగా
చార్యుని వ్యాకరణ విదుఁ బ్రశంసించెద నా
చార్యున్ కే. సుబ్బరామ
వర్యుమది నమస్కరింతు పరఁగెడు కీర్తిన్

15\. తే.గీ. ప్రథిత గొడవర్తి సూర్యనారాయణాఖ్య
బోధనాపథ బోధకు బుద్ధి కొలుతు
శాంతమూర్తి మనస్తత్త్వ శాస్త్ర విదుఁడు
అప్పరావు గురునకేను అంజలింతు

16\. ఆ.వె. ఆంగ్లమున్ గఱపిన అల వేంకటేశ్వర్లు
గారికిడుదు నతులు, కడఁగి రాచ
కొండ వేంకటేశ్వరుండు, మండవరాము
లనెడి హింది గురుల కంజలింతు.

# విషయసూచిక

# అభినందన

అలంకారాలు అభివ్యక్తి మార్గాలు. వేల సంవత్సరాల సాహిత్య పరిణామంలో వెదికి వెదికి పట్టుకుంటే వందకుపైనా అభివ్యక్తిపద్ధతులుదొరికాయి. ఈ వెదుకులాటకూడా ఏదో ఒకరోజున జరిగింది కాదు. భరతుని కాలంనుండి జరుగుతోంది. జయదేవుడి నాటికి వంద దాటింది. ఈ జయదేవుడికి అప్పయ దీక్షితుల వారికీ నమస్కరించకుండ నిజమైన సాహిత్యజీవికి రోజు గడవదు. ఇంత కృషిచేసిన గురుపరంపరకు నమస్కరింప కుండ ఎలా ?

నమస్కరిస్తే కృతజ్ఞత తీరిపోతుందా ? అంటే తీరదు. వారి గ్రంథాలను అధ్యయనంచేసి మనం లబ్ధిపొందాలి ఆ వెలుగులో నేటి సాహిత్యాన్ని చూడాలి. విశ్లేషించాలి. ఏవి నూతనాభివ్యక్తులో తేల్చి కవుల్ని అంచనా వెయ్యాలి. అప్పటికి గద చరితార్థత.

మరి ఈ లాభం విద్యార్థులకు చేకూరాలంటే ఎలా? అని ఆలోచించి శ్రీ ఆలపాటి వెంటప్పయ్యగారు అమిత శ్రద్ధతో ఈ బాలచంద్రాలోకం సంతరించారు. ఆంధ్రీకరణకు వీరు పెట్టుకొన్న నియమాలు చాలా కఠోరమైనవి. అయితేనేమి కడదాకా బెసగకుండా పాటించి జయం పొందారు. అలంకార శాస్త్రాన్ని క్షుణ్ణంగా గురుముఖతః అభ్యసించి ఆ అభ్యస్త కౌశలాన్ని యువతరానికి అందించి సద్వినియోగం చేసుకున్నారు. భావితరాల యువ సాహితీ సరుల పక్షాన వీరికి కృతజ్ఞతలు చెబుతున్నాను.

అలంకార శాస్త్ర గ్రంథాన్ని ఛందోమయంగా తెనుగు చెయ్యడమంటే అసిధారావ్రతం. ఒకపదం ఎక్కువయినా, తక్కువయినా అన్వయం మారిపోతుంది అటువంటిది వీరు జాగ్రత్త తీసుకొని, సంస్కృత శ్లోకాలతోసహా అవాంతర భేదాలను సవ్యాఖ్యానంగా లక్ష్య సమన్వయం చేసి చూపించారు. గ్రాంథిక భాష అయినా సులభశైలిలోనే సాగింది

నేటి మన తెలుగు ఉపాధ్యాయులు ముందుగా దీనివల్ల లబ్ధి పొందాలి. వారి ద్వారా విద్యార్థులకు అందాలి. ఇది నిజాయతీతో జరుగుతుందని ఆశిస్తాను.

విద్యార్థులు కాకపోయినా ఇతరేతర సాహిత్య వ్యాసంగం చేస్తున్న కొత్త తరంకవులు పింగళిసూరన్ని చూస్తారని, మన వారసత్వం ఏమిటో అర్థంచేసుకుంటారని నా ఆకాంక్ష.

శ్రీ వెంకటప్పయ్యగారి కంటే ముందుకూడా ఇటువంటి ప్రయత్నాలు జరిగాయి. ఆ ఆంధ్రీకరణలు వాటి ప్రయోజనం అవి నెరవేర్చాయి. దీని తీరు వేరు. ఇది ఆ పాత్రలో నిమగ్నమైనవారి తనువు. ఇంతకంటే ఈ ఆంధ్రకృతి గురించి చెప్పగలిగింది లేదు. పాఠకా ఏవ ప్రమాణమ్ శ్రీ ఆలపాటి వారిని మరోసారి అభినందిస్తూ — సెలవు.

భవదీయుడు

తె. వి. వి. సాహిత్యపీఠం
బొమ్మూరు-533124

చేతవోలు రామబ్రహ్మం
14-8-92

# చంద్రాలోక సంగ్రహ చరిత్ర

1) ఉల్లాసాయ విచారవీచి నిచయాలంకార వారాం నిధే
శ్చంద్రాలోక మయం స్వయం వితనుతే పీయూషవర్షః కృతీ (1-2)

2) మహాదేవః సత్రప్రముఖ మఖ విద్యైక చతురః
సుమిత్రా తద్భక్తి ప్రణిహిత మతిర్యస్య పితరౌ।
అనేనా సావాద్యః సుకవిజయదేవేన రచితే
చిరం చంద్రాలోకే సుఖయతు మయూఖః సుమనసః॥ (1-16)

3) జయన్తి యాజ్ఞిక శ్రీమన్మహాదేవాంగ జన్మనః
సూక్తి పీయూష వర్షస్య జయదేవకవేర్గిరః॥ (10-6)

పై జూపిన ప్రథమ మయూఖములోని రెండవ శ్లోకము యొక్క ఉత్తరార్థమును, తరువాత నున్న (1-16) (10-6) శ్లోకములను బట్టిసుమిత్రా మహాదేవ దంపతులకు జనించిన జయదేవుడు స్వయముగనే చంద్రాలోకమును రచించెననియు, అతనికి పీయూష వర్షుడను బిరుద నామము కలదనియు తెలియగలదు. దీనికి శరదాగమమను వ్యాఖ్యానము కలదనియు, ఆ వ్యాఖ్యానకర్త ప్రద్యోతనాచార్యుడనియు, అతడు వీరభద్రనృపతి ఆదేశముచే నా వ్యాఖ్యానమును రచించినట్లు 1874 సం॥న జీవానంద విద్యాసాగరుడు ముద్రింపించిన నాగరి లిపిలోనున్న శరదాగమములోని ఆయా మయూఖాన్త గద్యములను బట్టి స్పష్టమగుచున్నదని పూజ్యశ్రీ విద్యాశేఖర అక్కిరాజు ఉమాకాంతముగారు తమ చంద్రాలోక వివరణ గ్రంథ పీఠికలో చెప్పియున్నారు.

గీత గోవింద కర్తయు, ప్రసన్నరాఘవ నాటక కర్తయు, చంద్రాలోక కర్తయు, శృంగార మాధవీయ కర్తయు జయదేవుడుగనే పేర్కొనబడియుండుట సత్యమే. అందు గీతగోవిందకర్త

"శ్రీభోజదేవ ప్రభవస్య రామాదేవీసుత శ్రీజయదేవకస్య
పరాశరాదిప్రియవర్గకంఠే శ్రీగీతగోవింద కవిత్వమస్తు" అను దానినిబట్టి రామాదేవీ-భోజదేవుల పుత్రుఁడని తెలియగలదు అట్లే ప్రసన్నరాఘవ నాటకకర్త,

"కవీంద్రః కౌండిన్యః స ఖలు జయదేవః శ్రవణయో।
రయాసీ దాతిథ్యం న కిమిహ మహాదేవ తనయః"

లక్ష్మణస్యైవ యస్యాస్య సుమిత్రా గర్భజన్మనః అను తన్నాటకములోని వచనములను బట్టి ఈ జయదేవుని పితరులు సుమిత్రా మహాదేవులనుట స్పష్టము. కాఁగా గీతగోవింద కర్తయు, చంద్రాలోక కర్తయు, వేర్వేఱు వ్యక్తులనియు-చంద్రాలోక కర్తయు, ప్రసన్నరాఘవ నాటక కర్తయు నొక్కఁడేయని తెలియు చున్నది.

కవికాల విషయము :- మమ్మట విరచితమగు కావ్యప్రకాశములోని విషయములను చంద్రాలోకము నందు స్పృశించుటను బట్టి ఇతడు మమ్మటునికి తరువాతి వాడనుట స్పష్టము. క్రీ॥శ॥ 1000 నుండి 1015 వఱకు భోజదేవుని పరిపాలన కాలమని చారిత్రకుల యొక్క నిర్ణయము. మఱియు క్రీ॥శ॥ 1150 ప్రాంతమున కాశ్మీరము నేలిన జయసింహుల కాలపువాడగు రాజానకరుయ్యకుడు కావ్యప్రకాశమునకు వ్యాఖ్యానము రచించిన వారిలో ప్రాచీనుడు అట్టి రుయ్యకుని అలంకార సర్వస్వములోని "తుల్యబల విరోధే వికల్పః" అను లక్షణమును జయదేవుడు తన చంద్రాలోకమున అట్లే గ్రహించుటను బట్టి జయదేవుడు క్రీ॥శ॥ 1150 సం॥రపు తరువాతి వాడగుట స్పష్టమే. అట్లే 14వ శతాబ్దపు వాడుగ ప్రసిద్ధుడైన విశ్వనాథుఁడు తన సాహిత్య దర్పణమున ఈ జయదేవుని ప్రసన్నరాఘవ నాటకములోని "కదలీ కదలీ కరభః కరభః" ఇత్యాది పద్యమును గ్రహించుటను బట్టి ఈ జయదేవుడు రుయ్యక-విశ్వనాథుల నడిమి కాలమున నుండి యుండవచ్చుననుట విశ్వసింపదగినదే.

జయదేవుఁడు తన గ్రంథ నామమునకు తగినట్లే అందలి భాగములను పది మయూఖములుగా రూపొందించినాడు. ప్రథమ మయూఖమున వాగ్విచార నామముతో కావ్యహేతు-తల్లక్షణాది నిరూపణము, ద్వితీయమున దోష నిరూపణము, తృతీయమున లక్షణ నిరూపణము, చతుర్థమున గుణ నిరూపణము, పంచమమున శబ్ద-అర్థాలంకార నిరూపణము, షష్ఠమందు రసాది నిరూపణము, సప్తమమున ధ్వని

నిరూపణము, అష్టమమున గుణీభూతవ్యంగ్య నిరూపణము, నవమమున లక్షణా నిరూపణము, దశమమున అభిధా నిరూపణమును చేసినాడు.

అయితే ప్రస్తుతము జయదేవుని చంద్రాలోకములోని అలంకార నిరూపకమగు పంచమ మయూఖము, అందును శబ్దాలంకారములను విడిచి మిగిలినది మాత్రమే అర్థాలంకార గ్రంథముగ ప్రసిద్ధమై యున్నది. మిగిలిన మయూఖముల ప్రశస్తి అంతగా కన్పింపకున్నది. ఇందు శత సంఖ్యాకములగు నలంకారములున్నవి. అవి యన్నియు నేడు వాడుకలో నున్నవి. దీనిని షోడశ శతాబ్ది కర్తయు, శతాధిక గ్రంథ కర్తయగు సుప్రసిద్ధ మహా పండితుడు శ్రీమదప్పయ దీక్షితుడు కువలయానందమనుపేర సంస్కృతమున చంద్రాలోకమునకు వివరణాత్మక గ్రంథమును రచించెను.

## అలంకారములు-అందు గమనింపదగు విశేషములు

ఈ చంద్రాలోకము నందలి అలంకారములలో రూపక-పరిణామ-ఉల్లేఖ-భ్రాంతిమత్- సందేహ- అపహ్నవ- ఉత్ప్రేక్షా- తుల్యయోగితా- దీపక- ప్రతివస్తూపమా- దృష్టాన్త- నిదర్శనా- వ్యతిరేకములు ప్రతీయమానౌపమ్యములు- అనగా వీని యందు సామ్యము వాచ్యముగాక వ్యంగ్యముగా గోచరించుచుండును.

అనన్వయ- ఉపమేయోపమ- అతిశయోక్తి- సమాసోక్తి- పరికర- అప్రస్తుత ప్రశంసా- పర్యాయోక్త- వ్యాజస్తుతి- వ్యాజనింద- ఆక్షేపములు ప్రతీయమాన వస్తుకములు- అనగా వ్యంగ్యముగా గోచరించుచుండునని గ్రాహ్యము.

మఱియు నీ యలంకారములు ప్రతీప- తుల్యయోగితా- దీపకాదులు భేద ప్రధాన సాదృశ్య మూలకములు, రూపక- పరిణామ- ఉల్లేఖాదులు అభేద ప్రధాన సాదృశ్య మూలకములు; ఉపమా- అనన్వయ- ఉపమేయోపమాదులు భేదాభేద ప్రధాన సాదృశ్య మూలకములుగను విద్వాంసులచే వేర్వేఱుగ గుర్తింపబడినవి. ఇట్లే ఉత్ప్రేక్షాతి శయోక్తులు అధ్యవసాయ (ప్రకృతమునకు అప్రకృత తాదాత్మ్య) మూలకములుగను, విరోధాభాస- విభావనా- విశేషోక్త్యాదులు విరోధ మూలకములుగను, సముచ్చయమగ వికల్ప- పరివృత్తి- ప్రత్యనీకాదులు శాస్త్ర- లోక న్యాయ మూలకములుగను బుధులచే గుర్తించబడినవి. మఱియు నిటులనే శృంఖలాబంధ మూలక-

గూఢార్థప్రతీతి మూలకాది భేదములను బట్టి అలంకారములు పలు విధముల వర్గీకరింపబడినవి.

అలంకార వైవిధ్యమందు కన్పడు వైచిత్రి గమనింపదగియున్నవి. అలంకారములు ఉక్తి భేదమును బట్టియే వివిధములుగ నేర్పడుచున్నవి. ఎట్లన :- ముఖము చంద్రునివలె ఆహ్లాదకరము అని చెప్పిన ఉపమాలంకారమగును. చంద్రునివలె ముఖము, ముఖమువలె చంద్రుడు నాహ్లాదకరములు అనిన ఉపమేయోపమాలంకారము. ముఖము ముఖమువలె శోభించుచున్నదనిన అనన్వయాలంకారము. చంద్రుడు ముఖమువలె ఆహ్లాదకరుడన ప్రతీపమగును. చంద్రునిజూచి కాంతా ముఖమును స్మరించెననిన స్మృత్యలంకారమగును. ముఖమునుగాను గాంచి పద్మమని భ్రమించెననిన భ్రాంతిమదలంకారమును, ఈ కన్పించునది, ముఖమా? చంద్రుడా? అనిన సందేహాలంకారమును అగును. చంద్రుడని చకోరములు కమలమని చంచరీకములు (తుమ్మెదలు) తరుణి ముఖమునం దాసక్తి చూపుచున్నవనిన ఉల్లేఖము అగును. ఇది ముఖము కాదు చంద్రుడే అనిన అపహ్నుత్యలంకారమగును. ముఖమును గాంచి "చంద్రుఁడే" ఇది నిశ్చయమన ఉత్ప్రేక్ష. ఇది (ముఖము) చంద్రుడే అనిన అతిశయోక్తి. ముఖము చంద్ర-కమలములను జయించెననిన తుల్యయోగిత- రాత్రివేళ చంద్రుడు, తరుణీ ముఖము శోభించుచున్నవనిన దీపకము. సవ్య విద్యార్థికి విద్యయం దాసక్తి, చకోరమునకు చంద్రునియందే ఆసక్తి అనిన ప్రతివస్తూపమ. గగనమున చంద్రుడు కాంతివంతుడు, భువిలో రాజే కీర్తిమంతుడు అనిన దృష్టాంతము. ముఖము చంద్రశోభను దాల్చెననిన నిదర్శన. నిష్కళంకమగు ముఖము చంద్రు నతిశయించుచున్నదనిన వ్యతిరేకము. రాత్రి చంద్రుడు నక్షత్రములతోడను ప్రకాశించును అనిన సహోక్తి.

హారము లేకున్నను సుందరి కంఠము హారియే యగు ననిన విరోధాభాసము, పారాణి పెట్టకున్నను పాద మరుణము అనిన విభావన, తేదిని మడస దీపము వెలుగుచున్నను స్నేహక్షయము కాలేదనిన విశేషోక్తి, చిన్న గోపబాలుఁడు పెద్ద కొండఁ బెకలించెనని యెవఁడెఱుఁగుననిన అసంభవము, మేఘములు, విషముఁ ద్రాగ పథికాంగనలు మూర్ఛిల్లిరనిన అసంగతి, నక్క యెక్కడ? నాకలోక మెక్కడ! అనిన విషమము, సుందరీ కంఠము హారమునకు అనుకూలమగు నాలయమనిన సమము, ఉన్నతి నందఁగోరి నతి నందిరనిన విచిత్రము, బ్రహ్మాండము లిమిడిన

జలములో రాజగుణములు ఇమడలేదనిన అధికము, అంగుళీయకము విరహిణికి చేతిలో జపమాల యయ్యెననిన అల్పము. రాత్రి చంద్రుడును, చంద్రునిచే రాత్రియు భాసించుననిన అన్యోన్యము సూర్యుడస్తమించినను తత్కిరణములు దీపస్థములై చీకటిని పోగొట్టెననిన విశేషములోక మిష్టపడువాని. (కటాక్ష-విభ్రమాదుల) తోనే కుసుమాయుధుడు లోకుల జంపుననిన వ్యాఘాతమునగును.

నీతిచే సంపద, సంపదచే త్యాగము, త్యాగముచే కీర్తియు కల్గుననిన కారణమాల, నయనములు కర్ణాంత విశాలములు, కర్ణములు దోస్తంభలంబమానములు, దోస్తంభములు జానుపర్యంత దీర్ఘములు ననిన ఏకావళి, వాత్సల్యము తండ్రి హృదయమందు, (ఆ తండ్రి హృదయము) సుతునియందును స్థిరపడినదనిన మాలాదీపకము, మధువు మధురము, దానికంటె అమృతము, దానికంటె కవిసూక్తి మధురమనిన సారాలంకారము నగును.

శత్రువులను, మిత్రులను, ఆపదలను జయింపుము, రంజింపుము, ఖండింపుము అనిన యథాసంఖ్యము, ముఖసామ్యము పద్మమును విడిచి చంద్రుని చేరినదనిన పర్యాయము, ఒక్క బాణము ప్రయోగించి రాజు శత్రు లక్ష్మీకటాక్షములను గ్రహించెననిన పరివృత్తి, స్నేహక్షయము ప్రదీపములందే కాని ఇష్టజన మనస్సులందు లేదనిన పరిసంఖ్య యగును.

శిరస్సులనో, ధనుస్సులనో వంచుడు అనిన వికల్పము, రాజ శత్రువులు, దాగుదురు, వెనుతిరిగి చూతురు, ద్రిమ్మరులగుదురు అనిన సముచ్చయము, పాంథుడు వెళ్లును; తిరిగి వచ్చును, చూచును, ప్రశ్నించును అనిన కారక దీపకము. మైత్ర నేత్రముల ననుసరించు కర్ణములు కలువలచే నధః కృతము లనిన ప్రత్యనీకము. దానవులు దేవతలనే జయింప, మానవుల సంగతి చెప్పవలెనా? అనిన కావ్యార్థాపత్తి, జడమదనుడా జితుడవైతివి. నా మదిని త్రినయనుడు ఉన్నాడనిన కావ్యలింగము, హనుమంతుడు అబ్ధిని దాటెను. మహాత్ములకు దుష్కరమేముండును అనిన అర్థాంతరన్యాసము, అతడు జితుడుగాడు. మహాత్ములు సాగరములవలె దుర్ధర్షులు (అణచరానివారు) గదా అనిన వికస్వరము అగును.

వనితల శిరోజములు యమునా నదీతీర తమాలస్తోమము (చీకటిచెట్ల గుంపు)వలె నల్లగా నున్నవనిన ప్రౌఢోక్తి. శేషుడే వక్తయైనప్పుడు రాజగుణములు

ప్రస్తుతము లగునని సంభావన. గగన కుసుమమాల ధరించి గణికాసుతుఁ బోవుచున్న మిథ్యాధ్యవసితి. నీరుపోయిన పిదప సేతువు నిర్మింపఁబూనెననిన లలితము. దీపము వెలిగించునంతలో సూర్యుఁడే ఉదయించెననిన ప్రహర్షణము. దీపము వెలిగించు నంతలోనే ఆరిపోయిన దనిన విషాదనము నగును.

హరి సంకీర్తనము చేయవీలగునట్టి యాపదలను నాకిమ్మనిన అనుజ్ఞ. మాటలురాని పక్షులు స్వేచ్ఛగా దిరుగుచుండ చిలుక బంధనము మధుర భాషణము నకు ఫలమయ్యెను అనిన లేశము. భక్తుడు పాడు తేటగీతి కొండరాళ్లనైన కరుగించు ననిన ముద్ర. రాజు చతురాస్యుఁడు, లక్ష్మీపతి, సర్వజ్ఞుఁడు ననిన రత్నావళి. వనిత ముక్కెర ముత్యము అధరకాంతిచే పద్మరాగముగ శోభించెననిన తద్గుణము. శివుని కంఠకాలిమ సోకి నల్లబడిన శేషుఁడు రాజుకీర్తిచే తెల్లనయ్యెననిన పూర్వరూపము.

రాగమున్నచోట చిరకాలమున్నను రాగి కాలేదనిన అతద్గుణము. కర్ణాభరణములగు నీలోత్పలములు తరుణి కటాక్షములచే నతి నీలములైన వనిన అనుగుణము. సహజారుణములైన చరణములందు లాక్షారసము కన్పించుట లేదనిన మీలితము. కమలాకరము నందు ప్రవేశించిన వనితల వదనములు కల్పింపకున్న వనిన సామాన్యము. రాజకీర్తిచే తెల్లనైన కొండల యందు హిమవంతుని చల్లఁదనముచే దేవతలు గుర్తించుచున్నారనిన ఉన్మీలితము. చంద్రుఁడు ఉదయింప పద్మములును, ముఖములును వేర్వేఱుగ గుర్తింపబడినవి అనిన విశేషము.

ప్రత్యేకాశయముతో కూడిన ఉత్తరము గూఢోత్తరము. దొంగ చూచుచుండ నతని మిత్రుఁడు నిలవస్త్రమును కప్పుకొనెను అనిన సూక్ష్మము. ఉదయమున నింటికిఁజేరిన చదువుకొను పుత్రునకు తల్లి భోజనము పెట్టెననిన పిహితము. ఇంటిపూఁదోటలోని పుష్పరాగముచే నొడలు ధూసరితమైనది చూడుమో చెలీ” అనిన వ్యాజోక్తి. వృషభమా! పరుల క్షేత్రము నుండి తొలఁగిపొమ్ము, క్షేత్రపాలుఁడిదే వచ్చుచున్నాఁడు” అనిన గూఢోక్తి. వృషభమా! పరుల క్షేత్రము నుండి తొలఁగి అని సూచనగా చెప్పినచో వివృతోక్తి. చెలి ప్రియుని చిత్రము గీయుచుండ పేరాకత్తె రాఁగా, బొమ్మచేతిలో పుష్ప ధనుస్సును లిఖించె ననిన యుక్తి. కొన్ని మాసములిట్లే కనులు మూసికొని సహింపుమనిన లోకోక్తి. పాము కాళ్లు పామే

ఎఱుఁగుననిన ఛేకోక్తి. పుత్రుని ఇష్టము తెలిసి కొను మన కొనుట కర్తవ్యమంత గలదా? యనిన వక్రోక్తి. దేవదానవ యుద్ధమును నేనిపుడు చూచుచుంటి ననిన భావికము. ఈశ్వరార్జునులు యుద్ధ మొనర్చిన కొండ శిఖర మదియే అనిన ఉదాత్తము. ఓ రాజా! నీవు దాతవై అవతరింప యాచకులు కల్పవృక్షములే అనిన అత్యుక్తి. ఇట్టి చేష్టలను బట్టి చూడ నీవు పోషకుఁడవను కొందుననిన నిరుక్తి. ఇది జూదము కాదోయి కితవ! వాఁడి బాణములతో క్రీడించు యుద్ధభూమి యనిన ప్రతిషేధము.

ప్రస్తుతాంశము :- ఇంతకు పూర్వమే చంద్రాలోకము ఆంధ్రభాషలోని కనువదింపబడినది. లక్షణ- లక్ష్యములతో నొప్పు నీ యలంకార శాస్త్ర విషయము నవగాహ మొనర్చుకొని మనమున నిల్పుకొనుటలో చదువరులకు గలుగు క్లేశమును అనుభవమున గుర్తించితి. ఆ క్లేశమును తగ్గించుట అసాధ్యమా? ఏల ప్రయత్నించి చూడరాదు? అని నా మనస్సున కల్గిన మథనము ఫలితమే నేనీ రూపమున జేసిన సాహసము. విషయము శాస్త్ర సంబద్ధము. చేయునది అనువాదము. శాస్త్ర విషయ ప్రతిపాదనలో సంస్కృతభాషకు గల ప్రత్యేక సౌలభ్యము ఆంధ్రభాష కమరుట దుర్లభమనుటలో కొంత సత్యము లేకపోలేదు. నాకు గల శక్తి-యుక్తులు పరిమితములనునది మరువదగని యంశము. శాస్త్ర విషయమును సులభముగ గ్రహించుటకు ఉచిత మార్గాన్వేషణేచ్ఛ యొక్క ఒత్తిడి- ఇట్టి ప్రత్యేక పరిస్థితులలో నేనీ సాహసమునకు బూనుకొంటిని. ఈ యత్నము నా యాకాంక్ష నెంతవఱకు సఫల మొనర్చునో అను విషయమున పాఠకులును, పండితవర్యులే పరమ ప్రమాణమని నా విశ్వాసము.

ఈ రచనలో మెఱుగులు దిద్దవలసిన అంశములు కొన్ని కలవని గుర్తించియు, నా శ్రేయోభిలాషుల సందర్భోచితామూల్య సూచనలను గమనించియు అదను దప్పుటచే వానినిపుడె ఇందే చేయఁజాలక పోయినందులకు కొంత మనస్తాపము నందుచు, అట్టి సూచనలిచ్చిన సహృదయు లెల్లరకును, ముఖ్యముగా సుహృద్వరులును, పండితాగ్రేసరులును, కవిశేఖర బిరుద విభ్రాజితులునగు శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావుగారికిని హృదయపూర్వక కృతజ్ఞతల నర్పించుచున్నాను. అటులనే ఇందు దొరలిన దోషముల సూచించు సరసహృదయులకును కృతజ్ఞుఁడనై మున్ముందు వానిని సముచితరీతిని సవరించుకొందునని మనవి.

కోరిన వెంటనే అత్యంతాదరము జూపి శ్రద్ధతో పరిశీలించి తగినంత వ్యవధి లభింపకున్నను అనుపమమగు నభిప్రాయములతో అభినందన సిద్ధముచేసి యిచ్చిన మాన్యశ్రీ ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, తా/ తె.వి.వి. సాహిత్యపీఠము (బొమ్మూరు) గారికి హృదయపూర్వక కృతజ్ఞతా సుమాంజలుల నర్పింతు-

సమయము తక్కువైనను, కొన్ని ఇబ్బందులకు లోనయ్యును ఈ గ్రంథమును సకాలములో ముద్రించినట్టి శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్ వారికిని కృతజ్ఞుడను.

ఇట్లు

సకల హితైషి, బుధజన విధేయుడు

**ఆలపాటి వెంకటప్పయ్య**

విజయవాడ

15-12-1992



# బాలచంద్రాలోకము

కం॥ శ్రీలక్ష్మీ యుతకేశవుఁ
డోలి నఖిలలోక శుభము లొప్పన్ బ్రోచున్
ఆలోకావన దక్షుని
వాలిన కరుణయె నిరతము పాలించు ననున్. 1

కం॥ శ్రీకరులు భక్తలోకవ
శంకరు లఖిలభువనైకశాంతికరులు నౌ
శంకర దంపతుల మదిన్
శంకలఁ బాపఁగఁ గొలిచెద సతతము ప్రీతిన్. 2

తే॥ గీ॥ భక్తలోకసేవితపాద పంకజాత
అఖిల విద్యాలవాలమై యలరుదేవి
శారదాంభోజ వదన యౌ శారదాంబ
సర్వదంబై మది నమరి సొంకఁ గొలుతు 3

తే॥ గీ॥ పార్వతీవదనాంభోజ భాస్కరుండు
పూరితాఖిల భక్తమనోరథుండు
అఖిల కార్యాది సకలజనార్చితుఁ డగు
విఘ్ననాథు నర్థించెద విఘ్న ముడుప. 4

తే॥ గీ॥ మహి నలంకారశాస్త్ర మర్మంబు నెఱిఁగి
సుధియ జయదేవుఁ డా బాలసుఖముఁ గోరి
కడఁకఁ దచ్ఛాస్త్రసార మౌ గ్రంథ మొకటి
అమరవాణిఁ చంద్రాలోక మలరఁ గూర్చె. 5

ఆ. వె. అరయ నింతకు మును పడిదము సూరన
అనువదించె దీని సంచితముగ
శాస్త్ర మభ్యసింప సాగు బాలసుఖము
కొఱకె యనువదింపఁ గోరె నతఁడు. 6

తే॥ గీ॥ ప్రథితుఁ డప్పయ్య దీక్షిత పండితుండు
సంస్కృతోక్త చంద్రాలోక మరసి, పూని
కువలయానంద మన్ వ్యాఖ్యఁ గూర్చి తసరె
సంతసంబునఁ గొనియాడ సరసులెల్ల. 7

తే॥ గీ॥ మాన్య సంస్కృతాంధ్రకవుల మహిమ తెలిఁగి
ఆర్య గురు జన బోధల నాదరించి
అనువదింపగఁ బూనెను ఆలపాటి
వేంకటప్పయ్య మితశక్తి వేడ్క మీఱ. 8

తే॥ గీ॥ అలరు కువలయానంద మన్ వ్యాఖ్యతోడ
అమరు నట్టి చంద్రాలోక క్రమము సరసి
పఠిత లంద ఱలంకార పథము దెలియ
రమణ బాలచంద్రాలోక రచనఁ జేసె. 9

తే॥ గీ॥ ప్రథితమైన చంద్రాలోక కథితమైన
లక్ష్య లక్షణంబు లరసి లలితరీతి
ఆంధ్రమునఁ జెప్ప యత్నంబు నాచరింప
గుణము గురుల దౌ దోషాల కూర్పునాది. 10

తే॥ గీ॥ ఇట్టి నా పూన్కి కార్యాన నెంతవఱకు
సఫలమైనదో యని యెంచఁ జాలువారు
అరయ నమలచిత్తు లగు విద్యార్థు, లెన్న
శాస్త్రపారంబు గని నట్టి సరసబుధులు. 11

పరిచయము : అలంకరించునవి (అందమును కల్గించునవి) అలంకారములు. కావ్యమునకు అందము గూర్చువానిని కావ్యాలంకారము లందురు. అవి శబ్దాలంకారములు, అర్థాలంకారములు అని స్థూలముగ రెండు విధములు. కావ్యముయొక్క శోభ శబ్దనిష్ఠమైన

పట్ల శబ్దాలంకారముగను, అర్థనిష్ఠమైన పట్ల అర్థాలంకారముగను అలంకారశాస్త్రము చెప్పుచున్నది. అట్లు శబ్దముల పొందిక చేతనే కావ్యమునకు శోభను కల్గించు అనుప్రాసాదులు శబ్దాలంకారములుగను, అర్థవిశేషరచనచే కావ్యమునకు శోభను కల్గించు ఉపమా-రూపకాదులు అర్థాలంకారములుగను నిర్దేశింపబడినవి.

అట్టి అర్థాలంకారములలో ప్రాధాన్యమును బట్టి ఉపమాలంకారము అలంకారములందు ముందుగా ప్రస్తావింప బడినది.

ఉపమాలంకారమునందు (1) ఉపమేయము (2) ఉపమానము (3) సాధారణధర్మము (4) ఉపమా వాచకము అను నాలుగంశములు ముఖ్యములుగ గణింపబడినవి.

1. ఉపమేయము: ఇది ఉపమ (పోలిక)కు ఆశ్రయమైనది. ముఖాదికము. ఇది ప్రస్తావమునకు సంబంధించి యుండునది.

వర్ణ్యము, విషయము, ప్రస్తుతము, ప్రాకరణికము అనునవి ఉపమేయమునకు పర్యాయపదములు అనగా సమానార్థమును బోధించు నితరపదములని భావము.

2. ఉపమానము: ఇది ఉపమ (పోలిక)ను నిరూపించునది. చంద్రాదికము. ఇది ప్రసిద్ధమై యుండు వస్తువు.

అవర్ణ్యము, విషయి, అప్రస్తుతము, అప్రాకరణికము అనునవి ఉపమానమునకు పర్యాయ పదములు.

3. సాధారణధర్మము: ఉపమాన - ఉపమేయముల రెంటియందుండు సమాన ధర్మము.

సాదృశ్యము, సదృశధర్మము, సాధర్మ్యము, సామ్యము, సమత, సామాన్యము, సమానత్వము మొదలగునవి సాధారణధర్మమునకు పర్యాయ పదములు.

4. ఉపమా వాచకము: ఇది పోలికను దెల్పు పదము.

పోలె, వలె, విధము, రీతి, భాతి, పగిది మొదలగునవి ఉపమా వాచక పదములు.

చంద్రాలోకకర్త యగు జయదేవుఁడును తన గ్రంథములోని అర్థాలంకార ప్రకరణప్రారంభమున ఉపమాలంకారమునే ముందుగా ప్రస్తావించెను.

ఇతఁడు అలంకారమును దెల్పు శ్లోకములలో పూర్వార్ధమున లక్షణమును నిరూపించుచు, ఉత్తరార్ధమున లక్ష్యమును ప్రదర్శించుచు రచన సాగించినాఁడు.

## 1. ఉపమాలంకారము

ఆ. వె. రెంట సామ్యలక్ష్మి హృద్యమై యలరంగ
గృతుల నుపమ యయ్యు నెసఁగుచుండు
అమరగంగయందు నవగాహమును సల్పు
హంస వోలె నీదు యశము కృష్ణ! 2

ఉపమానోపమేయములకు సహృదయుల హృదయములకు ఆహ్లాదమును కలిగించు సాదృశ్య మెచట వర్ణింపబడునో అచట ఉపమాలంకార మొప్పుచుండును.

ఉదా :- ఓ కృష్ణా! నీ యశము హంసవలె ఆకాశగంగ యందు మునుగుచున్నది.

ఇట యశము ఉపమేయము. హంస ఉపమానము. అమర గంగావగాహము హంసయందును, యశమునందును గల సామాన్య ధర్మము. "పోలె" అనునది ఉపమావాచకము. ప్రస్తావ విషయ

మగు యశము ఉపమేయము. సుప్రసిద్ధమగు హంస ఉపమానము. కాఁగా అమరగంగావగాహమును సామాన్యధర్మమును బట్టి వోలె (పోలె) అను ఉపమావాచక శబ్దముచే యశమునకు హంసతోడి పోలిక స్పష్టముగా తెలుపబడినది. కాన ఇది ఉపమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఈ లక్ష్యమందు ఉపమాలంకారముయొక్క ముఖ్యాంశములు నాలుగును చెప్పబడినందుచే నిట పూర్ణోపమాలంకారమున్నదని చెప్ప నొప్పును.

ఉపమా యత్ర సాదృశ్య లక్ష్మీ రుల్లసతి ద్వయోః,
హంసీవ కృష్ణ! తే కీర్తిః స్వర్గఙ్గా మవగాహతే.

యత్ర=ఎచ్చట, ద్వయో=రెంటికి అనగా ఉపమానోపమేయములకు, సాదృశ్యలక్ష్మీః=సామ్యసౌందర్యము, ఉల్లసతి=చక్కగా ప్రకాశించునో, (అచట) ఉపమా=ఉపమాలంకారము (ఉండును). హేకృష్ణః=ఓ కృష్ణుఁడా! తే=నీయొక్క, కీర్తిః=యశస్సు, హంసీ+ఇవ=ఆడుహంసవలె, స్వర్గఙ్గాం=ఆకాశగంగలో, అవగాహతే=మునుగుచున్నది.

ఈ నాలుగంశములలో ఒకటియో, రెండో లేక మూఁడో లోపించినను అచట ఉపమానోపమేయములకు ఔపమ్యము (పోలిక) గమ్యమానమైనచో అది లుప్తోపమ యనఁ బడును.

## లుప్తోపమాలంకారము

ఆ. వె. వాచకోపమానవర్ణ్య సామ్యములందు
నొండు, రెండు, మూఁడు నుడిగి చెప్ప
లుప్తమైన ఉపమ లోకమందుఁ బరఁగు
అష్టవిధము లయ్యు నార్యకృతుల. 2

ఆ. వె. చక్క గనఁగ నయ్యె సౌదామనీ గౌరి
ఇందు తుల్యవదన ఇంతి యొకర్తు
కర్పూర స్త్రి, కాంతి కామవధూయుక్తి
అగుచు నొంటి మెలఁగు నర్ధరాత్రి 3

ఆ. వె. ఆమె తోడ నొకని కంటె నే సంగంబు ?
ఆమె సురతశ్లాఘ మమరె నెది ?
కనఁగ నదియు నంత కాకతాళీయంబు
ఉర్వి నది యు తర్కితోపనతము. 4

1. ఉపమానము 2. ఉపమేయము 3. సమానధర్మము 4. ఉపమావాచకము అను ఉపమాలంకారాంగముల నాల్గింటిలో ఒకటి రెండు మూఁడంగములను విడిచియు ఆయా సందర్భములలో ఉపమాలంకారములు కూర్పఁ బడును. అట్టివానిని లుప్తోపమాలంకారము లందురు. అవి యెనిమిది విధములు.

1. వాచకలుప్త 2. ధర్మలుప్త 3. ధర్మ వాచకలుప్త 4. వాచకోపమేయలుప్త 5. ఉపమానలుప్త 6. వాచకోపమానలుప్త 7. ధర్మోపమానలుప్త 8. ధర్మోపమానవాచకలుప్త. ఇందు వరుసగ నుండు మొదటి నాలుగు విధములైన లుప్తోపమలయందు ఉపమానము మాత్రము లోపింపకుండుటయు, మిగిలిన నాల్గింటిలో ఉపమాన లోపము తప్పక యుండుటయు గమనింప దగినది.

క్రమముగా వీనికి ఉదాహరణములు :-

1) సౌదామనీగౌరి యింతి కనఁగ నయ్యె నను నపుడు "సౌదామనీవ గౌరి" అనునది వివక్షితార్థము. అనగా సౌదామని (మెఱపు) వలె గౌరవర్ణము గల యింతి అని భావము. కాఁగా ఇంతి సౌదామనీ

గౌరీ అనుచోట వరుసగా ఇంతి (ఉపమేయము), సౌదామనీ (ఉపమానము), గౌరి (సమానధర్మము) అను ఉపమాలంకారాంశములు మూఁడును ఉన్నవి. కాని ఉపమావాచకమగు ఇవ సమాసములో లోపించినది (కన్పించకుండ పోయినది). కావున ఇది వాచకలుప్తా సమాసమునకు లక్ష్యమగును. ఇవార్థమిట గమ్యమానమగును.

2) "ఇంతి ఇందు తుల్యవదన" అనునపుడు ఇంతి ఇందుని (చంద్రుని)తో తుల్యమైన వదనము గలది అనఁగా ఇంతి వదనము ఇందునితో తుల్యమైనదనుట స్పష్టము. కాగా ఇట ఉపమేయము (ఇంతి వదనము), ఉపమానము (ఇందుడు), ఉపమావాచకము (తుల్యపదము) అను మూఁడును చెప్పబడినవి. సమానధర్మము మాత్రము చెప్పబడలేదు. కావున ఇది ధర్మలుప్తోపమాలంకారము నకు లక్ష్యమగుచున్నది.

3) "ఇంతి కర్పూర స్తి" అనునపుడు ఇంతి కర్పూరమివ ఆచరస్తి అను దానికి (కర్పూరమువలె ఆచరించుచున్నది అనగా కర్పూరమువలె చల్లనై ఆనందదాయకమగుచున్నది) అని అర్థము. ఆ యర్థమందు విధింపబడిన- ఆనందాత్మకమగు ఆచారార్థకమైన 'క్విప్' అను ప్రత్యయము 'ఇవ' శబ్దముతోకూడ లోపించినది. కావున ఇట ఉపమేయ-ఉపమానవాచకములగు ఇంతి, కర్పూరపద ములు చెప్పబడినను ఆనందజనకము అను సాధారణధర్మము, 'ఇవ' అను ఉపమావాచకమును లోపించినవి. అందుచే ఇది ధర్మవాచక లుప్తోపమాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇట నేత్రములకు 'ఆనందజనకమై' అని సాధారణధర్మస్వీకారముకూడ జరుగవచ్చును. కాన ఇట ధర్మలోపము ఐచ్ఛికముని (ఇష్టముపై ఆధారపడినది) అని గమనింపదగును.

4) "ఇంతీ కాంతిఁ గామవధూయన్తీ" అని చెప్పినపుడు ఇంతి కాంతిన్ (కాంతిచే) అను విశేషణబలమును బట్టి 'స్వాత్మానం కామవధూమివ ఆచరన్తి' (తనను కాముని పత్నియగు రతీదేవిని వలె చేసికొనుచున్నది. అను నర్థము గమ్యమానము (ఒకానొక అర్థమును తెల్పెడు మాట లచట లేకున్నను స్ఫురించునది) అగుచున్నది. కావున ఇట ఈ వాక్యార్థము 'ఆత్మానం' అను పదముతో అన్వయము కలిగియున్నది. కాఁగా ఇట సాధారణ ధర్మవాచకమగు కాంతి పదము, ఉపమానవాచకమగు 'కామవధూ' పదము మాత్రమే చెప్పబడినది. మిగిలిన ఉపమేయవాచకమగు ఆత్మశబ్దముగాని, ఉపమావాచకమగు 'ఇవ' శబ్దముగాని చెప్పబడలేదు. ఇవి రెండును లోపించినవి. కాన ఇది వాచక-ఉపమేయలుప్తోపమాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇట "స్వాత్మానం కామవధూయన్తి" అని ఉపమేయపదమును కూడ చెప్పుట కవకాశముండుటచే ఈ లోపము కూడ ఐచ్ఛికమని గమనింప దగును.

5) "ఆమె తోడ నొకని కమరిన సంగము (చేరిక) కాకతాలీయము అతర్కితోపనతము" అనుచోట ఒకానొక పురుషుఁడు ఒంటిగా మెలఁగు ఇంతి వద్దకు వచ్చుట ఉపమేయము. కాకతాలము అనునది ఉపమానము. అవితర్కితోపనతము అనునది సామాన్యధర్మము. కాకతాల మివ కాకతాల మనుచోట ఇవ ఉపమావాచకము. (కాకతాలీయము నందలి కాక-తాల శబ్దములు సమాస విషయమున కాక-తాల సమవేత క్రియలయందు వర్తించును. కావున కాకాగమనమివ తాల పతన మివ='కాకతాల' మని ఇవార్థమున సమాస మేర్పడును.

అపుడు 'కాకాగమనమును తాలపతనమును' ఉపమానము. 'ఒకానొకడు ఒక రహఃప్రదేశమున కేగుట, ఆ విజన (జనులులేని) ప్రదేశమునందే తన్వి యుండుట' అనునది ఉపమేయము అయితే

ఇట ఉపమేయము వేఱుగ చెప్పబడనందువలన పై ఉపమానభావము ఉపమేయముతో అన్వయించుట కుదురదు. అందువలన కాకతాల సమాగమమే ఉపమానమని చెప్పవలయును. అపుడు పై సమాసమును బట్టి అతని (అ యొకానొకని)యొక్కయు, తన్వి యొక్కయు సమాగమము ఉపమేయమగును. దానివలన 'ఆపురుషుని-తన్వి సమాగమము కాక-తాల సమాగమ సదృశము' అని ఫలితార్థము సిద్ధించును. కాఁగా కాకాగమన-తాలపతన రూపమగు ఏ సమాగమము గలదో అది ఉపమానము. అది ఇట చెప్పబడనందువలన ఈ పై దెల్పిన వాక్యము ఉపమానలుప్త-ఉపమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

6) పై 6వ ఉదాహరణము క్రింద దెల్పినట్లు ఇవార్థమున 'కాకతాలమ్' అను మొదటి సమాస మేర్పడిన పిమ్మట 'కాకతాలమివ=కాకతాలీయమ్' అని ఇవార్థమునందే రెండవ సమాస మేర్పడును. ఇట 'ఇవే ప్రతికృతౌ' అను నధికారసూత్ర పరిధియందు గల "సమాసాచ్చ తద్విషయాత్" అను సూత్రముచే "ఛ" ప్రత్యయము వచ్చును. అపుడు పతనదలితమైన (పడుటచే బద్ధలైన) తాలఫలమును కాకి యెట్లు ఆస్వాదించెనో, అట్లే రహోదర్శనముచే కలతపడిన హృదయముగల తన్విని అతఁడనుభవించెను అను నర్థము సిద్ధించుచున్నది.

ఇట్లు ఈ సమాసోర్థోపమయందు కాకకృత తాలఫలోపభోగ (కాకిచే నగు తాలఫలానుభవ) రూపమగు ఉపమానమును, ఉపమావాచకమును లోపించుటచే ఇది ఆఱవదియగు వాచకోపమానలుప్త ఉపమాలంకారమునకు లక్ష్యమగును. ఈ లోపము "ఛప్రత్యయ విధాయకమగు వ్యాకరణసూత్రముచే నేర్పడినది.

7) పైన దెల్పిన 5, 6 లుప్తోపమాలంకారములందు సాధారణధర్మమును దెల్పు "ఉర్వీనది యతర్కితోపనతము" అను దాని స్థానమున "ఏమి చెప్ప నోపు దేను సఖుఁడః" అను దానిని చేర్చినచో ఐదవదగు ఉపమానలుప్తకు సమానధర్మముఁకూడ లోపించు అపుడిది ఏడవదగు ధర్మోపమానలుప్త - ఉపమాలంకారమునకు లక్ష్యమగును.

8) 7లో దెల్పినట్లు అనగా 4వ పాదమును "ఏమి చెప్పనోపు దేను సఖుఁడః" అనునట్లు మార్చినపుడు ఆఱవదగు వాచకోపమాన లుప్తోపములో సమానధర్మముకూడ లోపింపగా, ఎనిమిదవదగు ధర్మ-ఉపమాన-వాచకలుప్త-ఉపమాలంకారమున కిది లక్ష్యమగును.

సం॥ వర్ణ్యోపమాన ధర్మాణాం ఉపమా వాచకస్య చ,
ఏక-ద్వి-త్ర్యనుపాదానా ద్భిన్నా లుప్తోపమాష్టధా॥ 2
తటిద్గౌరీందుతులాస్యా కర్పూర స్తీ దృశోర్మమ,
కాన్త్యా స్మర వధూయన్తీ దృష్టా తన్వీ రహో మయా. 3
యత్తయా మేలనం తత్ర లాభో మే యశ్చ తద్రతేః,
తదేత త్కాకతాలీయం అవితర్కిత సంభవమ్॥ 4

(2) వర్ణ్య+ఉపమాన+ధర్మాణామ్ = ఉపమేయ-ఉపమాన-సమానధర్మములు, ఉపమావాచకస్య+చ=ఉపమావాచకమగు 'ఇవ' అను ఈ నాల్గింటిలో ఏక+ద్వి+త్రి+అనుపాదానాత్=ఒకదానిని, రెంటిని, మూఁడింటిని స్వీకరింపకుండుటచే (అనగా చెప్పకుండుటచే) లుప్తోపమా=లుప్తోపమ యను అలంకారము, అష్టధా=ఎనిమిది విధములుగా, భిన్నా=విభజింపబడినది.

(3) తటిద్గౌరీ=మెఱపువలె గౌరవర్ణము గల్గినట్టియు, ఇందు+తుల్య+ఆస్యా=చంద్రునితో, సమానమైన, ముఖము కలిగినట్టియు,

షుమ+దృశోః=నా రెండు కన్నులకు, కర్పూర స్తి = కర్పూరము వలె అచరించునట్టిదియు, కాన్త్యా=దేహకాంతితో, స్మరవధూయ స్తి= మన్మథుని భార్యయగు రతీదేవివలె ఆచరించునట్టిదియు (నగు) తన్వీ=తరుణి, మయా = నాచే, రహః = ఏకాంతమునందు (మఱె వ్వరునులేనిచోట), దృష్టా=చూడబడినది.

(4) తత్ర=ఆ ప్రదేశమునందు, తయా = ఆ తరుణితో, మే=నాకు, మేలనం (ఇతి) యత్=సమావేశమునది యేది (కలిగెనో), (నాకు) తత్+రతేః=ఆమెతోడి, సంగమముయొక్క, యః+ లాభః+చ=ఏ లబ్ధియు (కలిగెనో), తత్+ఏతత్=అట్టి ఇదంతయు, కాకతాలీయమ్ = కాకతాలీయము, అవితర్కితసంభవమ్ = ఊహింప కయే జరిగినదియు.

## 2. అనన్వయాలంకారము

ఆ. వె. ఒక్క వస్తు వెచట నుపమాన ముపమేయ
మౌ నచట ననన్వయంబు దనరు
చంద్రుదురీతి నలరు చంద్రుండు శోభతో
ననఁగ సార్థకం బనన్వయంబు. 5

ఒక్క వస్తువునకే ఉపమానోపమేయ భావమును చెప్పినచో అనన్వయాలంకార మన నొప్పును.

సాధర్మ్యము భిన్న వస్తువులకు చెప్పబడును. కావున వర్ణ్యమానవస్తువునకైనను తనకు తనతోడి సమానధర్మము చెప్పుట కుదురదు. '(స్వస్య స్వేన సాధర్మ్యం) న అన్వేతి' అను వ్యుత్పత్తిని బట్టి అనన్వయము (అన్వయించనిది) అను పేరు ఈ యలంకారమునకు సార్థకము.

ఉదా :- చంద్రుఁడు చంద్రుని వలె శోభతో నలరును.

ఇట చంద్రుఁడు ఉపమేయము. చంద్రుఁడే ఉపమానము. వలె-ఉపమావాచకము. శోభతో నలరుట, సమానధర్మము. ఇచట చంద్రుఁడొకఁడే ఉపమేయముగను, ఉపమానముగను చెప్పఁబడినాఁడు. కావున నిది అనన్వయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇట్లు చెప్పుటచే చంద్రుడు శోభచే సాటిలేనివాడు. అనఁగా చంద్రుడు సాటిలేని శోభగల వాఁడనునది తాత్పర్యము.

సం॥ ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః,
ఇందు రిందు రివ శ్రీమానిత్యాదౌ తదనన్వయః. 5

ఏకస్య+వస్తునః+ఏవ=ఒక్క, వస్తువునకే; ఉపమాన+ఉపమేయత్వమ్=ఉపమానత్వమును, ఉపమేయత్వమును, (వర్ణితం+ఇతి+) యత్=(వర్ణింపబడినది అనుట) యేది గలదో, తత్=అది, 'ఇందుః=చంద్రుడు, ఇందుః+ఇవ=చంద్రునివలె, శ్రీమాన్=శోభ కలవాఁడు' ఇతి+ఆదౌ=అనుమొదలగుదానియందు, అనన్వయః=అనన్వయాలంకారము, (స్యాత్=అగును).

## 3. ఉపమేయోపమాలంకారము

తే. గీ. ఉభయభావంబు పర్యాయ యోజ్య మయ్యు
ఉభయమున కమర నుపమేయోపమ యగు
ధర్మ మర్థ మట్ల ర్థంబు ధర్మ మటుల
అధిప! నీయందు పూర్ణశోభాన్వితములు. 6

రెండు వస్తువులకు ఉపమానోపమేయ భావము పర్యాయమున అమరునట్లు చెప్పినయెడల ఉపమేయోపమాలంకార మగును.

ఆ రెండు వస్తువులలో నొకటి ఉపమేయమైనపుడు రెండవ

వస్తువు ఉపమానముగను, రెండవది ఉపమేయమైనపుడు మొదటి వస్తువు ఉపమానముగను ఉండునట్లు పోలిక చెప్పబడినచో ఉపమేయోపమాలంకార మగును.

ఉదా :- ఓ యుధిష్ఠిరా! నీయందు ధర్మము అర్థమువలెను, అర్థము ధర్మమువలెను పూర్ణశోభతో గూడియున్నవి

ఇటు ధర్మము అర్థమువలె పూర్ణశోభానిత్వము అనునపుడు ధర్మము ఉపమేయము. అర్థము ఉపమానము. పూర్ణశోభాన్వితత్వము సమానధర్మము. వలె-ఉపమా వాచకము.

ఇంక అర్థము ధర్మమువలె పూర్ణశోభాన్వితము అనునపుడు అర్థము ఉపమేయము. ధర్మము ఉపమానము. సామ్య - ఉపమా వాచకములలో మార్పులేదు.

కావున ఉక్తలక్షణమునుబట్టి ఇది ఉపమేయోపమాలంకారమునకు లక్ష్యమగును.

ధర్మార్థములు రెండును పరస్పరము పోల్చదగినవేగాని, ఈ రెండింటిలో ఏ యొకదానితోను పోల్చదగిన మూడవవస్తువు లేనే లేదనుటయే దీనికి ఫలము.

సం॥ పర్యాయేణ ద్వయో స్తచ్చే దుపమేయోప-మా మతా,
ధర్మో౽ర్థ ఇవ పూర్ణశ్రీ రర్థో ధర్మ ఇవ త్వయి. 6

ద్వయో=రెండు వస్తువులకు, పర్యాయేణ=పర్యాయ క్రమముతో, తత్=ఆ ఉపమేయోపమాన భావము, (వర్ణితం) చేత్= (వర్ణింపబడిన) యెడల (అది) ఉపమేయోపమా=ఉపమేయోపమాలంకారముగ, మతా=అంగీకరింపబడినది. ధర్మః=ధర్మము, అర్థః+ఇవ=అర్థమువలెను, అర్థః = అర్థము, ధర్మః+ఇవ = ధర్మమువలెను, త్వయి=నీయందు, పూర్ణశ్రీః=పూర్ణశోభాన్వితము.

# 4. ప్రతీపాలంకారము

ఈ యలంకారము ఐదు విధములు. అందు మొదటిది :

ఆ. వె. విషయికి విషయత్వ మొసఁగఁ గల్పించిన
కని ప్రతీప మయ్యు నలరు కృతుల
నీ ముఖసదృశుండు నిండు చంద్రుడు కాఁగ
నీ నయనసమంబు నీరజంబు. 7

ఉపమానమునకు ఉపమేయత్వమును కల్పించినచో ప్రతీపాలంకార మగును.

ఉదా :- నిండు చంద్రుఁడు నీ ముఖసదృశుండు. నీరజంబు నీ నయనసమము. ఉపమాన మెప్పుడును ప్రసిద్ధమై, శ్రేష్ఠమైన దిగా నుండును. కాఁగా ఉపమానములుగా గ్రహింపబడు చంద్రుఁడు నీరజముకూడ ఈ యుదాహరణమందు లోకప్రసిద్ధికి ప్రతికూలముగా చంద్రుఁడు ముఖసదృశు డనియు, నీరజము నయన సదృశ మనియు చెప్పి చంద్ర-నీరజములకు ఉపమేయభావము కల్పింపబడినది. కావున నిది పై ప్రతీపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ప్రసిద్ధ విధానమున కిందు ప్రతీపగమనము ఉండుటచే దీనికి ప్రతీపాలంకారము పేరు సార్థకమగుచున్నది. ఈ విరుద్ధ విధానము వలన వర్ణ్యములగు ముఖ-నయనములకు గుణోత్కర్షమును కల్గించుటయే ప్రయోజనము.

సం॥ ప్రతీప ముపమానస్యోపమేయత్వ ప్రకల్పనమ్,
త్వల్లోచనసమం పద్మం, త్వద్వక్త్ర సదృశో విధుః॥.

ఉపమానస్య = విషయికి, ఉపమేయత్వప్రకల్పనమ్ = ఉపమేయభావమును కలుగజేయుట, ప్రతీపమ్ = ప్రతీపాలంకారము

(అగును). పద్మమ్=కమలము, త్వత్+లోచన+సమమ్=నీ, నేత్రముతో, సమానమైనది; విధుః=చంద్రుఁడు, త్వత్ + వక్త్ర+సదృశః=నీయొక్క, ముఖముతో, తుల్యమైనవాఁడు.

రెండవ భేదము :

ఆ. వె. అన్యవిషయ లబ్ధి నరసి ప్రస్తుతమును
తెగడ నుండు కృతి ప్రతీప మొండు
గర్వ మంద నేల కామ్యవదన! నీవు ?
కన భవాదృశుండె కాంతి శశియు. 8

వర్ణనీయముగాని అనఁగా అవర్ణ్యమైన అన్యము (ఉపమానము) నే ఉపమేయముగా గ్రహించి, వర్ణనీయమగు ఉపమేయమును ఉపేక్షించినచో అదియు వేఱొక ప్రతీపాలంకార మగును.

ఉదా :- కమనీయ వదనమా! నీవు గర్వమందనేల? పరికింప కాంతిచే శశియు (చంద్రుఁడు) నీకు తుల్యుడే.

ఇట శశి అవర్ణ్యమైన ఉపమానము. వదనము వర్ణ్యమైన (వర్ణింపదగిన) ఉపమేయము. కాంతి-సమానధర్మము. ఇట వదనమునకు కాంతిలో తనకు సాటియైనవారు లేనేలేరను గర్వభావము ఉన్నట్లు స్పష్టమగుచున్నది. అట్టి వదనమును ఉద్దేశించి చంద్రుఁడును కాంతిచే నీకు సదృశుఁడే. కావున నీకు గర్వము తగదని చెప్పుటచే ప్రస్తుతము నందనాదరభావము వ్యక్తము చేయబడినది.

కాంతి మత్త్వమందు సుప్రసిద్ధ చంద్రుని ఉపమేయముగ నెంచుట, ఆతనికిని కాంతి యున్నదని చెప్పుటచే చంద్రునకు న్యూనతకల్పన మూలమున ప్రస్తుత వదనమునకు ఉత్కర్షమే చెప్పినట్లైనది. కావున ప్రసిద్ధ పద్ధతికి ప్రతీపగమనము చెప్పబడి

నది. ప్రస్తుతము (ఉపమేయమునకు) ఉత్కర్ష కథనరూప ప్రయో జనము స్పష్టముగుటచే నిది రెండవ ప్రతీపాలాంకారమునకు లక్ష్య మగుచున్నది.

సం॥ అన్యోపమేయలాభేన వర్ణ్యస్యానాదరశ్చ తత్,
అలం గర్వేణ తే వక్త్ర! కాన్త్యా చంద్రో భవాదృశః.

అన్య+ఉపమేయ+లాభేన=వేఱొక, ఉపమేయము, లభించు టచే; వర్ణ్యస్య=ప్రస్తుతమగు నుపమేయమునకు; అనాదరః+చ= తిరస్కారముకూడ, తత్=ఆ ప్రతీపాలంకారము (అగును). హే వక్త్ర! = ఓ ముఖమా; తే=నీయొక్క; గర్వేణ+అలమ్=గర్వము చే, చాలును. అనఁగా నీవు గర్వించినంతవఱకు చాలును అని భావము. చంద్రః=చంద్రుడు; కాంత్యా = కాంతిచే; భవాదృశః = నీతో తుల్యుఁడే.

మూడవ భేదము :

ఆ. వె॥ వర్ణ్యవిషయలబ్ధి వదల నన్యాదృతి
కృతిఁ బ్రతీప మొండు నెసఁగు చుండు
క్రౌర్య దర్ప మేల? కఠిన మృత్యువ! నీకు
త్వత్సదృశ వనితలు వసుధఁ గలరు. 9

ప్రస్తుతమగు వర్ణ్యము (ఉపమేయము) లభించుటచే, అన్యము (అప్రస్తుతము) అగు నుపమానమున అనాదరము చూపిన యెడల అదియు మఱియొక ప్రతీపాలంకార మగును.

ఉదా :- ఓ కఠినమైన మృత్యువా! క్రౌర్యదర్పము నీకేల? భువిలో (క్రౌర్యవిషయమున) నీకు సాటియగు వనితలున్నారు లే.

ఇట వనితలు - ఉపమేయము. మృత్యువు - ఉపమానము. క్రౌర్యదర్పము-సామాన్యధర్మము. క్రౌర్యము విషయములో తానే

అన్నింటిని మించితి నను గర్వము మృత్యువునకు గలదు. అది అందఱికి తెలిసినదే. భువిలో నిపుడంతటి క్రూరత్వము గల స్త్రీ లున్నారు అని చెప్పుట మూలమున ఉపమానమునకు తిరస్కారము స్పష్టమే. వర్ణ్యమగు క్రూరవనితల లబ్ధిచే అవర్ణ్యమగు మృత్యువు యొక్క తిరస్కృతి చెప్పబడినందున ఇదియు నొక ప్రతీపాలంకార మగుచున్నది.

పై రెండవ ప్రతీపమందు ఉత్కృష్ట గుణవంతమగు నుపమేయ మందనాదరమును ఇట నుత్కృష్ట గుణవంతమగు ఉపమానము నందనాదరము చెప్పబడినది. ఈ భేదము గమనింపదగును.

సం॥ వర్ణ్యోపమేయలాభేన తథాన్యస్యాప్యనాదరః,
కః క్రౌర్యదర్ప స్తే మృత్యో! త్వత్తుల్యా స్సన్తి హి స్త్రియః

తథా=దీనికి ముందు చెప్పినట్లె, వర్ణ్య+ఉపమేయ+లాభేన=వర్ణింపదగిన ప్రస్తుతమగు, ఉపమేయము, లభించుటచే; అన్యస్య+అపి=అప్రస్తుతమగు నుపమేయమునకును, అనాదరః=తిరస్కృతి (చెప్పబడినట్లైతే) అదియు నొక ప్రతీపాలంకారముగును(అగును.)

తే॥ గీ॥ వఱలు నొండు ప్రతీపం బవర్ణ్య మందు
వర్ణ్యసమత కనిష్పత్తిఁ బరఁగఁ జెప్ప
అంబుజం బది త్వద్వదనాభ మనుట
మూర్ఖుల ముఖా పవాద మో ముగ్ధనయన. 10

ఉపమానమునకు వర్ణ్యముతో సామ్యము నిష్పన్నము కాదు (సిద్ధింపదు లేక పొసగదు) అని చెప్పినచో అదియు వేఱొక ప్రతీపాలంకార మగును.

ఉదా ;- ఓ ముగ్ధాక్షీ! అంబుజము నీ ముఖాభ మనుట మూర్ఖులయొక్క పనికిమాలిన (నిష్ఫలమగు) చెడ్డవాదమే.

ఇచట ముఖము-వర్ణ్యము. అంబుజము-అవర్ణ్యము (ఉపమానము). ఆభ-అనునది సమానధర్మము. ముఖమును అంబుజముతో పోల్చుట ప్రసిద్ధమగు పద్ధతి. దానికి విరుద్ధముగ అంబుజమునే ముఖముతో పోల్చుటచే నిది ప్రతీపాలంకార మగుట స్పష్టమే. కాని యిటనున్న మూర్ఖుల, ముధాపవాదమను పదములనుబట్టి అట్టి పోలికయే పొసగనిదని తెల్పబడినది. అందుచే అంబుజ మత్యంత తిరస్కృతము కాఁగా వర్ణ్యమున కత్యంతోత్కర్షా పాదకమగు చున్నది. కావున నిది నాల్గవ ప్రతీపాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

వర్ణ్యే నాన్యస్యోపమాయా అనిష్పత్తి వచశ్చ తత్,
ముధా పవాదో ముగ్ధాక్షి! త్వన్ముఖాభం కిలామ్బుజమ్.

వర్ణ్యేన=ఉపమేయముతో; అవర్ణ్యస్య = ఉపమానమునకు, ఉపమాయా=పోలిక(కు), అనిష్పత్తి వచః+చ=కుదురదు అని చెప్పుటయు; తత్ = అది (ఆ ప్రతీపాలంకారము) (అగును). హే ముగ్ధాక్షి = ఓ మోహింపజేయు చూపులు కలదానా! అమ్బుజమ్= పద్మము; త్వత్+ముఖ+ఆభమ్ = నీ, ముఖముయొక్క, కాంతివంటి కాంతి గలది. (అనుట); ముధా+అపవాదః+కిల = మిథ్య యగు అపవాదమే కదా!

ఐదవ భేదము :

ఆ. వె. ఒనరఁ జెప్పి రేని యుపమానకైమర్థ్య
మగు ప్రతీప మన్య మంద్రడు బుధులు.
వనితమోము కనఁగఁ బంకజం బది యేల ?
పూర్ణ చంద్రుఁ డేల ? పూతచరిత ! 11

కిమర్థమ్=ఎందులకు; కిమర్థస్య భావః=కైమర్థ్యమ్; కైమర్థ్యమ్ అనగా నిష్ప్రయోజనము అని తాత్పర్యము.

"ఉపమేయమే ఉపమానకార్యములను నెరవేర్చుచుండగా ఉపమానము వలన ప్రయోజనమేమి?" అను భావమును దెల్పుట అనుపమాన కైమర్థ్యమును చెప్పిన యెడల నదియు వేరొక ప్రతీపాలంకార మగును.

ఉదా :- (ఆహ్లాదకరమగు) వనితయొక్క ముఖమును కాంచఁగా ఇంక పంకజ మేల ? పూర్ణచంద్రుడేల ? (ఆ రెండింటితో ప్రయోజనము లేదని భావము).

ఉపమేయము అగు ముఖమును గాంచినంతనే ఆహ్లాదాదులు కలుగుచుండ నుపమానములగు పంకజ-చంద్రుల వలన ప్రయోజనము లేదని "పంకజమేల ? చంద్రుఁడేల" అని కైమర్థ్యము చే చెప్పబడినది. కనుక నిది మఱియొక విధమగు ప్రతీపాలంకారము అగుచున్నది.

సం॥ ప్రతీప ముపమానస్య కైమర్థ్య మపి మన్వతే,
దృష్టం చే ద్వదనం తస్యాః, కిం పద్మేన కి మిందునా?

ఉపమానస్య=ఉపమానముయొక్క; కైమర్థ్యమ్+అపి=కిమర్థము ను ప్రశ్న కూడ; ప్రతీపమ్=ప్రతీపాలంకారమునుగా, మన్వతే=(పండితులు) భావించు (అంగీకరించు) చున్నారు. తస్యాః=వనిత యొక్క, వదనమ్=ముఖము; దృష్టం+చేత్=చూడబడినదైన; పద్మేన+కిమ్=పద్మముతో ప్రయోజన మే మున్నది ? ఇందునా+కిమ్=చంద్రునితో ప్రయోజనమేమి ?

## 5. రూపకాలంకారము

తే॥ గీ॥ పొసఁగు రూపకం బుపమేయమునకుఁ గృతి వి
షయ భేద తాద్రూప్య రంజనముఁ గూర్ప
నప్పు నధికతా న్యూనతా నుభయరీతి
ననువ్యధంబుల రూపక [1]మ్మొలయు చుండు. 12

1. కలుగు, వ్యాపించు

ఆ. వె. పరఁగఁ జూడుఁ డితఁడే ప్రత్యక్ష [1]ధూర్జటి
క్షణములోఁ బురములఁ గాల్చె నెవఁడు ?
మూఁడవ కను లేని భువి శూలి యీతండు
ఇతఁడిల సమదృష్టి నేలు హరుఁడు. 13

ఆ. వె. కనుల పండు వమరఁ గాంతాస్యచంద్రుచే,
[2]కలువ లేని వలన ఫల మ దేమి ?
అపరలక్ష్మి యీమె [3]అసుధార్ణవిత
ఇమ్ముఖేందుఁ డెసఁగు [4]న వ్యృగాంకు 14

విషయి అనగా నుపమానముగ జెప్పఁబడు పద్మము, చంద్రుఁడు మొదలైనవి. విషయమనఁగా నుపమేయముగాఁ జెప్పఁబడు వర్ణనీయమైన ముఖము మొదలైనది. విషయియొక్క రూపము చేత విషయముయొక్క రంజనము (రంగువేయుట వంటి ఆరోపణము) రూపకమనఁ బడును. ఆ రంజనము ఒక్కొక్కచోట కవి సంప్రదాయమును బట్టి ప్రసిద్ధమగు నుపమానముతో అభేదము నందే పర్యవసించును (భేదమును చెప్పుటయందే ముగియును). ఒక్కొక్కచోట భేదము ప్రతీయమాన మగుచుండ ఉపమానము యొక్క ధర్మారోపణమాత్రమందే ఆ రంజనము పర్యవసించును. అనగా రంజన మనునది ఒక్కొక్కచోట అభేదాత్మకముగను, ఒక్కొక్కచోట తాద్రూప్యాత్మకముగను ఉండునని భావము. ఈ రంజనము అభేదాత్మకమైనను, తాద్రూప్యాత్మకమైనను సహృదయ హృదయాహ్లాదకరముగ నుండవలయును. కావుననే రూపకము అభేదరూపకమని, తాద్రూప్యరూపకమని రెండు విధములుగ నుండును.

ఈ రెండు విధములగు రూపకము ప్రత్యేకము మూఁడేసి విధములుగ నుండును. ప్రసిద్ధ విషయి (ఉపమానము) కంటె

1. శివుఁడు. 2. చంద్రునివలన 3. పాలసముద్రము నుండి పుట్టినది కాని 4. ఆ చంద్రుని

ఉపమేయమునకు ఆధిక్యమునో, న్యూనత్వమునో, అనుభయమునో (అధిక్య-న్యూనత్వములు లేనట్లో) వర్ణించుటచే ఒక్కొక్కటి ముప్పి ధములై ఆఱు విధములుగా నుండును.

1. అధికాభేదరూపకము 2. న్యూనాభేదరూపకము 3. అను భయాభేదరూపకము 4. అధికతాద్రూప్యరూపకము 5. న్యూనతా ద్రూప్యరూపకము 6. అనుభయతాద్రూప్యరూపకము.

ఈ క్రమము ఇచ్చిన ఉదాహరణములలో ఈ క్రింది రీతిగా మారినది. 1. అనుభయాభేదరూపకము 2. న్యూనాభేదరూపకము 3. అధికాభేదరూపకము 4. అనుభయతాద్రూప్యరూపకము 5. న్యూన తాద్రూప్యరూపకము 6. అధికతాద్రూప్యరూపకము,

ఉదా :- క్షణములో (శత్రు) పురముల నెవ్వఁడు దహిం చెనో ఆ ప్రత్యక్ష ధూర్జటియే ఇతఁడు. చూడుడు.

ఇట ఇతఁడు అనఁగా వర్ణనీయుఁడగు రాజు ఉపమేయము; ఉపమానము ధూర్జటి; శత్రుపుర దహనము సమానధర్మము. ఈ ధర్మమును బట్టి ప్రస్తుతమగు రాజునకు అప్రస్తుతమగు ధూర్జటితో ఆధిక్య-న్యూనతలు లేక అనుభయముగు రీతిలో ఆ ధూర్జటియే ఇతఁడని అభేద రంజనము చెప్పబడినందుచే ఇది అనుభయాభేద రూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- మూఁడవ కనులేని (భువిలోనుండు) శూలియే ఇతఁడు.

ఇట ఇతఁడన వర్ణనీయుఁడగు రాజు-ఉపమేయము. శూలి- ఉపమానము. ఇందు ఉపమేయమునకు ఉపమానముతో అభేద రంజన మున్నది. కావున నిది రూపకము. "మూఁడవకనులేని శూలి" అనుటచే ఉపమానము కంటె ఉపమేయమునకు న్యూనత్వము వర్ణింప బడినది. కాన నిది న్యూనాభేదరూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- ఇతఁడిల సమదృష్టి నేలు హరుఁడు.

ఇందును వర్ణనీయుఁడగు రాజు-ఉపమేయము. హరుఁడు-ఉపమానము. ఇతఁడు హరుఁడనుటచే అభేదరంజన మున్నది గాన అభేదరూపకము. కాని హరునకు ఉండు విషమ (సమముకాని, పక్షపాతముగల, అందఱివలె సమసంఖ్యలోలేని) దృష్టి లేక, సమదృష్టితో నేలు వాఁడితఁడనుటచే ఉపమానము కంటె నుపమేయ మాధిక్యము కలదిగా చెప్పఁబడినందువలన ఇది అధికాభేదరూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- కాంతాస్య చంద్రునిచే కనులకు పండువు అగుచుండ కలువతేని (చంద్రుని) వలన ఫలమేమి ?
(చంద్రుని వలన ప్రయోజనములేదని భావము).

ఈ యుదాహరణములో కాంతయొక్క ఆస్యము (ముఖము)-ఉపమేయము. కలువఱేఁడు-ఉపమానము. ఇట ఉపమేయమునకు ఉపమానముతో తాద్రూప్యాత్మకమైనదిగా రంజన మేర్పడుచున్నది. మఱియు ఉపమానమగు కలువతేని కంటె ఉపమేయమగు ఆస్యమునకు ఆధిక్యముగాని, న్యూనత్వముగాని వర్ణింపబడలేదు. కావున నిది అనుభయతాద్రూప్యరూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- ఈమె అ+సుధా+అర్ణవ+ఉదిత (సుధాసాగరము నందు పుట్టినది కానిది) అగు అపరలక్ష్మి.

ఇట అపరలక్ష్మి యగు ప్రస్తుతసాధ్వి-ఉపమేయము; ప్రసిద్ధలక్ష్మి (విష్ణువు భార్య) ఉపమానము. ఇట ప్రస్తుత సాధ్వి-ప్రసిద్ధ లక్ష్ములకు తాద్రూప్యరంజనము వర్ణింపబడినది. కావున నిది తాద్రూప్యరూపకము. మఱియు ప్రసిద్ధలక్ష్మి సుధాసాగరజనిత. ప్రస్తుత సాధ్విని అసుధార్ణవోదిత అని వర్ణించి ఈ సాధ్వికి న్యూనత్వము చెప్పఁబడినందుచే నిది న్యూన తాద్రూప్యరూపకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- ఇమ్ముఖేందుఁ డమ్మృగాంకు నెసఁగు.

ఇందు ముఖేంద్రుఁడు అనఁగా ప్రస్తుతము వర్ణనీయము గనున్న ఒకానొక సాధ్వియొక్క ముఖచంద్రుఁడు-ఉపమేయము. ప్రసిద్ధమగు మృగాంకుఁడు (చంద్రుఁడు) ఉపమానము. ఇట ఉపమేయమునకు ఉపమానముతో తాద్రూప్యరంజనము వర్ణింపబడినది. మఱియు ఉపమానమగు మృగాంకుఁడు మృగకళంకితుఁడు అని వర్ణించుటచే మృగకళంకమున్న ఉపమానము కంటె ఏ కళంకము లేని ఉపమేయమగు ముఖేందునకు ఆధిక్యము చెప్పబడినది. కావున నిది అధిక తాద్రూప్యరూపకమునకు లక్ష్యమగుచున్నది.

గమనిక :- ఇట నిచ్చిన 4, 5, 6 ఉదాహరణములలో ఉపమాన-ఉపమేయములు భిన్నములని స్పష్టమగుచున్నది. కాన వీనియందు సాదృశ్యము మాత్రమే వర్ణింపబడినదని గ్రహింపవలయును.

సం॥ విషయ్యభేద తాద్రూప్యరంజనం విషయస్య యత్
రూపకం తత్త్రిధా ధివ్య-న్యూనత్వానుభయోక్తిభిః 12

అయం హి ధూర్జటిః సాక్షా ద్యేన దగ్ధాః పురః క్షణాత్,
అయమస్తి వినా శంభు స్తార్తీయీకం విలోచనమ్. 13

శంభుర్విశ్వ మవత్యద్య స్వీకృత్య సముద్భిత్తామ్,
అస్యా ముఖేందునా లబ్ధే నేత్రానందే కిమిందునా? 14

సాధ్వీయ మపరా లక్ష్మీ రసుధా సాగరోదితా,
అయం కలంకినశ్చంద్రా న్ముఖచంద్రోఽతిరిచ్యతే. 15

15. విషయస్య=విషయమునకు; విషయి=అభేద+తాద్రూప్య+రంజనమ్ = ఉపమానముతో, అభేదము చేతనో, తాద్రూప్యము చేతనో రంజనము వంటి రంజనమును వర్ణించుట; (ఇతి) యత్= (అనునది) యేది (కలదో); తత్=అది; రూపకమ్=రూపకాలంకారము

(స్యాత్=అగును). తత్=ఆ రూపకము; ఆధిక్య+న్యూనత్వ అనుభయ+ఉక్తిభిః=ఆధిక్యము, న్యూనత్వము, అనుభయము అను రీతులతో; త్రిధా = మూఁడు విధములు ఉండును.

13. యేన = ఎవనిచే; క్షణాత్=క్షణకాలములో అనగా అత్యల్పకాలములో; పురః=(శత్రువుల) పురములు; దగ్ధాః=కాల్చివేయబడినవో, (సః=ఆ); ధూర్జటిః=శివుఁడు, సాక్షాత్=ప్రత్యక్షముగా; అయం+హి=ఇతఁడే. అయం=ఈ రాజు, తార్తీయీకం=మూఁడవదగు, విలోచనం=వినా=కన్ను లేకుండ (ఉన్న); శంభుః=శివుడుగా; ఆస్తే=ఉన్నాడు.

14. శంభుః=శివుఁడు; అద్య=నేడు; సమదృష్టితామ్=సమదృష్టిత్వమును (సమమగు చూపు కలిగియుండుటను) స్వీకృత్య=స్వీకరించి; విశ్వమ్=ఈ ప్రపంచమును, అవతి=రక్షించుచున్నాడు. అస్యాః= ఈ వనితయొక్క, ముఖ+ఇందునా=ముఖచంద్రునిచే; నేత్ర+ఆనందే=కన్నులకుఆనందము; లబ్ధే (సతి) = లభించినది కాఁగా; ఇందునా + కిమ్ = చంద్రునితో ఏమి ప్రయోజనము. (ప్రయోజన మేమియు లేదు అని భావము).

15. ఇయం=ఈ; సాధ్వీ=పతివ్రత; అ+సుధా+సాగర+ఉదితా=అమృత సముద్రమునుండి, జన్మించినది కానట్టి; అపరా=వేరొక; లక్ష్మీః = లక్ష్మియే; అయం=ఈ; ముఖచంద్ర = ముఖమనెడు చంద్రుఁడు; కళంకినః=మచ్చగల; చంద్రాత్=ప్రసిద్ధ చంద్రునికంటె; అతిరిచ్యతే=అతిశయించుచున్నాడు.

## 6. పరిణామాలంకారము

తే॥ గీ॥ విషయి విషయాత్మతను క్రియాన్వితము గాఁగ
కృతులఁ బరిణామ మను పేర మతులఁ గనుము
ఆయతాక్షి ప్రసన్నేక్షణాంబుజమున
చూచె సరసు లానందవిస్ఫూర్తి నంద. 16

ధర్మసామ్యము గల విషయి (ఉపమానము) విషయముతో కూర్పబడియు, ప్రస్తుతకార్యమును సాధింపలేక విషయాత్మనే (విషయరూపమునే) అపేక్షించును. ఇట్లు ఆరోప్యమాణము (ఆరోపింపబడుచున్నది) అగు నుపమానము తాను ఉద్దేశించిన కార్యమును సాధింపలేక విషయాత్మగా పరిణామమంది కార్యసాధకమయ్యే నేని పరిణామాలంకార మగును. ఇట విషయి విషయాత్మగా పరిణామము నపేక్షించుటచే దీనికీ పేరు సార్థక మగుచున్నది.

ఉదా :- అయ్యాయతాక్షి ప్రసన్నమగు ఈక్షణాంబుజముతో (నయనకమలముతో) సరస జనులు ఆనందవిస్ఫూర్తిని (ఆనందముయొక్క అధికస్ఫూర్తిని) పొందునట్లు చూచెను.

ఇట ఈక్షణము (కన్ను) ఉపమేయము; అబ్జము - ఉపమానము; ఈక్షణమందు అబ్జత్వము ఆరోపింపబడినను ఇది రూపకము కాదను విషయమును "చూచె" నను క్రియాపదము స్పష్టము చేయుచున్నది. ఇట ఆరోపితమగు అబ్జమునకు "చూచె" నను క్రియతో నన్వయించుటకు కావలసిన "ఈక్షణశక్తి" లేదు. కావున అట్టి శక్తిగల ఈక్షణము (చూపు) గా పరిణామ మంది ఈక్షణముతో తాదాత్మ్యము పొందినపుడే క్రియతో నన్వయమును పొందవల్లుచున్నది. కాన రూపకమందు ఆరోపణమే ముఖ్యము కాఁగా పరిణామమందు ఉపమేయమునందు ఉపమానారోపణముతోపాటు విషయాత్మగా పరిణామ మందుటయు ముఖ్యమే.

సం॥ పరిణామః క్రియార్థశ్చే ద్విషయీ విషయాత్మనా,
ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా.

విషయీ=ఉపమానము; విషయాత్మనా=ఉపమేయరూపముతో; క్రియార్థః+చేత్=కార్యకారి అయిన యెడల; పరిణామః=పరిణామా

లంకారము (స్యాత్=అగును). మదిరేక్షణా=మదిరాక్షి (యగు నొక వనిత); ప్రసన్నేన = నిర్మలమైన; దృక్+అబ్జేన = నేత్రరూపమైన అంబుజముతో; వీక్షతే=చూచుచున్నది.

## 7. ఉల్లేఖాలంకారము

ఆ. వె. పలువు రొకని నెన్న బహురీతి నుల్లేఖ
మంద్రు శాస్త్రవేత్తలైన బుధులు
కాలుఁ డనఁగ రిపులు, కాముఁ డనఁగ కాంత
లర్థు లధిపు స్వర్ద్రు వనిరి సఖుఁడ! 17

అనేక విశిష్ట ధర్మములుగల ప్రత్యేక వ్యక్తిని పలువురు-ఆయా ధర్మములను ఆధారముగా చేసికొని పలువిధముల నుల్లేఖించిరేని అది ఉల్లేఖాలంకార మగును. అనఁగా సద్ధర్మములతో కూడియున్న ఒక వ్యక్తినే-ఒక్కొక్క ధర్మసామ్యమును ఆధారముగ చేసికొని - పలువురు వేర్వేఱు ఉపమానములతో పోల్చి వర్ణించిన యెడల నది ఉల్లేఖాలంకార మగును.

ఉదా :- ఆ రాజును చూచిన రిపులు (శత్రువులు) కాలుఁ డనియు, కాంతలు కాముఁడు (మన్మథుఁడు) అనియు, అర్థులు (యాచకులు) స్వర్ద్రువు (కల్ప వృక్షము) అనియు పల్కిరి.

వర్ణనీయుఁడగు రాజు ప్రతాప-సౌందర్య-దాతృత్వాద్యనేక సుగుణములు కలవాఁడు. కావుననే శత్రువులతని ప్రతాపగుణమునే పరిగణించి అతనిని కాలుఁడనిరి. అతని సౌందర్యగుణమునే గుర్తించిన స్త్రీలు అతనిని కాముఁడనిరి. అతని దాతృత్వ లక్షణమునే పరికించిన యాచకులు అతనిని "స్వర్ద్రువే" అనిరి.

ఇట్లు బహుసుగుణ సంపన్నుడైన వ్యక్తి ఒక్కఁడే పెక్కురచే

ఆయా సుగుణ సామ్యమునుబట్టి పెక్కు వస్తువులతో పోల్చి వర్ణింప బడినాఁడు. కావున పై లక్షణము ప్రకారము ఇది యుల్లేఖాలంకా రమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ బహుభి ర్బహుధోల్లేఖా దేకస్యోల్లేఖ ఇష్యతే,
స్త్రీభిః కామోఽర్థిభి స్స్వర్ద్రుః కాలః శత్రుభి రైక్షి సః.

బహుభిః=బహుజనులచే; బహుధా=బహువిధముల; ఏకస్య= ఒకనియొక్క; ఉల్లేఖాత్=వర్ణనము చేయుటవలన; ఉల్లేఖః=ఉల్లేఖా లంకారము; ఇష్యతే=(బుధులచే) సమ్మతింపబడున్నది. సః= ఆ రాజు; స్త్రీభిః=స్త్రీలచే; కామః=మన్మథుఁడనియు; అర్థిభిః= యాచకులచే; స్వర్ద్రుః=కల్పవృక్షమనియు; శత్రుభిః=శత్రువు లచే; కాలః=యముఁడనియు; ఐక్షి=చూడ (తలంప) బడెను.

ఉల్లేఖాలంకారములో వేఱొక భేదము :-

ఆ. వె. విషయభేద మరసి వివిధరీతి నొకఁడె
ఒకనిఁ జెప్ప నదె మఱొక్క విధము
వాక్కునందు గురుఁడు, వరకీర్తిఁ బార్థుండు
వింట భీష్ముఁ డయ్యు వెలయు నృపుఁడు. 18

ఒకనిలో గల ధర్మభేదమును బట్టి ఒక్కఁడే ఒకవీని వివిధ వస్తువులతో అభిన్నునిగా వర్ణించెనేని అదియు నొక ఉల్లేఖాలంకార మగును.

ఉదా :- ఈ నృపతి మాట్లాడుటలో దేవగురువు (బృహస్పతి), కీర్తి యందు దర్జునుఁడు, విలువిద్యలో భీష్ముఁడు.

సుగుణవంతుఁడగు రాజు వక్తృత్వాది విశేషగుణములు గల వాఁడు. అతనిలో నాయా విశేషగుణములను గుర్తించి, ఒక బుద్ధి మంతుఁడు ఆ రాజునకు వక్తృత్వమునందు దేవగురువగు బృహ స్పతితోను, కీర్తియందు దర్జునితోను, విలువిద్యలో భీష్మునితోను

అభేదమును వర్ణించెను. ఆ రాజు వాక్కులందు గురువను వాక్యము నందు వర్ణనీయుఁడగు ప్రస్తుత ప్రభువు-ఉపమేయము. గురువు ఉపమానము. వక్తృత్వము - విశిష్ట ధర్మము. ఈ ధర్మమును బట్టి రాజునకు గురునితో అభేదము వర్ణితము ఆ రాజు కీర్తియం దర్జు నుఁడను వాక్యములో రాజు-ఉపమేయము; అర్జునుఁడు ఉపమానము. కీర్తిమత్త్వము-విశిష్ట ధర్మము. దీనిని బట్టి రాజునకు అర్జునునితో అభేదము వర్ణింపబడినది. అట్లే ఆ రాజు వింట భీష్ముఁడను వాక్యమునందు రాజు-ఉపమేయము. భీష్ముఁడు - ఉపమానము. విశిష్ట ధర్మము ధానుష్కత్వము. ఈ ధర్మము సాధారణముగా గాని రాజునకు భీష్మునితో అభేదము వర్ణింపబడినది. కావున పై లక్షణము ప్రకారము రెండవ ఉల్లేఖాలంకారమునకు ఇది లక్ష్యమగుచున్నది.

ఇక మొదటి ఉల్లేఖమున ఉల్లేఖకులు (ఉల్లేఖించువారు) అనే కులు. రెండవ దానియందు ఉల్లేఖకుఁడు ఒక్కడు. ధర్మ వైవిధ్యము రెంటను సమానమైనను, ధర్మము మొదటి దానియందు గౌణము కాఁగా రెండవ దానియందు వాచ్యమగుట గుర్తింపవలెను.

సం॥ ఏకేన బహుధోల్లేఖేఽప్యసౌ వి-యభేదతః,
గురుర్వచ స్యర్జునోఽయం కీర్తౌ, భీష్మః శరాసనే.

విషయ భేదతః=(ఒకనిలోగల) ధర్మభేదమును బట్టి; ఏకేన= ఒక్కనిచే; బహుధా=అనేక విధములుగా; ఉల్లేఖే+అపి=వర్ణన జరిగినపుడు, కూడ; అసౌ=ఈ యుల్లేఖము (స్యాత్=అగును).

## 8,9,10. స్మృతి-భ్రాంతి-సందేహాలంకారములు

తే॥ గీ॥ స్మృతియు. భ్రాంతియు, సందేహ మెసఁగఁ గృతుల
తత్తదాఖ్యమలంకృతిత్రయము తనరు.
తమ్మిఁ గనిన మది సతిముఖమ్ముఁ దలఁచె
త్వన్ముఖము నెంచె మత్తాలి తమ్మి యనుచు
తమ్మియొ, శశాంకమొ అనిశ్చితమ్మె మాకు. 19

స్మృతి యనఁగా ఇంతకు ముందు అనుభవములో చూచిన దానిని తిరిగి వేఱొక సందర్భములో స్మరించుట, (జ్ఞప్తికి దెచ్చుకొనుట). భ్రాంతి యనఁగా మిథ్యాజ్ఞానము. అనఁగా వాస్తవముగు దానిని వేఱొకటిగ భ్రమపడుట. సందేహమనఁగా ఒక వస్తువును గాంచి అది ఆ వస్తువే అవునా? కాదా? యను సంశయాత్మకజ్ఞానము లేక అనిశ్చయాత్మకజ్ఞానము.

ఇట్టి స్మృతిని బట్టి యేర్పడిన అలంకారమును స్మృత్యలంకారము లేక స్మరణాలంకారము అనియు, భ్రాంతినిబట్టి యేర్పడిన అలంకారమును భ్రాంతి మదలంకార మనియు, సందేహము కారణముగా నేర్పడిన అలంకారమును సందేహాలంకార మనియు అలంకారశాస్త్రము పేర్కొనుచున్నది.

ఉదా :- 1. తమ్మిని (పద్మమును) గాంచిన మనస్సు భార్యా ముఖమును తలంచినది (స్మరించినది).

2. మత్తాలి (మత్తెక్కిన తుమ్మెద) నీ ముఖమును గాంచి తమ్మియని భ్రమించెను.

3. ఆ కన్పించునది తమ్మియో లేక శశాంకుఁడో (చంద్రుఁడో) మాకింకను అనిశ్చితమె (నిశ్చయముకానిదే అనగా సందిగ్ధమే అని తాత్పర్యము).

మొదటి ఉదాహరణమునందు తమ్మి - ఉపమానము; సతి ముఖము-ఉపమేయము. తమ్మినిఁ జూచిన వానికి ఆ తమ్మితో సాదృశ్యముగల పూర్వానుభవములోగల కాంతాముఖము స్మరణకు వచ్చినదని వర్ణించుటచే-ఇది స్మృతిని బట్టి యేర్పడిన అలంకారమగుటచే-ఇది స్మృత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

రెండవ యుదాహరణమునందు ముఖము - ఉపమేయము;

తమ్మి-ఉపమానము; వదనమునకు ఉపమాన సాదృశ్యముండుట వలన ముఖమును చూచి ఆ మత్తాలి పద్మమని భ్రాంతి పడినది. ఇటి మత్తాలి చర్యకు భ్రాంతియే మూలము. కావున నిది భ్రాంతి మదలంకారమునకు లక్ష్యమగుచున్నది.

మూఁడవ ఉదాహరణమందు ముఖము-ఉపమేయము. కన్పించునది ముఖమే యైనను ఆ ముఖమునకు తమ్మితోను, శశాంకుని తోను సాదృశ్యముండుటచే పంకజత్వమును బట్టి తమ్మిగా గాని, శశాంకత్వమును బట్టి శశాంకునిగా గాని నిర్ణయింప లేకున్నట్లు వర్ణించుటచే నిది సందేహాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

## 11. అపహ్నుత్యలంకారము

పరిచయము :- అపహ్నవము అనగా మఱుఁగు పఱచుట. అపహ్నవమును ఆధారముగా చేసికొని ఏర్పడిన ఈ యలంకారమునకు అపహ్నుత్యలంకారమను పేరు సార్థక మగుచున్నది.

ఈ యపహ్నుత్యలంకారము 1. శుద్ధాపహ్నుతి 2. హేత్వపహ్నుతి 3. పర్యస్తాపహ్నుతి 4. భ్రాంతాపహ్నుతి 5. ఛేకాపహ్నుతి 6. కైతవాపహ్నుతి అని ఆఱు విధములు.

వరుసగా లక్షణోదాహరణములు :-

తే. గీ. విషయిధర్మ మారోపింప విషయధర్మ
నిహ్నవంబె శుద్ధమగు నపహ్నుతి యగు
ఇతఁడు చంద్రుఁడు కాఁడైన నేమి? యనఁగ
అభ్రగంగా సరోరుహం బగును కనఁగ. 19

ఉపమానము యొక్క ధర్మమును ఆరోపించుటకై ఉపమేయ ధర్మమును నిషేధించుట శుద్ధాపహ్నుత్యలంకార మగును. ఇందు ఉపమేయధర్మము నిషేధముచే మఱుఁగు పఱచబడినది.

ఉదా :- ఇతఁడు చంద్రుఁడు కాఁడు. ఐయిన మఱెవరు ?
యను ప్రశ్నకు అది ఆకాశగంగా సరోరుహము
(ఆకాశగంగ యందలి పద్మము) (అని అర్థము).

ఇట వర్ణ్యమగు చంద్రుని యందు అవర్ణ్యమగు ఆకాశగంగా సరోరుహ (పద్మ) ధర్మమును (సరోరుహత్వమును) ఆరోపించుటకై వర్ణ్య ధర్మమగు చంద్రత్వము నిషేధముచే మఱుఁగు పఱుపబడినది. కావున నిది శుద్ధాపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ శుద్ధాపహ్నుతి రన్యస్యారోపార్థో ధర్మ నిహ్నవః,
నాయం శుధాంశుః కిం తర్హి వ్యోమగఙ్గా సరోరుహమ్.

అన్యస్య=ఉపమాన ధర్మముయొక్క; ఆరోపార్థ = ఆరోపణయే ప్రయోజనముగా గల; ధర్మ నిహ్నవః = ఉపమేయ ధర్మమును నిషేధించుట జరిగిన యెడల) శుద్ధాపహ్నుత్యలంకారము (అగును). అయం = ఈ కన్పించుచున్నవాఁడు; సుధాంశు = చంద్రుఁడు, న=కాఁడు. కిం తర్హి? = (చంద్రుడు కాకున్నచో) అది యేమి? (అనఁగా) వ్యోమగఙ్గా సరోరుహమ్ = ఆకాశగంగ యందలి పద్మము.

ఆ. వె. అదియె యుక్తి పూర్వమైన హేత్వపహ్నుతి
యనఁగ కృతుల నలరు నంద్రు బుధులు
తపన నీయఁడు శశి, తపనుండు నిశి రాఁడు
వార్ధి నుదితమైన బాడబంబె.

ఆ యపహ్నవమే యుక్తిపూర్వకముగా చేయఁబడినయెడల నది హేత్వపహ్నుతి యని విజ్ఞులందురు. ఇందు ఉపమేయధర్మమును హేతుపూర్వకముగా మఱుఁగుపఱచి ఉపమానధర్మము ఆరోపింప బడును.

ఉదా :- శశి (చంద్రుఁడు) తాపమీయఁడు. రాత్రివేళ తపనుఁడు (సూర్యుఁడు) ఉదయించఁడు. మఱి యీ తాపము రాత్రివేళ ఎట్లు కలిగినది? అను ప్రశ్నకు వార్ధి (సముద్రము) నుండి జనించిన బడబాగ్నియే తాపమునకు కారణము అనునది సమాధాన మగుచున్నది.

విరహ సంతప్త యగు తరుణీ వాక్యమిది. విరహ పీడిత యగు నామెకు చంద్రుడు సంతాపకారకుఁడగుట సహజము. ఆమె రాత్రివేళను, తాప తీవ్రత్వమును హేతువుగా పరిగణించి పలికిన వాక్యము. ఇట చంద్రుఁడు - ఉపమేయము. తాపతీవ్రత్వమును హేతువుగా గణించి చంద్రుని యందలి చంద్రత్వమును నిషేధింప బడినది. పోనీ తాపకారకుడు సూర్యుఁడు గనుక ఈ ప్రకాశించువాడు సూర్యుఁడేమో అని తలంచుటకు వీలులేదు. ఇది రాత్రి సమయము. కావున సూర్యుఁడు రాత్రి ప్రకాశింపడు. కావున ప్రకాశించువాఁడు సూర్యుఁడ నుటయును కుదురదు. ఇట్లు చంద్రత్వమును, సూర్యత్వమును రెండును నిషేధింపబడినవి. ఆ తీవ్రత్వ హేతువునే ఆధారముగా చేసికొని సాగరమునుండి వెలువడిన బడబాగ్ని యని నిర్ణయింపబడినది. బడబాగ్ని సముద్రమునుండి బయల్వెడినదగుట నిప్పుడది మిక్కిలి తీవ్రతను పొందినది. ఇట్లు చంద్రుని యందలి చంద్రత్వమును యుక్తిపూర్వకముగా నిషేధించి, బడబాగ్నిత్వమును నిల్పుటచేత నిది హేత్వపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

శ్లో॥ స ఏవ యుక్తిపూర్వశ్చే దుచ్యతే హేత్వపహ్నుతిః,
నేందు స్తీవ్రో న నిశ్యర్కః సింధో రౌర్వోఽయ ముత్థితః.

సః+ఏవ=ఆ యపహ్నవమే; యుక్తిపూర్వః+చేత్=హేతుపూర్వకము ఐన యెడల హేతు+అపహ్నుతి=హేత్వపహ్నుతి యని,

ఉచ్యతే=చెప్పబడుచున్నది. తీవ్ర=తీక్ష్ణముగానున్న; అయం= ఈ కన్పించువాడు; ఇందుః+న=చంద్రుఁడు, కాఁడు. (సూర్యుఁ డేమో? యన్న) నిశి=రాత్రి యందు; అర్కః+న (ప్రకాశతే)= సూర్యుఁడు ప్రకాశింపఁడు. అయం=ఈ కన్పించువాడు; సింధోః= సముద్రమునుండి; ఉత్థిత=వెలుపలికి వచ్చిన; ఔర్వః=బడబాగ్ని;

తే॥ గీ॥ ధర్మ మితరమందు నిలుప, దాని నిహ్ను
వంబు సేయు పర్యస్తమై పరఁగు నొండు.
అమృతకరుఁడు కాఁడీతండు. అయిన నేమి ?
అంబుజాక్షి ముఖంబె యౌ నమృతకరుఁడు. 20

ఇతరవస్తువునందు (ఉపమేయముయొక్క) ధర్మము నారోపించుటకై ప్రకృతవస్తు ధర్మమును నిషేధించిన యెడల పర్యస్తాపహ్నుత్యలంకార మగును. ఇందు నిషేధింపబడిన అన్యవస్తువు ధర్మమే ప్రకృతవస్తువు నందు నిలుపబడుచున్నది.

ఉదా :- ఇతఁడు అమృతకరుఁడు (చంద్రుఁడు) కాఁడు. అమృతకరుఁడు కాకపోతే మఱేమి? అనఁగా అంబుజాక్షి ముఖమే అమృతకరుఁడు అనెను.

ఇది యొకానొక విరహసంతాపమును అనుభవించుచున్న యువకుఁడనిన మాట. అంబుజాక్షి (ఇట ప్రేయసి) కి దూరుఁడై విరహ మనుభవించు వానికి సహజముగా ఆహ్లాదకరుఁడగు నమృతకరుఁడు కూడ సంతాప హేతువగును. ఆదశలో నతనికి అంబుజాక్షి ముఖమే ఆహ్లాదకరమగును. కాఁగా ప్రస్తుతదశలో నతనికి అమృతకరునిలో అహ్లాదకరత్వము లేక సంతాపకరత్వమే కన్పించుచున్నది. మఱియు ఇంతకుముందు విరహములేని దశలో చంద్రునిలో నుండెడు ఆహ్లాదకరత్వము ప్రస్తుత విరహదశలో నతనకి అంబుజాక్షి ముఖమునందే కన్పించుచున్నది. కావున అన్యవస్తువగు అంబుజాక్షి ముఖమునందు ఆరోపించుటకై ప్రస్తుతమగు అమృతకరునిలో నా

యాహ్లాదకరత్వము నిషేధింపబడినది. ఈ నిషేధారోపణములు విరహతప్తుని అప్పటి స్థితికి అనురూపముగా నుండుట ఇట గమనింపదగు నంశము.

సం॥ అన్యత్ర తస్యారోపార్థః పర్యస్తాపహ్నుతిస్తు సః,
నాయం సుధాంశుః, కిం తర్హి? సుధాంశుః ప్రేయసీముఖమ్.

(ఏదేని ఒక వస్తువునందు తదీయ ధర్మ నిహ్నవము) అన్యత్ర= వర్ణనీయమగు వస్తువునందు; తస్య=ఆ ధర్మముయొక్క; ఆరోప+ అర్థః+తు=ఆరోపించుటయే ప్రయోజనముగా గలది ఐన యెడల సః=అది పర్యస్తాపహ్నుతి=పర్యస్తాపహ్నుత్యలంకార మగును.

అయం=ఈ కన్పించువాఁడు; సుధా+అంశుః=అమృతము కిరణములందుగల చంద్రుఁడు; న (భవతి)=కాఁడు. తర్హి=అట్లు లేక అట్టిన; కిమ్=(ఆ కనిపించునది) ఏమి (ఏమై యుండును)? ప్రేయసీ ముఖమ్=అంబుజాక్షి ముఖమే; సుధాంశుః=చంద్రుఁడు (అగును).

ఇచట అమృతకరుడు-ఉపమేయము. కాఁడు అను శబ్దము ప్రకృతమగు అమృతకరునిలో అమృతకరత్వమును నిషేధించుచున్నది. మఱియు "అంబుజాక్షి ముఖమే అమృతకరుడు" అనుటచే అంబుజాక్షి ముఖమునందు ఆ యమృతకరత్వము ఆరోపింపబడినది. ఇతరవస్తువగు నంబుజాక్షి ముఖమునందు ఉపమేయమగు నమృతకరునియొక్క ధర్మము నారోపించుటకై ఉపమేయధర్మము నిషేధింపబడినది. కావున నిది పర్యాస్తాపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

తే॥ గీ॥ అన్యవస్తుశంక కలుగ నట్టి భ్రాంతి
వారణంబె భ్రాంతాపహ్నవంబు కృతుల
చెలిరొ! సోక్కంప తాపంబు చెలఁగుచుండె
జ్వర మదేనొ? కా దన్యంబు, సఖి! స్మరుండె. 21

అన్యవస్తువను శంక కలుగగా ఆ భ్రాంతిని వారించుట అనఁగా భ్రమను దొలఁగించి వాస్తవమును దెల్పుట భ్రాంతాపహ్నుత్యలంకార మగును. ధర్మసాదృశ్యమును బట్టి వస్తుభ్రమ కలుగవచ్చును. అట్టి సందర్భమున సత్యమెఱిఁగినవాఁడు వాని భ్రమను పోఁగొట్టి సత్యజ్ఞానమును కల్గించును. ఇట్టిచోట్ల భ్రాంతిని అపహ్నవించుట (మాటుపఱచుట) జరుగుటచే నిది భ్రాంతాపహ్నుత్యలంకార మగును.

ఉదా :- ఓచెలి ! సోత్కంపతాపము చెలఁగుచున్నది. సఖి ! జ్వరమా అది? కాదు. సఖి ! స్మరుఁడె. (విరహ తాపమని తాత్పర్యము).

ఇద్దరు చెలులమధ్య జరిగిన సంభాషణ మిది. ఒకచెలి ఓసఖి! సోత్కంపతాప మతిశయించుచున్నదను మాటను విని ప్రక్కనున్న చెలి జ్వరమా? అని శంకించినది. కాగా మొదటి చెలి కాదు సఖి! స్మర తాపము (భర్తృ విరహముచే కల్గిన తాపము అని వాస్తవమును దెల్పినది. అధికమగు జ్వరమునందును. విరహమందును సోత్కంప తాపముండుట సమంజసమే. అందుచేతనే మొదటి చెలి మాటవిన్న రెండవ చెలి సోత్కంపతాప ధర్మసాదృశ్యమును బట్టి జ్వరమా? అని శంకిచినది. అప్పుడు మొదటి చెలి విరహతాపమని వాస్తవము చెప్పి రెండవ చెలి భ్రాంతిని మఱుగుపఱచినది. అనగా భ్రాంతిని తొలఁగించినది. అందుకై "కాదు" అని అన్యవస్తు నిషేధము జరిగినది. కావున ఇది భ్రాంతాపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ భ్రాంతాపహ్నుతి రన్యస్య శంకాయాం భ్రాంతివారణే,
తాపం కరోతి సోత్కంపం, జ్వరః కిమ్? న. సఖి, స్మరః.

అన్యస్య=అన్యవస్తువుయొక్క; శఙ్కాయాం=భ్రమ కలుగగా; భ్రాంతి+వారణే=ఆ భ్రమ నివారణము (జరుగుచుండ); భ్రాంతాపహ్నుతిః= భ్రాంతాపహ్నుత్యలంకారము (అగును). స+ఉత్కంపమ్=అధికమగు వణకుతో కూడిన; తాపం+కరోతి=తపనను కల్గించు

చున్నది. జ్వరః+కిమ్?=జ్వరమా ఏమి? సఖి! = ఓ చెలి; జ్వరః= న=జ్వరముకాదు. స్మరః=మన్మథుఁడు. ఇట స్మరశబ్దము విరహ తాప స్ఫోరకము.

తే॥ గీ॥ తెలియుఁ గృతుల ఛేకాపహ్నుతి యన, నన్య
వస్తుశంక వాస్తవనిహ్నవంబు కాఁగ
తద్ధ జల్పించుచున్ మత్పదములఁ దవిలె
రక్తుడా? కాదు. పదనూపురంబె చెలియ!

అన్యవస్తువుయొక్క శంక కలిగినపుడు వాస్తవమును నిషేధించిన యెడల అది ఛేకాపహ్నుత్యలంకార మగును.

అన్యవస్తువను శంకచే కల్గిన భ్రాంతిని పోగొట్టుటకై భ్రాంతిని నిషేధించినచో అది భ్రాంతాపహ్నుత్యలంకారమని ఇంతకు ముందు తెలుపబడినది. ఈ ఛేకాపహ్నుత్యలంకారము పైదానికి పూర్తిగా వ్యతిరేకము. ఎట్లన :- తథ్య-మిథ్యావస్తువుల (సత్య-అసత్య వస్తువుల)ందు ఏది సత్యమో, ఏ దసత్యమో నిర్ణయింప లేకున్నపుడు వాస్తవమునే నిషేధించుట ఈ ఛేకాపహ్నుత్యలంకారమున జరుగును. ఛేకులనఁగావిదగ్ధులు (నిపుణులు). ఇట్టిది వారు మాత్రమే చేయుగలరు. ఇది వారికే తెలియును.

ఉదా :- తద్ధ (మిక్కిలి) ప్రజల్పించుచు (వదరుచు) మత్పదముల (నా పాదములందు) తవిలెను (సక్తమయ్యెను). ఆ మాట విని 'రక్తుఁడా?' అని వేరొక చెలి అడుగ, ఓ చెలి! కాలియందె సుమా. అని సమాధానమిచ్చినది.

ఒకానొక నాయిక నర్మసఖి (విశ్వసింపదగిన చెలికత్తె) తో రహస్యవృత్తాంతము చెప్పుచు "జల్పించుచు నా పదముల దవిలెను" అని చెప్పినది. ఆ సమయమునకే అచ్చటకు చేరిన మఱొక

వనిత పై మాటను విని కుతూహలము కొలఁది "రక్తుఁడా" అని ఆ నాయికను ప్రశ్నింపగా ఆమెకీ విషయమున నిశ్చయములేక సందిగ్ధ స్థితిలో నున్నదని గ్రహించిన నెఱజాణయగు నాయిక సత్యమును మఱుఁగుపఱచి "రక్తుఁడు కాదు చెలీ పదనూపురము (కాలిఅందె)" అని వాస్తవమును నిషేధించి అవాస్తవమునే దెల్పినది. కాన- ఉక్త లక్షణము ప్రకార మిది ఛేకాపహ్నుత్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ ఛేకాపహ్నుతి రన్యస్య శఙ్కాతస్తథ్య నిహ్నవే,
ప్రజల్పన్ మత్పదే లగ్నః కాన్తః కిమ్? న హి. నూపురః.

అన్యస్య=అన్యవస్తువు (వ్యక్తి) యొక్క; శఙ్కాతః=తథ్య అతథ్య నిర్ణయము జరుగని స్థితిని బట్టి; తథ్యనిహ్నవే=సత్యనిషేధము (జరుగుచున్నది)కాగా; ఛేక+అపహ్నుతిః=ఛేకాపహ్నుత్యలంకారము(అగును). ప్రజల్పన్=(ఏదో) వదరుచు; మత్పదే=నా పాదమందు; లగ్నః=సక్తమయ్యెను. కాన్తః+కిమ్=కాంతుడా ఏమి ? న+హి=కాదే; హే సఖి=ఓ చెలి; నూపురః = కాలిఅందె (అనినది).

తే॥ గీ॥ కైతవాపహ్నుతి తనరు కైతవాది
పదములన్ నిహ్నవం బది వ్యక్తమైన
కనఁగఁ గామినీ దృక్పాత కైతవమున
బయలు వడుచుండె మన్మథ బాణచయము. 14

కైతవము, వ్యాజము, ఛలము మున్నగు పదములచే వర్ణ్య ధర్మము నిషిద్ధమైనట్లు స్పష్టమైన యెడల నది కైతవాపహ్నుత్యలంకార మగును. వర్ణ్య ధర్మ నిహ్నవము, అన్యధర్మారోపణములతో పాటు కైతవాది శబ్దప్రయోగ మిందు అధికముగుట గమనింపదగు నంశము.

ఉదా :- కామినీ దృక్పాతమను కైతవముతో మన్మథబాణ సమూహము బయల్వెడలుచున్నది.

ఇట కామినీ దృక్ప్రసారము ఉపమేయము. మన్మథబాణ ప్రసారము - ఉపమానము. ఇచట కైతవపదముచే మన్మథబాణత్వము నారోపించుటకై కామినీదృగ్ధర్మము నిషేధింపబడినది.

స॥ కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజాద్యైర్నిహ్నుతేః పదైః,
నిర్యాన్తి స్మరనారాచాః కాన్తా దృక్పాత కైతవాత్

వ్యాజ+ఆద్యైః=వ్యాజము మొదలుగా గల; (వ్యాజము, మిష, కైతవము, ఛలము మొదలైన) పదైః = పదములచేత; నిహ్నుతేః=ధర్మనిహ్నవము యొక్క; వ్యక్తౌ = స్పష్టత జరుగగా (స్పష్టముగా వ్యక్తము కాగా); కైతవాపహ్నుతి=కైతవాపహ్నుత్యలంకారము (అగును). కాన్తా+దృక్+పాత+కైతవాత్=ప్రేయసి యొక్క, చూపు (యొక్క), ప్రసరించుట యను, నెపము వలన; స్మర నారాచాః = మన్మథుని బాణములు, నిర్యాన్తి= వెలువడుచున్నవి.

## 12. ఉత్ప్రేక్షాలంకారము

తే॥ గీ॥ వస్తు-హేతు-ఫలాత్మ సంభావనంబె
కృతుల నుత్ప్రేక్షనా నలంకృతి యొసంగు
ఆద్యము క్తాస్పదం బను క్తాస్పదమని
పెఱలు సిద్ధ మసిద్ధ మై భేద మందు. 25

పరిచయము :- ఉత్ప్రేక్ష అనగా సంభావన(ము) ఊహించుట లేక ఊహ అని అర్థము. ఉపమానధర్మము ఉపమేయమందుండ ఉపమేయమునకు ఉపమాన తాదాత్మ్యమును సంభావన చేసిన యెడల ఉత్ప్రేక్షాలంకార మగును.

ఇందు ఒకానొక వస్తువునకు వస్త్వంతర తాదాత్మ్యమును సంభావన చేసిన అది స్వరూపోత్ప్రేక్ష యనియు, హేతువు కాని దానిని హేతువుగ సంభావనచేసిన హేతూత్ప్రేక్ష యనియు. ఫలము

కాని దానిని ఫలముగా సంభావన చేసిన ఫలోత్ప్రేక్ష యనియు చెప్పబడుచున్నది.

ఇందు స్వరూపోత్ప్రేక్ష ఉక్తవిషయ, అనుక్తవిషయ అని రెండు విధములు. కాఁగా హేతు-ఫలోత్ప్రేక్షలు ఒక్కొక్కటి సిద్ధ విషయ, అసిద్ధవిషయ అని రెండేసి విధములుగా నుండును. మొత్తముమీద ఉత్ప్రేక్ష ఆఱు విధములుగ విభక్తమైనది.

సం॥ సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా,
ఉక్తా నుక్తా స్పదా ద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే.

వస్తు+హేతు+ఫల+ఆత్మనా = వస్తుమత్త్వము, హేతువత్త్వము, ఫలవత్త్వముగా; సంభావనా=ఊహించుట; ఉత్ప్రేక్షా= ఉత్ప్రేక్షాలంకారము (అగును). అత్ర = ఈ యలంకారమందు; ఆద్యా=వస్తుమత్వముగా సంభావితమైనది; ఉక్త+అనుక్త+ఆస్పదా=ఉక్తవిషయము; అనుక్తవిషయము అని రెండు విధములు (అగుచున్నది). పరే=మిగిలిన రెండును (హేతుమత్త్వ, ఫలవత్త్వములుగా సంభావింపబడినవి); సిద్ధ+అసిద్ధ+ఆస్పదే=సిద్ధవిషయము, అసిద్ధవిషయము అని రెండు విధములు (అగుచున్నది).

ఈ యాఱింటికి వరుసగా ఉదాహరణములు ఈ క్రిందఁ జూపబడుచున్నవి.

1+2 ఆ. వె. చీఁకటిం దలంతు కోకివియోగాగ్ని
ధూమ చయ మనంగ దోషరహిత!
తమము తనువునంతఁ దగ నలఁదు నటుల
అంజనంబుఁ గురియు నటుల నభము. 26

3+4 ఆ. వె. క్షోణి నిడుట నీదు కోమలాంఘ్రియుగము
రక్తమయ్యె నిజము రక్తరమణి!
త్వన్ముఖాభ మంద వైర మూనెను శశి
నీరజమ్ములతోడ నిశ్చయంబు. 27

5+6 ఆ. వె. స్తనములను ధరింప కనకదామములచే
నడుము దృఢతఁ గట్ట బడెన ఏమి?
త్వత్పదంబుతోడ తా నైక్య మొందంగ
తమ్మి తఱచు నీటఁ దపము సేయు.

ఇందు మొదటి పద్యముయొక్క పూర్వార్ధము ఉక్తవిషయః వస్తూత్ప్రేక్షకు ఉదాహరణము.

ఉదా :- ఓ దోషరహితుఁడా! చీఁకటిని కోకాంగనా వియోగాగ్నులయొక్క ధూమ సముదాయమని దలంతుము.

ఇందు వర్ణ్యము-చీఁకటి. అవర్ణ్యము-ధూమచయము. చీఁకటికి నల్లఁదనము, దృష్టి నిరోధకత్వము మొదలగు ధర్మములు గలవు. ఇట్టి ధర్మములే ధూమచయమునకును ఉండుటచే చీఁకటికి ధూమచయముతో తాదాత్మ్యము సంభావింపబడినది. కాన నిది వస్తూత్ప్రేక్ష. ఇట విషయమగు చీఁకటి ఉక్తమైనది. కావున నిది ఉక్త. వస్తూత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది.

ప్రథమ పద్యముయొక్క ఉత్తరార్ధము అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష కుదాహరణము.

ఉదా :- 1. తమము తనువునంత అలఁదు (పూయు) నటుల దలఁతు.

2. నభము అంజనమును కురియుచున్నట్లు దలఁతు.

చీఁకటియొక్క వ్యాపనమునకు గల- (రోదసి (భూమ్యాకాశ మధ్య) యందలి వస్తువులను చిక్కగ నల్లబఱచు- ధర్మమును నిమిత్తముగా గొని వ్యాపనమునకు లేపన తాదాత్మ్యము ఉత్ప్రేక్షింప బడినది. అట్లే చీఁకటి వ్యాపనమునకు నభము (ఆకాశము) చేయు అంజన (కాటుక) వర్షణ తాదాత్మ్యముకూడ ఉత్ప్రేక్షింపబడినది రెండు చోట్లను విషయభూత తమో వ్యాపనము చెప్పబడునందుచే ఇది అనుక్తవిషయ స్వరూపోత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది.

సం॥ ధూమస్తోమం తమ శ్శజ్కే కోకీవిరహ శుష్మణామ్,
లిమ్పతీవ తమోఽజ్గాని వర్షతీవాఞ్జనం నభః.

తమః=చీఁకటిని; కోకీ+విరహ+శుష్మణామ్=చక్రవాకాంగనల యొక్క, విరహమనెడి, అగ్నులయొక్క: ధూమ+స్తోమమ్=పొగల సముదాయముగా; శజ్కే=(నేను) తలంచుచున్నాను. తమః= చీఁకటి; అజ్గాని=అవయవములను, లిమ్పతి+ఇవ=పూయుచున్నదో అన్నట్లును; నభః=ఆకాశము; అఞ్జనమ్=కాటుకను; వర్షతి+ఇవ= వర్షించుచున్నదో అనునట్లును (శజ్కే=తలంతును).

ఉదా :- 3. ఓ రక్తరమణీ! నీయొక్క కోమలము అగు పాదముల జంట క్షోణి (భూమి)పై మోపుటచే రక్తవర్ణము కలదైనది. ఇది నిజము.

ఇది ప్రేయసిని ప్రశంసించుచు ప్రియుడన్న మాట. ఇట పాదముల రక్తిమ (ఎఱ్ఱదనము) స్వతః సిద్ధమైనదే. పాదముల ఎఱ్ఱదనమునకు కారణముగానట్టి "పుడమిపై మోపుటను" ఇట తత్కారణముగ చెప్పుటచే- హేతువు కాని దానిని హేతువుగా సంభావించుటచే- నిది హేతూత్ప్రేక్ష యగుచున్నది. నడచుటకే ఏర్పడియున్న పాదములు సుకుమారములైనను క్షోణిపై మోపక తప్పదు. క్షోణిపై మోపుట అను హేతువు సిద్ధవిషయమగుటచే ఇది సిద్ధవిషయ హేతూత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది. ఇచట "నిజము" అను పదము సంభావనను నిరూపించుటకు తోడ్పడును.

ఉదా :- 4. శశి (చంద్రుఁడు) నీ ముఖాభమును (ముఖము యొక్క కాంతివంటి కాంతిని) పొందుటకై నీరజముల (పద్మముల)తో వైరము పూనినాడు. ఇది నిశ్చయము.

ఇది ప్రియుడు ప్రేయసిని ప్రశంసించుచు అన్నమాట. ఇట శశి-నీరజ విరోధము స్వాభావికము (ప్రకృతిసిద్ధము). కాఁగా

నాయికావదనకాంతిప్రేప్స (పొందగోరిక) ఈ విరోధమునకు హేతువు కాదు. హేతువు కాని నాయికావదనకాంతి ప్రేప్సను హేతువుగా సంభావించుటచే హేతూత్ప్రేక్ష. అచేతనమగు చంద్రునకు ఇట్టి కోరిక సిద్ధమైనది కాదు. కావున నిది అసిద్ధహేతూత్ప్రేక్షకు లక్ష్యమగుచున్నది. ఇచట నిశ్చయశబ్దము కవి సంభావనను నిరూపించుటకు తోడ్పడునదే.

సం॥ రక్తౌ తవా ఙ్ఘ్రీ మృదులౌ భువి విక్షేపణాత్ ధ్రువమ్,
త్వన్ముఖాభేచ్ఛయా నూనం పద్మై ర్వైరాయతే శశీ.

మృదులౌ=కోమలములైన; తవ=నీయొక్క; అఙ్ఘ్రీ=చరణములు రెండును; భువి=భూమిపై; విక్షేపణాత్ = ఉంచుట వలన (మోపుట వలన); రక్తౌ=ఎఱ్ఱనివి (అగుచున్నవి); ధ్రువమ్= నిశ్చయము; శశీ=చంద్రుఁడు; త్వత్+ముఖ+ఆభ+ ఇచ్ఛయా= నీయొక్క, ముఖముయొక్క, కాంతియందలి, అపేక్షచేత; పద్మైః= కమలములతో; వైరాయతే=పోరుచున్నాఁడు; నూనమ్ = (ఇది) నిశ్చయము.

ఉదా :- 5. స్తనములను ధరించుటకై నడుము కనకదామముల (బంగరుగొలుసుల)చే గట్టిగా కట్టబడినదా ఏమి ?

ఇదియును ప్రియుడు ప్రేయసిని ప్రశంసించుచు నన్నమాటయే. స్త్రీలకు త్రివళి (పొట్టమీదనుండు మూఁడు మడతలు) ఉండును. ఆమె చాయ బంగరు వన్నెవంటి దగుటచే ఆ త్రివళియే కనకదామములుగా అధ్యవసితములై (ఆహార్య నిశ్చయముగలవై) నవి. కాఁగా నిట నడుము తానే స్తనములను ధరించుచున్నను స్తనధారణము కనకదామములచే నైన బంధనమునకు ఫలముగా సంభావింపఁబడుటచే అనగా ఫలము కాని దానిని ఫలముగా సంభావించు

టచే నిది ఫలోత్ప్రేక్షాలంకార మగుచున్నది. మఱియు నిట కుచ ధారణ విషయము సిద్ధమైనదే అగుటచే నిది సిద్ధవిషయఫలోత్ప్రేక్షా లంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా :- 6. ఓ కాంతా; తమ్మి నీ చరణముతో నైక్యము
నందుటకై తఱచు నీటిలో తపమొనర్చుచున్నది

ఇదియును ప్రేయసిని ప్రశంసించు ప్రియుని మాటయే. ఇట తమ్మియొక్క జలవాస తపముగ అధ్యవసితమైన జలనివాసము నకు కాంతాచరణైక్యప్రాప్తి ఫలముకాదు. అయినను అట్టి చర ణైక్యప్రాప్తినే తపస్సునకు ఫలముగ సంభావించుటచే నిది ఫలో త్ప్రేక్ష యగుచున్నది. మఱియు కాంతాపదైక్యప్రాప్తి రూపమైన ఫలము అసిద్ధవిషయము కాన ఇది అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్షాలం కారమునకు లక్ష్యమగుచున్నది.

(పై 5, 6 ఉదాహరణములలో "కనకదామముల చేత" "తపముచేయు" అను నప్రకృతములచే వరుసగా వళిత్రయము, జలవాసము అను ప్రకృతములు మఱుఁగుపఱచబడినందున చెప్ప బోవు రూపకాతిశయోక్తి యనుటకు కొంత అవకాశమున్నను వాక్యార్థ తాత్పర్యముతో ఫలోత్ప్రేక్షలుగనే గ్రాహ్యములైనవి.

సం॥ మధ్యః కిం కుచయో ర్ధృత్యై బద్ధః కనకదామభిః,
ప్రాయోఽబ్జం త్వత్పదైక్యం ప్రాప్తుం తోయే తపస్యతి.

కుచయోః = స్తనములయొక్క; ధృత్యై=ధారణకొఱకై; మధ్యః=నడుము; కనకదామభిః=బంగారు గొలుసులచే; బద్ధః+ కిమ్=కట్టబడినదా యేమి? అబ్జమ్=పద్మము; త్వత్+పదేన=నీ యొక్క, పాదముతో; ఐక్యమ్=ఏకత్వమును; ప్రాప్తుం=పొందు టకు; ప్రాయః=తఱచుగా; తోయే=నీటియందు; తపస్యతి=తపము చేయుచున్నది.

# 13. అతిశయోక్త్యలంకారము

తే॥ గీ॥ వర్ణ్యనిగరణంబు నవర్ణ్యవాచకమున,
చేయ రూపకాతిశయోక్తి వెలుఁగు కృతుల
సఖుఁడ! నల్లనౌ కలువల జంట నుండి
వాఁడి శరములు వెల్వడున్ జూడు మెవు. 23

వర్ణ్యముయొక్క నిగరణము (మఱుఁగుపఱచుట) అధ్యవసానముచే-అవర్ణ్యముయొక్క ధర్మారోపణముచే-జరిగినచో రూపకాతిశయోక్త్యలంకార మగును. అవర్ణ్యధర్మారోపణము రూపకాలంకారమందును ఉన్నను వర్ణ్యోపాదానము రూపకమునందుండును ఇట వర్ణ్యము మఱుఁగపఱచబడును.

ఉదా:- నల్లగలువల జంటనుండి వాఁడిశరములు వెల్వడు చున్నవి చూడు సఖుఁడా!

ఇట నల్లగలువలనుండి వాఁడిబాణములువెల్వడుట అసంభవమైనవిషయము. ఇందు పేర్కొన్న నల్లకలువలు, వాఁడిబాణములును ఉపమానము. వీనికి సందర్భోచితములగు ఉపమేయములు ఉవిదకన్నులు, (ఆమె నేత్రములనుండి వెడలు) చూపులును. కాఁగా నిట ఉపమానములు మాత్రమే చెప్పబడి ఉపమేయములు నిగీర్ణములైనవి. ఇట్లు అధ్యవసానముచేత వర్ణ్యములు మఱుఁగుపఱచబడి నందుచే నివి రూపకాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ రూపకాతిశయోక్తిస్స్యా న్నిగీర్యాధ్యవసానతః,
పశ్య, నీలోత్పల ద్వంద్వా న్నిస్సరన్తి శితాశ్శరాః.

అధ్యవసానతః=ఉపమేయమందు ఉపమానముయొక్క అభేద ధర్మారోపణమువలన; నిగీర్య=(ఉపమేయమును) మఱుగుపఱచి; (వర్ణించినయెడల); (రూపక+అతిశయోక్తిః)=రూపకాతిశయోక్తి యను నలంకారము (అగును). నీల+ఉత్పల+ద్వంద్వాత్=నల్లనైన, కలువలయొక్క, జంటనుండి; శితాః వాఁడియైన; శరాః=బాణములు; నిస్సరన్తి=వెలువడుచున్నవి. పశ్య=చూడుము.

తే॥ గీ॥ అది యపహ్నవగర్భమై యలరె నేని
ఒప్పు, సాపహ్నవాతిశయోక్తి కృతుల.
అధిప! నీ దు సూక్తులయందు నమృత మొప్ప
కాంతు రద్దాని శశియందు భ్రాంతజనులు. 30

అపహ్నవగర్భితమగు నారూపకాతిశయోక్తియే సాపహ్నవాతిశయోక్తి యన నొప్పుచుండును.

ఉదా :- ఓ రాజా! నీ సూక్తులయందే అమృతము అమరి యుండగా భ్రాంతిపడిన జనులు ఆ యమృతమును శశియందు గాంచుదురు.

ఇట నీ సూక్తులందున్న మాధుర్యము అమృతమే. చంద్రుని యందున్నది అమృతము కాదు అను పర్యస్తాపహ్నుతితో కూడినది ఉపమేయమగు మాధుర్యమందు అమృతతాద్రూప్యము చెప్పబడి నది-అగుటచే నిది సాపహ్నవాతిశయోక్త్యలంకారమునకు లక్ష్య మగుచున్నది.

సం॥ యద్యపహ్నుతిగర్భత్వం సైవ సాపహ్నవా మతా,
త్వత్సూక్తిషు సుధా రాజన్ భ్రాంతాః పశ్యన్తి తాం విధౌ.

అపహ్నుతి గర్భత్వమ్=అంతర్గతమైన అపహ్నుతి కలదిగ; (ఉక్తమ్)యది= (చెప్పబడినది) ఐనయెడల; సా+ఏవ=ఆ రూపకాతిశయోక్త్యలంకారమే; సాపహ్నవా=సాపహ్నవా (అపహ్నవముతో కూడిన) అతిశయోక్తిగా; మతా =(విద్వాంసులచే) అంగీకరింపబడినది. హేరాజన్ = ఓరాజా!; త్వత్+సూక్తిషు = మీయొక్క సుద్దులయందు; సుధా=అమృతము (కలదు, కాని); భ్రాంతాః= భ్రాంతిపడిన (సత్యమెఱుఁగనివారు); తామ్=ఆ యమృతమును; విధౌ=చంద్రునియందు; పశ్యన్తి = చూచుచున్నారు (ఉన్నదని భ్రమ పడుచున్నారని భావము).

తే॥ గీ॥ అపరయ తజ్జాతి భిన్న మౌ ననుచుఁ జెప్ప
భేదకాతిశయోక్తి నా భిన్న మగును.
అన్య మారాజ గాంభీర్య మలరుచుండు
అన్య మారాజ ధీరత్వ మమరియుండు. 31

ఒక జాతికే చెందిన వస్తువునకే తజ్జాతి భిన్నత్వమును చెప్పిన అది భేదకాతిశయోక్త్యలంకార మగును.

ఉదా.- ఆ రాజు గాంభీర్యమే వేఱు. ఆ రాజు ధైర్యమే వేఱు.

లోక ప్రసిద్ధములగు గాంభీర్య-ధైర్యముల కంటె ప్రస్తుత నృపతియొక్క గాంభీర్యము,ధైర్యము వేఱని వర్ణింపబడినది. లోక ప్రసిద్ధ గాంభీర్య ధైర్యములును, ప్రస్తుతరాజునందుగల గాంభీర్య ధైర్యములును ఒక్క జాతి (గాంభీర్యజాతి, ధైర్యజాతి)వే అయినను ఇట భిన్నములుగనే వర్ణింపబడినవి. కాన నిది భేదకాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ భేదకాతిశయోక్తిస్తు తస్యైవాన్యత్వవర్ణనమ్,
అన్య దేవాస్య గాంభీర్యమన్య ద్ధైర్యం మహీపతేః.

తస్య+ఏవ=లోకమందు సామాన్యమైనదానికే; అన్యత్వ+వర్ణనమ్=భిన్నమై యున్నదని వర్ణించుట; భేదకాతిశయోక్తిః=భేదకాతిశయోక్త్యలంకారము (అగును). అస్య=ఈ; మహీపతేః=రాజునకు గల; గాంభీర్యమ్+ఏవ=గంభీరత్వమే; అన్యత్=వేఱైనది; ధైర్యమ్=ధీరత్వమును; అన్యత్=వేఱైనది.

కం॥ సంబంధం బది లేకయొ
సంబంధం బున్న యట్లు చక్కగఁ జెప్పన్
సంబంధాతిశయోక్తి: పు
రిం బలు మేడలు మృగాంకు స్పృశించు ననఁగన్. 32

సంబంధము లేనిచోట సంబంధమున్న యట్లు చక్కఁగా వర్ణింపగా నది సంబంధాతిశయోక్త్యలంకార మగును.

ఉదా:- ఈ పురిలోని చాల మేడలు మృగాంకుని (చంద్రుని) స్పృశించును.

ఇందు వర్ణించినట్లు ఆ పురిలోని మేడలు చంద్రుని తాకుట అసంభవము. ఐనను ఆపురిమేడలకు, మృగాంకుని స్పృశించుటకు సంబంధము లేకున్నను సంబంధ మున్నట్లు వర్ణింపబడినది. కావున నిది సంబంధాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ సంబంధాతిశయోక్తిస్స్యా దయోగే యోగకల్పనమ్,
సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశన్తి విధుమణ్డలమ్.

అయోగే=సంబంధము లేకున్నను; యోగ+కల్పనమ్=సంబంధమును కల్పించుట; సంబంధాతిశయోక్తిః = సంబంధాతిశయోక్త్యలంకారము (అగును). అస్య=ఈ; పురస్య=పట్టణముయొక్క; సౌధ+అగ్రాణి=మేడల శిఖరములు; విధు+మణ్డలమ్=చంద్రమండలము (బింబము)ను; స్పృశన్తి=తాఁకుచున్నవి.

తే॥ గీ॥ యోగ మున్నను లే దట్టి యోగ మనఁగ
నొగి నసంబంధపుటతిశయోక్తి తనరు.
అధిప! నీవిల దాతవై యతిశయింప
నాదరింపము మే మెప్పు డమరతరుల. 33

సంబంధమున్నను సంబంధము లేనట్లు వర్ణించిన యెడల అది అసంబంధాతిశయోక్త్యలంకార మగును.

ఉదా :- ఓ యధిపా! నీ వీ భువిలో దాతవై అతిశయించుచుండ అర్థులమగు మేము ఎన్నడును అమరతరుల (దేవవృక్షములగు కల్ప-మందారాది వృక్షములను) ఆదరింపము (లెక్కచేయము).

ఇచట అర్థులకు, కల్పవృక్షాదులందలి ఆదరమునకును సంబంధమున్నను ఆదరసంబంధము లేదని వర్ణింపబడినది. కావున ఇది అసంబంధాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యముగుచున్నది.

సం॥ యోగేఽప్యయోగే సంబంధాతిశయోక్తి రితీర్యతే,
త్వయి దాతరి రాజేంద్రః స్వర్ద్రుమాన్నాద్రియామహే.

యోగే + (సతి) అపి = సంబంధ మున్నప్పటికిని; అయోగః = సంబంధము లేకుండుటః (వర్ణింపబడిన యెడల): అసంబంధ + అతిశయోక్తిః + ఇతి = అసంబంధాతిశయోక్తి అని; ఈర్యతే = (విద్వాంసులచే) చెప్పబడుచున్నది. హే రాజ + ఇంద్ర = ఓ రాజశ్రేష్ఠా! త్వయి + దాతరి + (సతి) = నీవు, దాతవై, ఉండగా; స్వర్ + ద్రుమాన్ = స్వర్గమందలి కల్పవృక్షాదివృక్షములను, న + ఆద్రియామహే = (మేము) ఆదరింపము.

తే॥ గీ॥ హేతు కార్య సహత్వంబు ఖ్యాతమైన
అక్రమాతిశయోక్తి నా నలరు నొందు
స్వామి! నీ యమ్ము లరిజనుల్ సమము గాన
ఆజి జ్యాలింగన మ్మది యాచరింత్రు 34

కారణమునకు, కార్యమునకు సహభావము వర్ణింపబడిన యెడల నక్రమాతిశయోక్త్యలంకార మగును. ముందు కారణము అనంతరము కార్యము జరుగునను క్రమము లోకానుభవమందు గోచరించు సత్యము. కాగా ఆ క్రమమును అతిక్రమించుట జరిగినట్లు ఇందు వర్ణింపబడుటచే దీనికి అక్రమాతిశయోక్త్యలంకారనామము సార్థకమే.

ఉదా:- ఓ స్వామి! నీ యమ్ములు (బాణములు), అరిజనులు (శత్రువులు) ను సమముగానే (సమకాలమందే అనగా ఒకేసారి) ఆజి (రణము) యందు జ్యాలింగనము (బాణపక్షమున-బాణములు వింటినారిని చేరుట, శత్రుపక్షమున భూమిని కౌగరించుకొనుటను ఆచరించుచున్నారు.

ఇచట శత్రువులు భూమిపై పడిపోవుటకు కారణమైన శర సంధానము జరిగినపుడే, ఆ శరసంధానమునకు కార్యమైన శత్రు భూ పతనము జరుగుచున్నది అని కారణ-కార్యములకు సహ భావము (ఒకే సమయమున జరుగుట) వర్ణింపబడినది. కావున నిది అక్రమాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ అక్రమాతిశయోక్తిస్స్యాత్ సహత్వే హేతు కార్యయోః,
ఆలిఙ్గన్తి సమం దేవ! జ్యాం శరాశ్చ పరాశ్చ తే.

హేతుకార్యయోః=కారణమునకు, కార్యమునకును; సహత్వే (సతి)=సహభావము (వర్ణింపబడుచుండ); అక్రమ+అతిశయోక్తిః =అక్రమాతిశయోక్త్యలంకారము (అగును). హే దేవ!=ఓ రాజా! తే=నీయొక్క: శరాః+చ=బాణములును; పరాః+చ=శత్రువులును; సమమ్ = సమముగా (సమకాలమందే); జ్యామ్=వింటి త్రాటిని; భూమిని; ఆలిఙ్గన్తి=కౌగలించుకొనుచున్నారు.

తే॥ గీ॥ కారణజ్ఞాన మాత్రాన కార్యమైన
అయ్యెది చపలాతిశయోక్తి యనఁగ నొప్పు.
మగఁడు చనియెద నన్నంతమాత్రముననె
అతివ కుంగరంబె వలయ మయ్యె సఖుఁడ. ౨౭

కారణ ప్రసంగ మాత్రముననే కార్యము జరిగినట్లు వర్ణించిన యెడల అది చపలాతిశయోక్త్యలంకారము అనఁగ నొప్పును.

ఉదా : మగఁడు (దూరదేశమునకు) చనెదనన్నంతమాత్రము చేతనే భార్యకు ఉంగరమే వలయము (మురుగు లేక ముంజేతి కడియము (స్వర్ణాభరణము) అయ్యెను,

ఇట భర్త దూరదేశమేగెదనని యనెను. ఇంకను వెళ్ళలేదు. అతఁడు విదేశమేగిన పిమ్మట, అతని భార్య వియోగబాధను భరింప లేక దినదినము కృశించిపోవుట లోకసహజమగు విషయము. కాఁగా

భర్త యొక్క దూరదేశగమన వార్త విన్నంతనే ఆమెకు వియోగ ఫలము కలిగినట్లు వర్ణింపబడినది. కారణ శ్రవణ మాత్రమున కార్యము జరిగినట్లు వర్ణింపబడుటచే నుక్త లక్షణము ననుసరించి ఇది చపలాతిశయోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ చపలాతిశయోక్తిస్తు కార్యే హేతుప్రసక్తిజే,
యాస్యామీత్యుదితే తన్వ్యాః వలయోఽభవ దూర్మికా.

కార్యే=కార్యము; హేతు+ప్రసక్తి+జే+(సతి) = కారణము యొక్క ప్రసంగము చేతనే, సంభవించినదికాఁగా, వర్ణింపబడఁగా; చపలా + అతిశయోక్తిః = చపలాతిశయోక్తి యను అలంకారము; స్యాత్=అగును. యాస్యామి=(భర్త, నేను) వెళ్లబోవుచున్నాను (అని), ఉదితే + (సతి) = చెప్పబడినది కాఁగా (చెప్పబడగా); తన్వ్యాః=కాంతయొక్క; ఊర్మికా=ఉంగరము; వలయః=ముంజేతి కంకణము (మురుగు)గా; అభవత్=ఆయెను.

కం॥ చను నత్యంతాతిశయో
క్తినా మును కార్యము వెనుకఁ దీర్పఁగ [1]గతమున్
వనితామానము మును చన
ననంతరం బనునయించె నతివన్ ప్రియుఁడున్. 36

ముందు కార్యము చెప్పి పిమ్మట కారణము కలిగినట్లు చెప్పినయెడల నది అత్యంతాతిశయోక్త్యలంకార మగును.

ఉదా : మానిని మానము (కోపము) మును చనగా పిదప ప్రియుఁ డనునయించెను.

ఇట ప్రియుఁడు కినుక వహించిన కాంతను అనునయించుట కారణము. వనితా కోపము చనుట (తొలఁగుట) కార్యము. కారణ, కార్యములు పూర్వ పరములందు జరుగుట లోక ప్రసిద్ధ క్రమము. వాస్తవముకూడ కాఁగా ఇట ఇట "వనితామానము

1. కారణము

మును చన, పిదప ప్రియుఁ డనునయించెను" అనుటలో ప్రసిద్ధ వాస్తవ క్రమము వ్యత్యస్తమైనది. కావున క్రమము నత్యంతము మీఱుటచే నిది అత్యంతాతిశయోక్త్యలంకారమునకు లక్ష్య మగుచున్నది.

సం॥ అత్యంతాతిశయోక్తిస్తు పౌర్వాపర్యవ్యతిక్రమే,
అగ్రే మానో గతః పశ్చా దనునీతా ప్రియేణ సా.

పౌర్వాపర్య+వ్యతిక్రమే+(సతి)=పూర్వము, పరము అను భావమునకు వైపరీత్యము (విరుద్ధస్థితి) కలుగుచున్నది కాగా; అతి+అంత+అతిశయ + ఉక్తిః = అత్యంతాతిశయోక్తి అను అలంకార మగును. అగ్రే=ముందు; మానః = కోపము; గతః = పోయినది (తొలఁగినది). పశ్చాత్=తరువాత; సా = ఆవనిత; ప్రియేణ= ప్రియునిచే; అనునీతా = ఓదార్చబడినది.

## 14. తుల్య యోగితాలంకారము

ఆ. వె. వర్ణ్యములకొ కృతి నవర్ణ్యములకొ ధర్మ
మొకటి చెప్పఁ దుల్యయోగిత యగు.
సరసిజములు మఱియు స్వైరిణీవదనముల్
సంకుచితము లయ్యె శశిని గాంచి. 37

ఉపమేయములకు గాని, ఉపమానములకు గాని ధర్మైక్య మును చెప్పిన యెడల తుల్యయోగితాలంకార మగును. తుల్యములను (తుల్యమగువానిని) ఒకచోటయోగించుట (కూర్చుట)యే తుల్య యోగిత యగును.

ఇది 1. ప్రకృత గతము 2. అప్రకృత గతము 3. తాహి హితవృత్తి తౌల్యరూపము 4. గుణాఢ్య సమభావ రూపము అని నాల్గు విధములుగ నొప్పుచున్నది. వీనికి వరుసగా నుదాహరణము లీ క్రింద చూపబడుచున్నవి.

ఉదా : సరసిజములును, స్వైరిణీవదనములును, శశిని గాంచి
(మోదముడిగి) ముకుళించిన వాయెను.

సూర్యుఁడు అస్తమించిన సమయము. అందుచే పద్మముల కది వికాస సమయము కాజాలదు. అట్లే చీఁకటి పడుట స్వైరిణులకు (స్వేచ్ఛా విహారిణులకు) అనుకూల సమయము. కాని అప్పుడే చంద్రుడు ఉదయించినాఁడు. కాన పద్మవికాసము నశించి అవి ముడుచుకొన్నవి. అట్లే చంద్రోదయము పద్మవికాసమునకు వలె స్వైరిణుల స్వేచ్ఛా విహారమునకు భంగము కలిగించును. కావున వారి ముఖములును ముడుచుకొన్నవి.

ఇట వర్ణనీయములు, ప్రస్తుతములు నగు సరసిజ–స్వైరిణీ వదనములు రెంటికిని సంకోచ పడమనే ధర్మైక్యము చెప్పబడినది. కావున నిది ఉపమేయగత తుల్యయోగితాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ వర్ణ్యానా మితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా,
సంకుచన్తి సరోజాని స్వైరిణీ వదనాని చ.

వర్ణ్యానాం+వా=వర్ణనీయములగు ప్రస్తుతములకు గాని, ఇతరేషాం+వా=అప్రస్తుతములకు గాని; ధర్మ+ఐక్యమ్=ధర్మమునకు సంబంధించిన ఏకత్వము (చెప్పబడిన యెడల), తుల్యయోగితా = తుల్యయోగితాలంకారమగును. సరః+జాని = సరస్సున బుట్టిన పద్మములును; స్వైరిణీ+వదనాని+చ=స్వేచ్ఛావిహారిణుల యొక్క ముఖములును; సంకుచన్తి=ముడుచుకొనుచున్నవి.

ఆ. వె. సకియ! నీదు దేహ సౌకుమార్య మరయ
నెవని హృదయమందు నెసఁగకుండు
జాతి–కదళికా–శశాంక లేఖలఁ గల్గు
కఠినతాగుణంబు కరము మెఱసి. 38

ఇది ప్రియుఁడు చేసిన నాయిక యొక్క ప్రశంస. ఇందు నాయికా దేహము ఉపమేయము. జాతి-కదళికా-శశాంక రేఖలు ఉపమానములు. ఈ యుపమానము లన్నింటిలో కఠినత్వ రూపముగు ఒకే సామాన్య ధర్మము వర్ణింపబడినది. కావున నిది ఉపమానగత తుల్యయోగితాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇట ఉపమానములకు ధర్మైక్యమును చెప్పుటవలన ఉపమేయమునకు ఆధిక్యాపాదనమే ప్రధాన ప్రయోజనము.

సం॥ త్వదంగ మార్దవే దృష్టే కస్య చిత్తే న భాసతే,
మాలతీశశభృల్లేఖా కదళీనాం కఠోరతా.

త్వత్ + అఙ్గ + మార్దవే=నీ, శరీరముయొక్క, సౌకుమార్యము దృష్టే+(సతి)=చూడబడినది కాఁగా; కస్య=ఎవనియొక్క; చిత్తే=మనస్సునందు; మాలతీ+శశభృత్+లేఖా+కదళీనామ్ = మాలతీలత, చంద్రలేఖ, అరటుల యొక్క; కఠోరతా=కఠినత్వము; న+భాసతే?=తోఁచకుండును?

ఆ. వె. అమర వృత్తి తౌల్య మాప్తులం దరులందు
తుల్యయోగిత యన తొడరు నొండు.
హితుల కహితుల కిల నతుల మరిష్టంబు
నిచ్చు శక్తి నీకె హెచ్చె నధిప. 39

ఆప్తజనుల యెడ, శత్రుజనుల యెడ సమానముగ వర్తించినట్లు వర్ణించినయెడల నదియు వేరొక తుల్యయోగిత యన నొప్పును.

ఉదా : ఓ రాజా! నీహితులకు నహితులకును అతులారిష్టంబు నిచ్చు శక్తి నీకే అతిశయించి యున్నది.

ఇట అరిష్టశబ్దము మేలు, కీడు నను నర్థ ద్వయము నిచ్చుచు హితాహితుల (ఆప్త-శత్రువుల) విషయమున రాజునకు గల వృత్తి

తౌల్యమును చెప్పుచున్నది. కావున నిది ఉక్తలక్షణానుసారము వేఱొక తుల్యయోగితాలంకార మగుచున్నది.

సం॥ హితాహితే వృత్తితౌల్యమపరా తుల్యయోగితా,
ప్రదీయతే పరా భూతిః మిత్రశాత్రవయో స్త్వయా.

హిత+అహితే=ఆప్తుల విషయమున, శత్రువుల విషయమున వృత్తి=తౌల్యమ్ = ప్రవృత్తి తుల్యత: (చెప్పబడిన యెడల) అపరా+(అది) వేఱొక: తుల్యయోగితా = తుల్యయోగితాలంకారము (అగును). త్వయా = నీచేత; మిత్ర+శాత్రవయోః=మిత్రులకును, శత్రువులకును; పరా+భూతిః=శ్రేష్ఠమగు, ఐశ్వర్యము: పరా భూతిః=పరాభవము (అవమానము): ప్రదీయతే = ఈయబడు చున్నది.

ఆ. వె. సద్గుణాఢ్యవరుల సమభావమును జెప్ప
నొప్పు నన్యతుల్యయోగిత కృతి.
శమన-వరుణ-ధనద-శక్రుఖున్ నీవును
లోకపాలు రయ్యు సాకుచుంద్రు. 40

ఒకనిని గుణగరిష్ఠులతో సమానునిగఁ జేసి జెప్పుటయు మఱి యొక తుల్యయోగితాలంకారమన నొప్పును.

ఉదా : జనులందఱు యమ-వరుణ-కుబేర-దేవేంద్రులను,నిన్ను ను లోకపాలు రందురు.

ఇట గుణోత్కృష్టులును, దిక్పాలురును ఐన యమ-వరుణ-ధనద-దేవేంద్రులతో లోకపాలకత్వమున రాజు సముడుగా చెప్ప బడినందున లక్షణోక్తమగు వేరొక తుల్యయోగితాలంకారమున కిది లక్ష్యమగుచున్నది.

సం॥ గుణోత్కృష్టైః సమీకృత్య వచోఽన్యా తుల్యయోగితా,
లోకపాలో యమః పాశీ శ్రీద శ్శక్రో భవానపి.

గుణ+ఉత్కృష్టైః= మంచి గుణములచేత శ్రేష్ఠులైన వారితో; సమీకృత్య=సమముగా చేర్చి; వచః = వాక్యము: (చెప్పఁబడిన యెడల); అన్యా=మఱియొక; తుల్యయోగితా=తుల్యయోగిత యను అలంకారము (అగును). యమః=యముఁడు; లోకపాలః=లోక పాలుడు, పాశీ=వరుణుఁడు (లోకపాలుడు): శ్రీదః=కుబేరుఁడు (లోకపాలుడు); శక్రః=ఇంద్రుఁడు (లోకపాలుడు); భవాన్+అపి=నీవును: లోకపాలః=లోకపాలకుడవు.

## 15· దీపకాలంకారము

ఆ. వె. విషయి-విషయములకు వెలుగ ధర్మైక్యంబు
దీపకం బనఁ గృతి - దీప్తిఁ గాంచు
ప్రథితమదముచేత భాసించు ద్విరదంబు
ప్రథిత విక్రమమునఁ బాలకుండు 41

ఉపమానోపమేయములకు ధర్మైక్యమును జెప్పినయెడల దీపకాలంకార మగును.

ఉదా : ద్విరదము ప్రథితమదము చేతను, ప్రభువు ప్రసిద్ధ విక్రమంబు చేతను భాసించును.

ఇట ప్రస్తుతాంశమగు ప్రభువునకును, అప్రస్తుతాంశమగు ద్విరదమునకును ధర్మైక్యమును దెల్పి "భాసించు" అను క్రియతో అన్వయము చెప్పఁబడినది. కాన నిట దీపకాలంకారము ఒప్పుచున్నది.

దీపక-తుల్యయోగితాలంకారముల రెంటియందు ఉపమాలంకారము గమ్యమానమగుచున్నను, దీపకమునందు అప్రస్తుతము ఉపమానము, ప్రస్తుతము ఉపమేయమని ఉపమానోపమేయ భావము వ్యవస్థితమైనది. తుల్యయోగితయం దది ఐచ్ఛికము.

సం॥ వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః,
మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః.

వర్ణ్య+అవర్ణ్యానాం = ప్రస్తుతముల యొక్కః అప్రస్తుతముల యొక్కః ధర్మ+ఐక్యమ్ = ధర్మమునకు ఏకత్వము: (చెప్పబడిన యెడల) దీపకమ్ = దీపకాలంకారము: (అని) బుధాః= విద్వాంసులు; వదన్తి=చెప్పుచుందురు. మదేన=మద జలముచేతః కలభః=ఏనుఁగు గున్నయు; ప్రతాపేన = ధన-బల మూలకమగు తేజస్సుచే: మహీపతిః=భూపతియు; భాతి=ప్రకాశించును.

## 16· ఆవృత్తి దీపకాలంకారము

తే॥ గీ॥ పద పదార్థో భయావృత్తిఁ బలుకఁ గృతుల
త్రివిధమై యొప్పు నావృత్తిదీపకంబు.
పరఁగు జలదాళి దుస్సహవర్ష మయ్యె.
పడతి కాఱాత్రి దుస్సహవర్ష మయ్యె. ౪౨

ఆ. వె. కదిమిపూవు లంత 1కడిమి 2మెఱయు విచ్చె
కొండమల్లెపూలు 3కొసరి పేరె
చాతకములు తృప్తిఁ జొక్కుకొనును
4పొంగి మత్తుకొనును శిఖులు వెల్ల. ౪౩

దీపకమునకు ఆవృత్తి చెప్పినచో ఆవృత్తి దీపకాలంకార మగును. ఈ యావృత్తి శబ్దరూపమైన యెడల నది శబ్దావృత్తి దీపకాలంకార మగును. అర్థమునకే ఆవృత్తి చెప్పినయెడల అర్థావృత్తి దీపకాలంకార మగును. శబ్దమునకును,అర్థమునకును ఆవృత్తి చెప్పిన యెడల అది ఉభయావృత్తి దీపకాలంకార మగును. ఇట్టి మొదటి పద్యము యొక్క ద్వితీయార్థమందు జూపిన

ఉదా : 1. జలదాళి దుస్సహవర్ష మయ్యెను: పడతి కాఱాత్రి దుస్సహ వర్ష మాయెను.

1. అతిశయము: ఆధిక్యము 2. ప్రకాశింప: బయల్పడ;
3, 4, విజృంభించి.

ఇట "వర్ష" రూప శబ్దము అవృత్తమైనది. కాని ఆ వర్ష శబ్దము ఒకచోట "వాన" అనియు, వేఱొకచోట "సంవత్సరము" అనియు నర్థము నిచ్చుచున్నది. కాన నిది పదావృత్తిదీపకాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ త్రివిధం దీపకావృత్తౌ భవే దావృత్తిదీపకమ్,
వర్షత్యంబుదమాలేయం వర్షత్యేషా చ శర్వరీ.

దీపక+అవృత్తౌ (సత్యాం)=దీపకమునకు మూలభూతమైన పదమునకు, అర్థమునకు అవృత్తి కలిగిన యెడల; అవృత్తిదీపకమ్= అవృత్తిదీపకాలంకారము. త్రివిధమ్=మూఁడు విధములు గలది; భవేత్=అగును. ఇయమ్=ఈ; అంబుదమాలా=మేఘసమూహము; వర్షతి=వర్షించుచున్నది. ఏషా=ఈ; శర్వరీ + చ = రాత్రియు; వర్షతి=వర్ష ఇవ ఆచరతి = సంవత్సరకాలమువలె ఆగుచున్నది. రెండవ పద్యమందలి మొదటి అర్ధభాగమున చూపిన

"కడిమి పూవు లంత కడిమి మెఱయ విచ్చె
కొండమల్లె పూలు కొసరి విరిసె."

ఈ యుదాహరణమందు 'విచ్చె, విరిసె' అను వేర్వేఱు పదములు 'విప్పారెను. లేక వికసించెను' అను ఒకే అర్థము నిచ్చుచున్నవి. కావున నిట నిట్లు అర్థమునకావృత్తి చెప్పబడుటచే నిది అర్థావృత్తి దీపకాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

కాఁగా ఈ పద్యమందలి ఉత్తరార్ధమున చూపిన

"చాతకములు తృప్తిఁ జాల మత్తుకొనును
వెలఁగి మత్తుకొనును శిఖుల వెల్ల"

అను నుదాహరణములో 'మత్తుకొనును' అను పదము, దాని యర్థము కూడ ఆవృత్తము అయినది. కావున నిది శబ్దార్థోభయావృత్తి దీపకాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఉన్మీలన్తి కదంబాని స్ఫుటన్తి కుటజోద్గమాః,
మాద్యన్తి చాతకాస్తృప్తా మాద్యన్తి చ శిఖావళాః.

కదంబాని=కడిమిపూవులు; ఉన్మీలన్తి = వికసించుచున్నవి; కుటజ + ఉద్గమాః = కొండమల్లెల, పూవులు: స్ఫుటన్తి=వికసించుచున్నవి. తృప్తాః=తనివి నందిన: చాతకాః=చాతకపక్షులు (వానకోయిలలు); మాద్యన్తి=మదించుచున్నవి.(మత్తెక్కినవగుచున్నవి). శిఖావళాః + చ=నెమిళ్లును; మాద్యన్తి=మదించుచున్నవి.

## 17. ప్రతివస్తూపమాలంకారము

కం॥ [1]ఏపంగ కృతుల ప్రతివ
స్తూపమ వాక్యముల జంట కొక సమతం గనన్
తాపమ్మున సూరుఁ డమరు
చాపమ్మున శూరుఁ డొప్పు జగతిం గనంగన్. 44

ఉపమానోపమేయవాక్యముల జంటకు ఒకే సామాన్యధర్మము వేర్వేఱు పదములచే చూపబడినయెడల నది ప్రతివస్తూపమాలంకారమగును.

ఉదా :- సూరుఁడు (సూర్యుడు) తాపముచే అమరును. శూరుఁడు చాపము (వింటి)చే నొప్పును.

ఇట రెండు వాక్యములున్నవి. మొదటిది ఉపమానవాక్యము. రెండవది ఉపమేయవాక్యము. ఈ రెండు వాక్యములకు "అమరును, ఒప్పును" అను వేర్వేఱు పదములతో ఒకే సామాన్యధర్మము (ఒప్పుచుండుట అనునది) చెప్పబడుటచే నిది ప్రతివస్తూపమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

అర్థావృత్తిదీపకమున ప్రస్తుతార్థములకుగాని, అప్రస్తుతార్థములకుగాని ధర్మైక్యము చెప్పబడును. ప్రతివస్తూపమాలంకార

1. ఆధిక్యము.

మందు ప్రస్తుతా[illegible] రెంటికిని ధర్మైక్యము చెప్పబడును. మఱియు ఆవృత్తిదీపకము వైధర్మ్యముతో కన్పింపదు. ప్రతివస్తూపమ వైధర్మ్యముతో నైనను కన్పించును.

## 18. దృష్టాంతాలంకారము

తే॥ గీ॥ బింబము ప్రతిబింబ మనంగ భిన్నవాక్య
ధర్మ మున్న దృష్టాంత మై తనరు కృతుల
అధిప! కీర్తిమంతుఁడ నీవె అవని యందు
కాంతిమంతుఁ డా చంద్రుఁడే గగనమందు. 45

ఉపమానోపమేయ వాక్యములయొక్క ధర్మములు వేఱయ్యు ఒకటి బింబము, మఱొకటి దానికి ప్రతిబింబ మనునట్లు చెప్పబడిన యెడల అది దృష్టాంతాలంకార మనబడును.

ఉదా :- ఓ రాజా! భువిలో నీవే కీర్తిమంతుఁడవు. గగన మందా చంద్రుఁడే కాంతిమంతుఁడు.

ఇట మొదటిది ఉపమేయ వాక్యము బింబము. రెండవది ఉపమానవాక్యము. ఇది ప్రతిబింబము.

ఈ రెంటియందున్న కీర్తియు, కాంతియు వేఱుధర్మము లైనను క్రమముగా బింబము, ప్రతిబింబములుగా చెప్పబడినవి. భువిలో నీవంటి కీర్తిమంతుడును, గగనమున చంద్రునినంటి కాంతిమంతుడును లేఁడని భావము. కావున నిది దృష్టాంతాలంకారము.

సం॥ చేద్బింబ ప్రతిబింబత్వం దృష్టాన్తస్తదలంకృతిః,
త్వమేవ కీర్తిమాన్ రాజన్! విధురేవ హి కాన్తిమాన్.

బింబ+ప్రతిబింబత్వమ్ = (ఉపమానోపమేయ వాక్యముల భిన్నధర్మములు) బిమ్బ, ప్రతిబింబ భావముతో (నిర్దిష్టౌ) చేత్ = (నిర్దేశింపబడినవి) ఐన యెడల; తత్ = అప్పుడు; దృష్టాన్తః =

దృష్టాన్తమను: అలంకృతిః=అలంకారము (అగును). హే రాజన్= ఓ రాజా! త్వమ్+ఏవ=నీవే; కీర్తిమాన్=కీర్తిమంతుఁడవు. విధుః+ఏవ+హి=చంద్రుఁడే; కాన్తిమాన్=కాంతిమంతుఁడు.

## 19. నిదర్శనాలంకారము

తే॥ గీ॥ అగు నిదర్శన సదృశవాక్యార్థములకు
నైకతారోప మది కృతి నెసఁగె నేని
దాతయందు సౌమ్యత, యదం దనదు నేది?
కనఁగ పూర్ణేందు నిష్కళంకత్వ మదియె. 46

సదృశములైన వాక్యార్థములకు రెంటికి ఐక్యముయొక్క (ఏకత్వముయొక్క-అభేదముయొక్క) ఆరోపము నిదర్శనాలంకారము అగును.

ఇది వాక్యార్థవృత్తి నిదర్శన, పదార్థవృత్తి నిదర్శన, సదసదర్థబోధక నిదర్శన అని మూడు విధములుగా నుండును. వరుసగా ఉదాహరణము లీ క్రింద చూపబడుచున్నవి.

ఉదా :- 1) ఏది దాతయొక్క సౌమ్యతయో అదియే పూర్ణచంద్రుని నిష్కళంకత యగును.

ఇట దాతయొక్క సౌమ్యత అనునది ఉపమేయవాక్యము. పూర్ణచంద్రుని నిష్కళంకత యనునది ఉపమానవాక్యము. ఈ రెండు వాక్యములకు ఏకత్వము చెప్పబడలేదు. కాని తాత్పర్యార్థము పరిశీలింప చంద్రునకు నిష్కళంకత్వ మెట్లు అనూహ్యమో అట్లే దాతకు సౌమ్యభావమును అనూహ్యమే. కాఁగా ఈ రెండు వాక్యములకు అభేదారోపము చేయబడినది. కావున నిది వాక్యార్థవృత్తి నిదర్శనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఆ. వె. అగు పదార్థవృత్తి యన్య నిదర్శన
యలరు నంచు కొందఱం్రడు బుధులు.
నేఁడు కనులజంట నీలోత్పలములీల
తనరఁ దాల్చు చుండు తరుణి! కనుము. 47

వాక్యార్థములకే కాక పదార్థమునకు సంబంధించినది వేఱొక నిదర్శనాలంకారము ఒప్పుచుండునని కొందఱు విద్వాంసు లందురు.

ఉదా :- ఓ తరుణీ! నీ కనులజంట నీలోత్పములీల దాల్చుచున్నది చూడుమా.

ఇట తరుణి కనుల జంట ఉపమేయము. నీలోత్పలములు ఉపమానము. నీలోత్పలములందున్న విలాసమును కనులజంట యందు ఆరోపించుచు అలీలనే కనులు దాల్చుచున్నవని తదైక్యమే చెప్పఁబడినది. ఈ యైక్యారోపణము లీలాపదార్థవృత్తి యగుటచే ఇది పదార్థవృత్తి నిదర్శనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ పదార్థవృత్తి మప్యేకే వద న్త్యన్యాం నిదర్శనామ్,
త్వన్నే త్రయుగళం ధత్తే లీలాం నీలాంబు జన్మనోః.

ఏకే=కొందఱు; పదార్థవృత్తిమ్+అపి = పదార్థవృత్తియగు దానిని కూడ; అన్యామ్=వేఱొక; నిదర్శనామ్=నిదర్శనాలంకారముగ వద న్తి=చెప్పుచున్నారు. త్వత్+నేత్ర+యుగళమ్ = నీ కనుల, జంట; నీల+అంబుజన్మనోః = (రెండు) నల్లకలువలయొక్క; లీలాం=విలాసమును: ధత్తే=ధరించుచున్నది.

ఆ. వె. కీడొ మేలొ గాని క్రియచేత బోధింప
పేరు నిదర్శన యనీ విజ్ఞు లంద్రు
రాజవైరి తానె ్రమగ్గు నెట్టన యంచు
చంద్రుఁ డుదయ మందె సమయు తమము. 48

క్రియచే అసత్+అర్థము (కీడు) గాని, సత్+అర్థము (మేలు)

నాని బోధించుట జరిగినేని సదసదర్థబోధక నిదర్శనాలంకార మన బడును.

ఇట రాజవైరి అన్న పదమునకు రాజునకు వైరి, చంద్రునకు వైరి అను నర్థములు గలవు. తమము తన వినాశమునే దృష్టాంతముగా జూపుచు రాజ (ప్రభు) వైరి రాజు (ప్రభువు) యొక్క అభ్యున్నతి కాలమందు నశించునని బోధించుచున్నది. ఇట తమస్సు ఆత్మనాశక్రియచే "రాజవైరి నశించునని" బోధించుటచే నిది అసదర్థబోధక నిదర్శనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

క్రియయా=చేష్టతో: అసత్+సత్+అర్థయోః=చెడు, మంచి విషయములయొక్క; బోధనమ్=బోధించుట (తెలియజేయుట) (జరిగినయెడల) అపరామ్ (నిదర్శనామ్)=మఱియొక నిదర్శనాలంకారమని (బుధులు) చెప్పుచుందురు. రాజవిరోధీ = రాజుయొక్క శత్రువు: నశ్యేత్ = నశించును; ఇతి=అని; (తెల్పుచు) చంద్ర+ఉదయే=చంద్రుఁడు ఉదయించునపుడు; తమః=చీఁకటి: క్షీణమ్= నశించినది (అయెను).

ఆ. వె. మించు సంపదలకు మేఱయు సత్ఫల మెన్న
సుహృదనుగ్రహంబె చూడుఁడనుచు
అర్కుఁ డుదయ మంది అంతలో నర్పించు
అంబుజముల కెల్ల నాత్మలక్ష్మి. 49

ఉదా :- మించిన సంపదలకు సత్ఫలము సుహృదనుగ్రహమనుచు సూర్యుఁడు ఉదయించుచునే ఆత్మలక్ష్మి నంబుజముల కర్పించును.

ఇట ఉదయమనగా ఉదయించు సమయము, అభివృద్ధిని పొందుకాలము అని అర్థము. అట్లే లక్ష్మి అనగా రమ, సంపద, శోభ అని అర్థము. సూర్యుఁడట్టి ఉదయ సమయముననే తాను

చేయు సుహృదనుగ్రహమును దృష్టాంతముగాచూపుచు, సంపన్నులను తమ సంపదలతో మిత్రుల ననుగ్రహింపవలెనని బోధించుచున్నాడు. సూర్యుడు "సుహృదనుగ్రహరూపమగు" క్రియచేత "సుహృదనుగ్రహము చూపుడ"ను సదర్థమునే బోధించుటచే నిది సదర్థబోధక నిదర్శనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఉదయన్నేవ సవితా పద్మేష్వర్పయతి శ్రియమ్,
విభావయన్సమృద్ధీనాం ఫలం సుహృదనుగ్రహః.

సవితా=సూర్యుడు: ఉదయన్+ఏవ = ఉదయించుచునే; అనగా ఉదయించినదాది; సమృద్ధీనామ్=సంపదలకు; ఫలమ్= ప్రయోజనము; సుహృత్+అనుగ్రహః=మిత్రులను, అనుగ్రహించుట; (అని) విభావయన్=బోధించుచున్నవాడై; పద్మేషు=పద్మములయందు; శ్రియమ్=సిరిని; అర్పయతి=అర్పించుచున్నాడు. (అందజేయుచున్నాడు).

## 20. వ్యతిరేకాలంకారము

ఆ. వె. విషయి-విషయములకు వెలయు విశేషంబు
నుడువగ వ్యతిరేక మలరు కృతుల
శైలముల పగిది సుజను లున్నతులె, గాని
ప్రకృతి మార్దవమున బరగుచుంద్రు. 50

ఉపమానోపమేయములకు పోలిక చెప్పుట సహజము, ఆ పోలికతోపాటు (ఆధిక్యాది) విశేషమును గూడ చెప్పిన వ్యతిరేకాలంకార మగును. ఈ ప్రత్యేక వైలక్షణ్యము (వ్యతిరేకధర్మము)ను బట్టియే దీనికి వ్యతిరేకాలంకారమను పేరు సార్థకమగుచున్నది.

ఉదా :- సుజనులు శైలములవలె ఉన్నతులే గాని సహజముగ మృదుస్వభావులు.

ఇందు ఉపమేయము-సుజనులు. ఉపమానము-శైలములు.

సమానధర్మము-ఔన్నత్యము. ఉపమావాచకము-పగిది అనునది. ఇది ఉపమాలంకారాంగములతో కూడియున్నందున ఉపమాలంకారము కాదగి యున్నది. అయితే ఇట ఉపమానమగు కొండలకు సహజతాతిన్యము ఉండగా ఉపమేయమగు సుజనులలో "ప్రకృతి మార్దవ"మను విశేషధర్మమున్నట్లు చెప్పబడినది. కావున ఉపమానము కంటె ఉపమేయమునందు ఆధిక్యమున్నదనుట స్పష్టమే. అందుచే నిది పై దెల్పిన లక్షణమునుబట్టి వ్యతిరేకాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఈ వ్యతిరేకాలంకారము ఉపమేయమునకు ఆధిక్య పర్యవసాయి అగుచున్నది. (ఆధిక్యమును చెప్పుటతో ముగియుచున్నది). ఈ వ్యతిరేకము ఉపమేయ న్యూనత్వ పర్యవసాయిగను, అనుభయ పర్యవసాయిగనుకూడ ఉండును.

సం॥ వ్యతిరేకో విశేషశ్చే దుపమానోపమేయయోః,
శైలా ఇవోన్నతా స్సన్తః కిన్తు ప్రకృతికోమలాః.

ఉపమాన+ఉపమేయయోః = ఉపమానోపమేయములందు; విశేషః=(ఒకదానికి) పై లక్షణ్యము (విశేషలక్షణము కల్గియుండుట) చేత్=(వర్ణితము) ఐనయెడల; వ్యతిరేకః = వ్యతిరేకాలంకారము (అగును). సన్తః=సజ్జనులు; శైలాః+ఇవ=కొండలవలె;ఉన్నతాః= ఉన్నతిగలవారు; కిన్తు=కాని; ప్రకృతి+కోమలాః=స్వభావమును బట్టి మృదువైన (మెత్తని) వారు.

## 21. సహోక్త్యలంకారము

ఆ. వె. జనమనోహర మగు సహభావముం జెప్ప
నది సహోక్తి యనగ నతిశయించు
విభుని కీర్తి యెసగె విజితరిపులతోడ
ఇల దిగంతములకు నేగి సఖుడ!.

సరసజనరంజకమగు సహభావమును గూర్చినయెడల నది సహోక్త్యలంకార మగును. ఇందు ముఖ్యమగు నొకవిషయము

క్రియతో నన్వయించుమండగా, సహశబ్దగ్రహణముచే అన్యవిష యముకూడ క్రియతో నన్వయించును. అయితే అది జనరంజకము కావలెను.

ఉదా :- రాజుయొక్క కీర్తి యుద్ధమున జయింపబడిన శత్రువు లతో కూడ దిగంతముల కేగెను.

ఇట ముఖ్యవిషయము రాజకీర్తి. అది దిగంతముల కేగె ననుటలో గల "ఏగు" క్రియతో నన్వయించుచున్నది.

ఇట "రిపులతోడ అనగా రిపులతోకూడ" అని సహార్థమిచ్చు శబ్ద ప్రతిపాదనచే, ముఖ్యము కాకపోయినను "రిపులు" అను పదము కూడ "ఏగె" నను క్రియతో నన్వయించుచున్నది. కాఁగా "రిపులు పాఱిపోవుట" కారణము. కీర్తి దిగంతములవఱకు వ్యాపించుట కార్యము. హేతుకార్యములు సమకాలమునందు జరిగినట్లు చెప్పుటచే అక్రమాతిశయోక్తి కవకాశమున్నను సహార్థకశబ్దమును బట్టి ఇది సహోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇట ని యముఖ్య విషయముకూడ ముఖ్యవిషయోత్కర్షాపాదకమగుచు సరసజన హృద యాహ్లాదకర మగుచున్నది.

సం॥ సహోక్తిస్సహభావశ్చే ద్భాసతే జనరఞ్జనః,
దిగన్త మగమ త్తస్య కీర్తిః ప్రత్యర్థిభిస్సహ.

జన+రఞ్జ+నః=సహృదయులను రంజింపజేయునట్టి; సహ భావః=సహత్వము (కూడ అనుభావము); భాసతేచేత్=భాసించు (ప్రకాశించు) చున్నయెడల; సహ+ఉక్తిః=సహోక్తి అను నలంకా రము (అగును)· తస్య=ఆ విజేతయగు రాజుయొక్క; కీర్తిః= కీర్తి; (ప్రతి+అర్థిభిః)+సహ=శత్రువులతో, కూడ; దిక్+అన్తమ్= దిక్కుల చివఱివఱకు; అగమత్=వెళ్లెను.

## 22. వినోక్త్యలంకారము

తే॥ గీ॥ ప్రస్తుతం[1] బొకవస్తువున్ బాసి కృతుల
హీన మయ్యే నేని వినోక్తి యెసఁగుచుండు.
హృద్యవిద్య యుండి వినయ [2]మెనయ కున్న
ఆర్యు లయ్యే ద [3]వద్యమే యనిరి సుమ్ము. 52

ఒకానొక వస్తువు లేక గుణము లేకుండుటచే ఉపమేయము హీనమైనట్లు వర్ణించిన యెడల నది వినోక్త్యలంకార మగును. వినా+ఉక్తిః=ఒకానొకటి లేకుండ, చెప్పుట; కావున ఇందు 'వినా' అను నర్థమిచ్చు శబ్దగ్రహణము ఉండవలెను. ఇది ఇంతకు ముందే చెప్పిన సహోక్తికి వ్యతిరేకమైనది. ఇది హీన స్వరూపవినోక్తి - రమ్య స్వరూపవినోక్తి యని రెండు విధములు.

ఉదా :- హృద్య (మనోహర) మైన విద్యయుండియు వినయము లేకున్నయెడల నార్యు లది అవద్యమే యనిరి.

ఇట విద్య యనునది వర్ణ్యము. విద్యకు ఫలము వినయ సంపద అమరుట. ఆ వినయము లేకుండుటచే ఇట విద్యకు హీనత చెప్పబడినది. కావున నిది మొదటి వినోక్త్యలంకారమునకు లక్ష్య మగుచున్నది.

సం॥ వినోక్తి శ్చేద్వినా కిఞ్చి త్ప్రస్తుతం హీన ముచ్యతే,
విద్యా హృద్యాపి సావద్యా వినా వినయసమ్పదమ్.

కించిత్+వినా=ఒకానొక వస్తువు లేక గుణము, లేకుండుటచే; ప్రస్తుతమ్=వర్ణ్యము: హీనమ్=దుష్టమైనదిగా; ఉచ్యతే చేత్=చెప్ప బడుచున్న దైన యెడల; వినోక్తిః=వినోక్తి యను నలంకారము (అగును). విద్యా=విద్య; హృద్యా + అపి = మనోహరమైనది, ఐనను: వినయసమ్పదమ్+వినా = వినయసంపద లేకపోయిన

1. ఒకానొక 2. పొందకున్న; సరిపోలకున్న 3. దుష్టమే:

యెడల: సా=అ విద్య; అవద్యా=హీనమైనదే అనఁగా దుష్టమైనది లేక శ్లాఘ్యము కానిదే.

తే॥ గీ॥ ప్రస్తుతం బొక వస్తువున్ బాసి కృతుల
రమ్య మయ్యె నేని వినోక్తి ప్రథిత మొండు.
వసుమతీనాథ! దుర్జన వర్జితంబు
నీదు సభ యెంతొ శోభించు నీడు లేక. 53

ఒకానొక వస్తువుగాని, గుణముగాని లేకపోయినందుచే వర్ణ్యమునకు రమ్యత వర్ణించినయెడల అది వినోక్త్యలంకారముగ ప్రసిద్ధమగును.

ఉదా :- ఓ వసుమతీనాథ! (భూనాథ!) దుర్జనరహితమగు నీ సభ ఈడు (సాటి) లేక ఎంతో శోభించుచున్నది.

ఇట రాజసభ-వర్ణ్యము. - దుర్జనులు లేకుంటచే వర్ణ్యమునకు రమ్యత (శోభాస్పదమగుట) కలిగినట్లు వర్ణింపబడినది. కావున నిది రమ్యస్వరూపవినోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ తచ్చే త్కిఞ్చి ద్వినా రమ్యం వినోక్తిస్సాపి కథ్యతే,
వినా ఖలై ర్విభాత్యేషా రాజేంద్ర! భవతః సభా.

కిఞ్చిత్+వినా=ఒకానొక వస్తువుగాని, గుణముగాని లేకుండుటచే; తత్= అది (వర్ణ్యము); రమ్యమ్+ చేత్ = మనోహరమైనది, ఐన యెడల: సా+అపి=అదికూడ; వినా+ఉక్తిః=వినోక్త్యలంకారము (అని): కథ్యతే=చెప్పబడుచున్నది. హే రాజ+ఇంద్ర= ఓ రాజశ్రేష్ఠా!: భవతః=తమయొక్క: సభా=ఆస్థాన మండపము (కొలువుకూటము); ఖలైః + వినా = దుర్జనులు, లేకుండుటచే విభాతి=మిక్కిలి ప్రకాశించుచున్నది.

## 23. సమాసోక్త్యలంకారము

తే॥ గీ॥ ప్రకట వర్ణ్యోక్తి నన్యంబు ప్రస్ఫురింప
కృతి సమాసోక్తి హృద్యమై యతిశయించు
చంద్రుఁ డైంద్రీ ముఖము రక్తిఁ జక్కఁ నిక్కి
చుంబనంబును జేయును చూడు మిడిగొ. 54

ప్రస్తుతమును జెప్పుచుండ నప్రస్తుతము స్ఫురించెనేని అట సమాసోక్త్యలంకారము ప్రకాశించుచుండును. సమాసోక్తి యనఁగా సమాస+ఉక్తి = సంగ్రహోక్తి యే.

ఉదా :- మిత్రమా! చూడు. ఈ రక్తుఁగల చంద్రుఁడు తల పైకెత్తి ఐంద్రీముఖమును చుంబనము చేయుచున్నాఁడు

ఇట ప్రస్తుతము చంద్రోదయము. పూర్ణచంద్రుఁడు ఉదయించునపుడు ఎఱ్ఱగనుండి తూర్పు దిఙ్ముఖమును స్పృశించుట ప్రకృతిసిద్ధమగు వాస్తవము. కాఁగా ఇందు "చంద్రుఁడు" అను పుంలింగశబ్దము, 'ఐంద్రి' అను స్త్రీలింగశబ్దముతోపాటు, రక్తముఖ-చుంబన శబ్దముల ప్రయోగించుటచే అప్రస్తుతవిషయము స్ఫురించుటకు అవకాశమేర్పడినది. శ్లేషసామర్థ్యముచేత రక్త శబ్దమునకు 'ఎఱుపురంగు; అనురాగయుక్తుడు' అను నర్థములు 'ఐంద్రీముఖ' శబ్దమునకు తూర్పుదిక్కు, ఇంద్రునకు సంబంధించిన స్త్రీయొక్క వదనము అను నర్థములు కలుగుచున్నవి. మఱియు చుంబనశబ్దము ప్రస్తుతార్థ-అప్రస్తుతార్థములకు సామాన్యముగ వర్తించుచున్నది. అందుచే 'చంద్రుఁ'డను నాయకుఁడు, 'ఐంద్రి' యను నాయికయొక్క ముఖమును ఆసక్తితో చుంబనముచేయు (ముద్దిడుకొను) చున్నాఁడు అను పరవనితాసక్త పురుషవృత్తాంతరూపమగు విషయాన్తర పరిస్ఫూర్తి (స్ఫురణము) కలుగుచున్నది. కావున నిది సమాసోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇందు ప్రస్తుతవిషయము విషయాంతరమును స్ఫురింపఁ జేయుచున్నది. ఇట సమాసోక్తి (రెండంశములను సంగ్రహించి చెప్పుట) యను నామము సార్థకము అగుచున్నది.

సం॥ సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్,
అయ మైంద్రీముఖం పశ్య రక్తశ్చుమ్బతి చన్ద్రమాః.

ప్రస్తుతే= ప్రస్తుతవిషయము (చెప్పఁబడఁగా); అప్రస్తుతస్య= ప్రస్తుతముకాని విషయముయొక్క; పరిస్ఫూర్తిః=పరిస్ఫురణము (చక్కఁగా స్ఫురించుట); చేత్=(జరిగిన) యెడల సమాస+ఉక్తిః= సమాసోక్తి యను అలంకార మగును. అయమ్= ఈ; చంద్రమాః= చంద్రుఁడు; రక్తః=ఎఱ్ఱదనముకలవాఁడై (అనురాగముకలవాఁడై) ఐన్ద్రీ+ముఖమ్=తూర్పు దిఙ్ముఖమును (ఇంద్రునకు సంబంధించు స్త్రీయొక్క వదనమును); చుమ్బతి=స్పృశించుచున్నాఁడు (ముద్దిడుచున్నాఁడు); పశ్య=చూడుమా!.

## 24. పరికరాలంకారము

తే॥ గీ॥ సాశయంబౌ విశేషణం బమరఁ జెప్ప
పరికరాలంకృతి కృతులఁ బరఁగుచుండు
అమృతకర శేఖరుండయ్యు నలరు శివుఁడు
నరుల సంతాప మంతయు నణఁచుఁ గాక. 55

విశేషణమును సాభిప్రాయము (ప్రత్యేకమగు ఆశయము గలది)గా ప్రయోగించెనేని పరికరాలంకార మగును.

అనఁగా ప్రస్తుతమగు నర్థసిద్ధికి తోడ్పడు ప్రత్యేకాభిప్రాయమును దెలుపు విశేషణము లేక విశేషణములను కూర్చి చెప్పిన యెడల పరికరాలంకార మని భావము.

ఉదా :- అమృతకరుఁడు (చంద్రుఁడు) శేఖరము (శిరోభూషణము)గా గల శివుఁడు నరుల సంతాపము నణఁచుగాక.

ఇక శివుఁడు సహజముగానే శమించియుండువాఁడు. మఱియు శమముతో గూడినవాఁడు. అట్టి శివుఁడు నరుల సంతాపమును నణఁచుగోరుట ప్రస్తుతాంశము. అధికతాపనాశమును గోరిక నెఱవేరుటకు తోడ్పడు "అమృతకరశేఖరుఁడ"ను సాభిప్రాయ విశేషణ మిట కూర్పబడినది. చంద్రుఁడు చల్లనివాఁడు. చల్లఁదనము సంతాపనాశకము. శివుఁడు ప్రస్తుత-సంతాపనాశమొనర్చుటలో "అమృతకరశేఖరత్వము" కూడ తోడ్పడునను ప్రత్యేకాభిప్రాయము ఈ విశేషణముచే దెల్పుపడినది. కాన నిద్దిపరికరాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ అలఙ్కారః పరికరః స్సాభిప్రాయ విశేషణైః,
సుధాంశు కలితో త్తంస స్తాపం హరతు వశ్శివః.

(స+అభిప్రాయ)+విశేషణై=ప్రత్యేకమగు నభిప్రాయమునుదెల్పు విశేషణములతో; (కూడినది) పరికరః=పరికర మను; అలఙ్కారః=అలంకారము (అగును). (సుధా+అంశు)+కలిత+ఉత్తంసః=అమృతకరుఁడగు చంద్రుఁడే, శిరోభూషణముగా గల; శివః=పరమేశ్వరుఁడు; వః=మీ యందఱియొక్క; తాపం=తపనమును; హరతు=పోగొట్టును గాక.

## 25. పరికరాంకురాలంకారము

తే॥ గీ॥ సాశయంబౌ విశేష్యంబు చకన్ గూర్ప
పరికరాంకురాలంకృతి పరఁగు కృతుల
[1]చనఁ జతుర్విధ పురుషార్థ ఫలప్రదాత
దుష్టశిక్షకుఁడౌ నా చతుర్భుజుండె. 31

విశేష్యము సాభిప్రాయమైనచో పరికరాంకురాలంకార మగును. విశేషణము సాభిప్రాయమైన పరికరమును, విశేష్యము సాభిప్రాయమైన పరికరాంకురాలంకారమును అగుట గమనింపదగును.

1. చెల్లునట్లుగ లేక తగినట్లుగ.

ఉదా :- ఆ చతుర్భుజుఁడే చతుర్విధ పురుషార్థములకు ప్రదాత (పురుషార్థముల నిచ్చువాడు).

చతుర్భుజములు గల హరియే చతుర్భుజములతో చతుర్విధ పరుషార్థములను తగ నీయగలవాఁడు అని తాత్పర్యము.

ఇట "చతుర్భుజుఁడ"ను నది విశేష్యము. ఇట నీ పదము నాలుగు భుజములు గలవాడు గనుకనే నాలుగు పురుషార్థముల నిచ్చుటలో సమర్థుడు అను ప్రత్యేకమగు నభిప్రాయముతో కూర్పఁ బడినది. ఇట స+ఆశయంబు=ప్రత్యేకమగు ఆశయము (అభిప్రాయము) తో కూడిన "చతుర్భుజుఁడ"ను విశేష్యమును గూర్చుటచే నిది పరికరాంకురాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః,
చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః.

విశేష్యే=విశేష్యము; (స+అభిప్రాయే)+తు=ప్రత్యేకాభిప్రాయముకలదైనపుడు; పరికరాంకురః = పరికరాంకురాలంకారము; భవేత్=అగును. చతుర్ణామ్=నాలుగు అగు; పురుషార్థానామ్=మానవులయొక్క ప్రయోజనముల (ధర్మ-అర్థ-కామ-మోక్షముల) కు; దాతా = ఇచ్చువాడు; దేవః=దేవుఁడగు; చతుర్భుజః= (ఆ) చతుర్భుజుఁడే.

## 26. శ్లేషాలంకారము

తే॥ గీ॥ అలరు నానార్థ పదసంశ్రయాన శ్లేష
ప్రస్తుతాప్రస్తుతోభయాశ్రయతఁ ద్రివిధ
రాజు కువలయానందమున్ రక్తిఁ గూర్చ
సర్వదుఁడు మాధవుఁడు బ్రోచు జగములెల్ల. 57
లుబ్ధ భూరిశిలీముఖా లొత్తి కలఁచ
అమరె నీకనుల్ వనవృద్ధ కమలసమత
ఉచ్చరద్భూరి కీలాలయుక్తుడైన
వాహినీపతి శోభతోఁ బరఁగు చుండె. 58

అనేకార్థములు గల పదముల సంశ్రయంబె (యోజనంబె-కూర్పె) శ్లేషాలంకార మగును. నానార్థములు గల శబ్దములను ప్రయోగించిన యెడల శ్లేషాలంకార మేర్పడును. ఇది శబ్దాధారముగ నేర్పడుటచే శబ్ద పరివృత్తిని సహింపజాలదు. ఇది అర్థాధారము, శబ్దార్థోభయాధారమని ఆయా విద్వాంసులు కొందఱన్నను "నానార్థసంశ్రయశ్శ్లేషః" అని చెప్పి చంద్రాలోక కర్త "నానార్థ శబ్ద సంశ్రయంబు శ్లేష" యను నభిప్రాయమునే ప్రకటించినాడు. ఇది ప్రకృతశ్లేష, అప్రకృతశ్లేష, ఉభయ (ప్రకృతాప్రకృత) శ్లేష యని మూడు విధములుగ నున్నది.

(1) ఈ యలంకారమందు ప్రయుక్తమైన శ్లిష్టశబ్దములచే ప్రకటింపబడెడు రెండర్థములును ప్రస్తుతములే ఐన యెడల నది ప్రకృతశ్లేషాలంకార మనబడును.

ఉదా :- రాజు కువలయానందమును రక్తితోఁ గూర్పఁగా సర్వ
దుఁడు మాధవుడు జగములెల్లఁ బ్రోచు.

ఇట రాజ-కువలయ శబ్దములు, సర్వదుఁడు, మాధవుఁడు అను శబ్దములు శ్లిష్టములు. రాజన చంద్రుఁడు, భూపాలుడు అనియు, కువలయమన కలువ, భూవలయమనియు, సర్వదుఁడు+మాధవుడు, సర్వదుడు+ఉమాధవుడు అను రీతి పదవిభాగ విశేషమునాశ్రయించి మాధవశబ్దమునకు లక్ష్మీభర్త; ఉమాధవ శబ్దమునకు పార్వతీపతి యనియును నర్థములు చెప్పవచ్చును. కావున వరుసగా రాజు (చంద్రుఁడు) కలువలకు ఆనందమును గూర్చుననియు, భూపాలకుఁడు భూవలయమునకు ఆనందమును కలిగించుననియు, కోరినదెల్ల నిచ్చు లక్ష్మీపతియగు విష్ణువును, కోరినదెల్ల నిచ్చు పార్వతీపతియగు శివుడును లోకముల కాపాడుదురనియు ఆయా వాక్యార్థముల వలన దెలియును. కాఁగా హరిహరుల పరముగా నున్న నీ యర్థములు రెండును ప్రస్తుతములే. కావున నిది ప్రకృత శ్లేషాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

(2) ఒక యర్థము ప్రకృతము కాగా ఇతరార్థములు అప్రకృతములైనయెడల నది అప్రకృతశ్లేషాలంకార మగును.

ఉదా :- నీ కన్నులు లుబ్ధశిలీముఖాకులీకృతములగు వనవృద్ధములైన, కమలముల సామ్యముతో నొప్పెను.

ఇది ఒక నాయకుఁడు దయితతో అన్నమాట. ఇట లుబ్ధ-శిలీముఖ-వన-కమల శబ్దములు నానార్థ సంశ్రయములు. లుబ్ధ శబ్దమునకు-లోభశీలమైనవి, వ్యాధుఁడు అనియు; శిలీముఖశబ్దమునకు-తుమ్మెదలు, బాణములు అనియు; వనశబ్దమునకు-నీరు, అడవి అనియు; కమలశబ్దమునకు-పద్మములు, హరిణము అనియు అర్థములు ఉన్నవి. కావున దయిత చూపులు నీటఁ బెరిఁగి లోభశీలములైన తుమ్మెదలు మూఁగిన పద్మములయొక్క సామ్యముతో నొప్పెను. మఱియు దయితచూపులు వ్యాధుల (బోయవాండ్ర)చే ప్రయోగింపబడిన బాణములచే కలఁగిన అడవిలో బెరిఁగిన హరిణముల (లేళ్ల) యొక్క సామ్యముతో ఒప్పెను. ఇట్లు ఈ యుదాహరణమందు, ఉపమేయమగు దయితచూపుల వర్ణనము ప్రకృతము కాఁగా దానికి ఉపమానములగు 1) పద్మములు 2) హరిణములు అప్రకృతములగుచున్నవి. ఇట శ్లేషచే నప్రకృతార్థముల వర్ణనము జరుగుటచే నిది అప్రకృతశ్లేషాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

(3) నానార్థ శబ్దప్రయోగముచే ప్రస్తుతార్థము, అప్రస్తుతార్థము కూడ గ్రహింపదగినదిగానే యున్నయెడల నది ప్రకృతాప్రకృతశ్లేషాలంకార మగును.

ఉదా :- ఉచ్చరద్భూరి కీలాలయుక్తుడైన వాహినీపతి శోభతో నొప్పుచుండె.

ఇట వాహినీపతి (సేనానాయకుఁడు) ఉచ్చరద్భూరి కీలాల

యుక్తుడు (బయటికి వచ్చుచున్న అధికరక్తముతో కూడినవాఁడు) ఐ శోభించెను. ఇట ఈ సేనాపతి వర్ణనము ప్రస్తుత విషయము. కాఁగా వాహినీపతి (నదులకు భర్తయైన సముద్రుఁడు) ఉచ్చరద్భూరి కీలాలయుక్తుఁడు (పైకెగయుచున్న అధికజలముతో కూడిన వాఁడు) ఐ శోభించెను అను అప్రస్తుతార్థము కూడ చూపట్టుచున్నది. కావున నిది ప్రకృతాకృత శ్లేషాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ నానార్థ సంశ్రయః శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః,
సర్వదో మాధవః పాయాత్స యోఽగం గా మదీధరత్
అబ్జేన త్వన్ముఖం తుల్యం హరిణా హితసక్తినా,
ఉచ్చరద్భూరి కీలాలః శుశుభే వాహినీపతిః.

నానా+అర్థ+సంశ్రయః=అనేకము లగు, అర్థములుగల (అర్థములనిచ్చు) శబ్దముల యోజనమే (కూర్పే) ;శ్లేషః=శ్లేషాలంకారమగును. (అశ్లేషాలంకారము) వర్ణ్య + అవర్ణ్య ఉభయ + ఆశ్రితః=ప్రకృతములగు అనేక విషయములు గలది, అప్రకృతములగు అనేక విషయములు గలది, ప్రకృత-అప్రకృతరూపమైన అనేక విషయములు గలది అని త్రివిధమై యుండును.

ఉదా :- (1) యః=ఎవఁడు; అగమ్ = గోవర్ధన పర్వతమును, గామ్=భూమిని (వరాహావతారమందు); అదీధరత్=ధరించెనో; సః= అట్టి; సర్వదః=(భక్తులు కోరినవానిని) అన్నింటిని ఇచ్చునట్టి; మాధవః=విష్ణువు; పాయాత్=రక్షించును గాక.

రెండవ అర్థము :- యః=ఎవఁడు; గంగామ్=గంగానదిని; అదీధరత్ =(శిరముపై) ధరించెనో; సః=ఆ; ఉమాధవః=ఉమకు (పార్వతికి) భర్తయైన శివుడు; సర్వదా=ఎల్లప్పుడు; పాయాత్= కాపాడును గాక.

ఉదా :- (2) హరిణా =మృగము (లేడి)తో; అహిత+సక్తినా =

(కలంక రూపముతో) చేయబడిన, సంగముగల; అబ్జేన=చంద్రుని తో; త్వత్=నీయొక్క: ముఖమ్=మోము; తుల్యమ్ = సమానమైనది.

రెండవ అర్థము :- హరిణా=సూర్యునితో; హిత+సక్తినా= వికాసరూపమున మేలుగూర్చెడు, సంగముగల: అబ్జేన=పద్మముతో: త్వత్+ముఖమ్=నీయొక్క, ముఖము: (తుల్యమ్=సమానమైనది).

ఉదా :- (3) ఉత్+చరత్+భూరి+కీలాలః=పైకి, స్రవించుచున్న, అధికమైన, రక్తముగల: వాహినీ+పతిః=సేనయొక్క నాయకుఁడు: శుశుభే=శోభగాంచెను.

రెండవ అర్థము :- ఉత్+చరత్+భూరి+కీలాలః = పైకి, ఎగయుచున్న (లేచుచున్న), అధికమైన జలముగల; వాహినీ+పతిః=నదులకు పతియగు సముద్రుఁడు: శుశుభే=శోభించెను.

## 27. అప్రస్తుతప్రశంసాలంకారము

తే॥ గీ॥ విషయి ప్రస్తుతాశ్రయ మయి వెలయు నేని
సాగు నప్రస్తుతప్రశం సాఖ్య కృతుల
పక్షు లందెల్ల నిపుణమై పరఁగు నొకటి
పరుని యాచింప దెయ్యది వజ్రిఁ దక్క. 59

ప్రస్తుతవృత్తాంత బోధయందు పర్యవసించునట్టి అప్రస్తుత వృత్తాంత వర్ణనము అప్రస్తుతప్రశంసాలంకార మగును. అప్రస్తుత వృత్తాంతముచె ప్రస్తుతవృత్తాంతబోధ ప్రస్తుతాప్రస్తుతములకు సారూప్యరూపమో, సామాన్యవిశేషభావరూపమో, కార్యకారణభావ రూపమో అయిన సంబంధ మున్నపుడే కలుగును. సామాన్యము వలన విశేషావగతి, విశేషమువలన సామాన్యావగతి కలుగుట అని సామాన్యవిశేషభావరూప సంబంధమందు ద్వైవిధ్య మేర్పడును. కార్యకారణభావరూప సంబంధమందు కార్యమువలన కారణావగతి,

కారణమువలన కార్యావగతి అని రెండు విధములు. సారూప్యమం
డొక్క విధము. ఇట్లిది పంచప్రకారములుగా నుండును.•

అందు సారూప్య నిబంధన యగు అప్రస్తుత ప్రశంసాలంకా
రమునకు ఉదాహరణము.

ఉదా :- ఇంద్రుని తప్ప తదితరుని యాచింపని యా చాతకపక్షి
యొకటే నిపుణమైనది.

చాతకపక్షి వర్షమున కెదురుచూచును. వర్షము నిచ్చువాఁడు ఇంద్రుఁడు అగుటచే అది ఇంద్రుని మాత్రమే యాచించును. తదితరుని యాచింపదు. ఇది ఇట అప్రస్తుతము. క్షుద్రజనులను యాచింపని ఒకానొక పురుషుని ప్రశంస ప్రస్తుతవిషయము. అప్రస్తుతవృత్తాంతమును ప్రశంసించుటకు మారుగా సారూప్యమును బట్టి అప్రస్తుతమగు చాతకమును ప్రశంసించుట జరిగినది. కాఁగా ఈ యప్రస్తుత ప్రశంస ప్రస్తుతమగు "క్షుద్రులను యాచింపని ఒకానొక" సుకృతి ప్రశంసయందు పర్యవసించినది. కావున నిది సారూప్య నిబంధనయగు అప్రస్తుత ప్రశంసాలంకారమునకు లక్ష్యమగుచున్నది. ఇది సమాసోక్తికి పూర్తిగా వ్యతిరేకము. అయితే రెంటియందును ప్రస్తుతాప్రస్తుతముల సంగ్రహముండును. సమాసోక్తిలో ప్రస్తుతము యొక్కయు, అప్రస్తుత ప్రశంసలో అప్రస్తుతము యొక్కయు ప్రశంస యుండును.

సం॥ అప్రస్తుత ప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా,
ఏకః కృతీ శకుంతేషు యోఽన్యం శక్రాన్న యాచతే.

యత్ర=ఎచట; అప్రస్తుత ప్రశంసా=అప్రస్తుతము యొక్క

• కార్యే, నిమిత్తే, సామాన్యే, విశేషే, ప్రస్తుతే సతి,
।(తత్సదృశస్య) తదన్యస్య వచస్తుల్యే ।తుల్యస్యేతి చ ప ఞ్చధా.
కార్యే ప్రస్తుతేసతి తదన్యస్య కారణస్య వచః ప్రతిపాదనమ్.

ప్రశంస: ప్రస్తుత+ఆశ్రయా = ప్రస్తుతమే ప్రధాన తాత్పర్యవిష యముగా గలది; స్యాత్=అగునో; (అచట) సా=ఆ యప్రస్తుత ప్రశంస యను నలంకారము; స్యాత్=అగును. యః= ఏ చాతక పక్షి; శక్రాత్=ఇంద్రునికంటె; అన్యమ్=ఇతరుని; న+యాచతే= యాచింపదో; (సః=ఆ చాతకము): ఏకః=ఒక్కటే; శకున్తేషు= పక్షులయందు; కృతీ=నిపుణమైనది.

## 28. ప్రస్తుతాంకురాలంకారము

తే॥ గీ॥ ప్రస్తుతముచేత వేఱొక ప్రస్తుతంబె
[1]వ్యక్తమేఁ ప్రస్తుతాంకురం బలరు కృతుల
మధుప! మాలతి యది యెంతొ మరులు గొల్ప
కంటకావృతకేతకీ కాంక్ష లేల ? 60

ప్రస్తుతాంతరము (మఱియొక ప్రస్తుతము) ను వ్యక్తము చేయునట్టి ప్రస్తుతవర్ణనమే ప్రస్తుతాంకురాలంకార మనబడును. అనగా ప్రస్తుతమును వర్ణింప దానిచే నభీష్టమగు వేఱొక ప్రస్తుత విషయము అభివ్యక్తమైన ప్రస్తుతాంకురాలంకారమగునని భావము.

ఉదా :- ఓ భ్రమరమా! మరులు గొలుపు మాలతీలత యుండగా కంటకావృత (ముండ్లతోఁగూడినది) అగు కేతకి (మొగలి) చేఁ బ్రయోజనమేమి ?

ఇట ప్రియునితోఁగూడి ఉద్యానవనమందు విహరించు ఒకా నొక కులకాంత తుమ్మెద నుద్దేశించి చెప్పిన ఉదాహరణరూప వాక్యా ర్థము ప్రస్తుతము. మధువనిందాత్మకమైన ప్రస్తుతమగు వాక్యార్థ ముచే సత్యవిషయమునుచెప్పక సౌందర్యాభిమానవతియగుకులకాంత కంటకావృత కేతకీసమము-అనఁగా క్రూరజనపరివృతిచే సులభము కానిది లేక విటధనాహరణ సంకల్పముచే చేరరానిది- అగు అన్య

1. తెలియబడిన యెడల.

వసితను కాంక్షించు ప్రియతముని ఉపాలంభించుట అను ముఖ్య మగు ప్రస్తుతవిషయము అభివ్యక్తమగుచున్నది. కాన నిది ప్రస్తుతాంకురాలంకారమునకు లక్ష్యమగుచున్నది.*

సం॥ ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాఙ్కురః,
కిం భృఙ్గ! సత్యాం మాలత్యాం కేతక్యా కణ్టకేద్ధయా.

ప్రస్తుతేన = ప్రస్తుతమగు వర్ణనీయవిషయముచేత; ప్రస్తుతస్య=ఇష్టమగు మఱియొక్క ప్రస్తుతాంశము యొక్క; ద్యోతనే (సతి)=ప్రకాశము జరుగగా; ప్రస్తుత + అఙ్కురః= ప్రస్తుతాంకురమను అలంకారము (అగును). హే భృఙ్గ = ఓ మధుపమా! మాలత్యాం+సత్యామ్=మాలతీలత యుండగా; కణ్టక+ఇద్ధయా= ముండ్లతో నిండిన; కేతక్యా=మొగలిచేత; కిమ్=(ప్రయోజనము) ఏమున్నది ?

---

* అప్రస్తుత ప్రశంసలో వాచ్యార్థము అప్రస్తుతమగుట వలన అవర్ణనీయ మనియు, వాచ్యార్థమునందు అభిధాశక్తి పర్యవసితము కానందున వాచ్యార్థముచే ప్రస్తుతార్థము వ్యక్తమగుచుండును. కావున నది అప్రస్తుతప్రశంస) అలంకార మగును. ఈ ప్రస్తుతాంకురమందు వాచ్యార్థము ప్రస్తుత మగుటచే వాచ్యార్థమందే అభిధా శక్తి పర్యవసితము కాఁగా అర్థసౌందర్య బలముచే నిష్టార్థవ్యక్తి ధ్వనియే అని లోచనకారుఁడు (ధ్వన్యాలోక వ్యాఖ్యాత) అన్నను వాస్తవముగ వాచ్యార్థము ప్రస్తుతమే అయినను ముఖ్యమైనదను తాత్పర్యము లేనందుచే ఈ ప్రస్తుతాంకురాలంకారోదాహరణ మందును ధ్వనిలేదు. ఇదియును అలంకారమే అని అప్పయ్య దీక్షితులు తన చిత్రమీమాంస యందు వ్యవస్థీకరించినాఁడు. (శాస్త్ర నిరూపిత నియమము చేసినాడు).

## 28. పర్యాయోక్తాలంకారము

తే॥ గీ॥ గమ్య మర్థమున్ దెలుప భంగ్యంతరమున
నలరు చుండు పర్యాయోక్త మార్యకృతుల
రాహుపత్నీ కుచముల వ్యర్థ మొనరించె
నెవఁడు? వందనముల వాని కిడుదు సతము. 61

గమ్యమగు నర్థమును భంగ్యంతరమున (వివక్షిత రూపమున గాక అంతకంటె మనోహరమగు మఱియొక రూపమున) దెలుపుటను పర్యాయోక్తాలంకార మందురు. "పర్యాయేణ (భంగ్యంతరేణ) ఉక్తం అభిహితం వ్యంగం యత్ర ఇతి" (వ్యంగ్యము ఎచట భంగ్యంతరముచే (పర్యాయముచే) చెప్పఁబడునో అట) అను వ్యుత్పత్తిచే, నిది సార్థకనామము గలది అగుచున్నది. ఇది రెండు విధములు.

ప్రథమమునకు :-

ఉదా :- రాహుభార్యాస్తనములను వ్యర్థము చేసిన వానికి నేను వందనము లర్పింతును.

ఇట చెప్పఁబడినది వాచ్యార్థము. ఇట రాహువధూ కుచములు వ్యర్థమొనరించుట అనునది చెప్పదలచిన విషయము కాదు. ఐనను అట్లే చెప్పఁబడినది. భర్తృభోగ్యములగు రాహువధూ కుచములు వ్యర్థమగుటకు కారణమేమని పరిశీలింపగా విష్ణువుచే శిరోమాత్రావశిష్టుఁడుగా చేయబడిన రాహువునకు నాలింగనాదుల కుపకరించు హస్తాదులు లేవనియు, ఆ స్థితిలో నవి వ్యర్థము లనియు అట్టి స్థితికి కారకుఁడు విష్ణువు అనియు తెలియఁగలదు. అట్టి విష్ణువునకు వందన సమర్పణ మిట చెప్పదలంచిన విషయము. కాఁగా దానినట్లు చెప్పక పర్యాయముగా చెప్పుటచే నిది పర్యాయోక్తాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ పర్యాయోక్తంతు గమ్యస్య వచో భఙ్గ్యన్తరాశ్రయమ్,
నమస్తస్మై కృతౌ యేన ముధా రాహువధూకుచౌ.

గమ్యస్య = వివక్షితార్థముయొక్క: వచః=వచనము అనగా చెప్పుట; (భఙ్గీ+అంతర)+ఆశ్రయమ్=మంజీయొక పద్ధతిని ఆశ్రయించినది; (ఐనచో అది) పర్యాయోక్తాలంకారము (అగును). యేన=ఎవనిచే; రాహు+వధూ+కుచౌ=రాహువు (యొక్క), భార్య యొక్క, రెండు స్తనములును; ముధా+కృతౌ = వ్యర్థమైనవిగా, చేయబడినవో; తస్మై=వానికి అనఁగా ఇట విష్ణువునకు; నమః= నమస్కారము.

రెండవ విధము :-

తే॥ గీ॥ నెపము చేతను నిష్టంబు [1]నెరపెనేని
తనరు నదియుఁ బర్యాయోక్త మనఁగఁ గృతుల
అలరు చుండుఁడు మీ రిట, "అరసి వత్తు
చూతలత" నంచు సఖియుఁ దాఁ జూడ నేగె. 62

మనోహరమగు వొకానొక నెపముతో ఇష్టమును నెఱవేర్చుటయు వేఱొక పర్యాయోక్తాలంకారము అగును.

ఉదా :- "మీరిట సంతోషింపుఁడు. నేనింతలో మామిడిమొక్కను పరిశీలించి వత్తును" అని సఖి దానిని చూడఁబోయెను.

ఇట నాయికను నాయకునివద్దకు చేర్చి చూతలతా దర్శనమను నెపముతో చెలికత్తె అటనుండి తొలఁగిపోయి వారికి స్వేచ్ఛను కలిగించుచు వారి యభీష్టము సిద్ధించుటకు తోడ్పడినది. కావున నిదియు ఉక్త లక్షణమును బట్టి వేఱొక పర్యాయోక్తాలంకారమునకు లక్ష్యమగును.

సం॥ పర్యాయోక్తం తదాప్యాహుర్యద్వ్యాజే నేష్టసాధనమ్,
యామి చూతలతాం ద్రష్టుం యువాభ్యాం స్థీయతామిహ.

1. నెఱవేర్చిన యెడల.

వ్యాజేన=నెపముచే; యత్=ఏ; ఇష్ట+సాధనమ్=ఇష్టమును సాధించుట: (అగునో) తత్+అపి=అది, కూడ; (పర్యాయ+ఉక్తమ్)+ఇతి=పర్యాయోక్తాలంకారము,అని; ఆహుః=(విద్వాంసులు) చెప్పుదురు. యువాభ్యామ్+ఇహ+అస్యతామ్=మీర లిద్దరు. ఇచట నుండుడు. (అహం=నేను) చూతలతామ్ = మామిడిమొక్కను; ద్రష్టుమ్=చూచుటకు; యామి=వెళ్లుచున్నాను.

## 30. వ్యాజస్తుత్యలంకారము

తే॥ గీ॥ నిందచే స్తుతి, స్తుతిచేత నిందఁ దెలుప
కృతుల వ్యాజస్తుతి యనంగ నెసఁగుచుండు
నీ వివేక మే మయ్యెనో నింగి గంగ
చెడ్డ పాపాత్ములను గూడఁ జేర్తు దివికి. 63

నిందచే స్తుతియు, స్తుతిచే నిందయు స్ఫురించునట్లు చెప్పిన యెడల వ్యాజస్తుత్యలంకార మగును.

ఉదా :- ఓ గంగా! మహాపాపాత్ములనుకూడ దివికి చేర్చుచున్నావు. నీ వివేక మంతయు నేమైనది.

ఇట "గొప్ప పాపులనుకూడ దివికి చేర్చుచున్న నీవెంత అవివేకివి" అను రీతి చేసిన నిందచేత పావనమైన గంగ మహాపాపులనుగూడ పవిత్రులనుచేసి దివికి పంపగలదను స్తుతి గోచరించుచున్నది. కావున నిది వ్యాజస్తుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

తే॥ గీ॥ మంచి దో దూతిక! మఱియు మంచి దింక
నింతకంటెను కర్తవ్య మేమి గలదు?
నా కొఱకె గదా నీ విట్లు నఖరములతొ
దంతములతోడ క్షతగాత్ర వైతి వెంతొ. 64

ఇది ప్రియునివద్దకు దూతిని పంపిన నాయిక తిరిగి వచ్చిన దూతిక వాలకమును జూచి దూతికతో నన్నమాట.

ఉదా :- ఓ దూతి! మంచిది. చాలమంచిది. ఇంక నింతకంటె కర్తవ్యమేమి యుండును? పాపము నాకొఱకె గదా నీవిట్లు నఖక్షతములను, దన్తక్షతములను అనుభవించితివి.

ఇట నాయిక దూతికతో ఓ దూతిక! నాకొఱకే గదా నీవిట్లు నానాపాట్లు, అవస్థలు పడినావు. ఇంతకంటె నీ కర్తవ్యము మాత్ర మేమున్నది?" అను రీతిగ నున్న దూతస్తుతిచేత ప్రియుని తీసికొనిరా నఖిచే పంపబడిన దూతిక నఖి భర్తచే నఖక్షత-దన్తక్షతముల బడసిన దనుటచే "చేయరాని ఎంతటి అనుచితకార్యము చేసితివే" అను నింద స్ఫురించుచున్నది. ఇట స్తుతిచేత నింద గోచరించున్నందు వలన ఉక్తలక్షణమును బట్టి ఇది వ్యాజస్తుత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఉక్తి ర్వ్యాజస్తుతిర్నిన్దాస్తుతిభ్యాం స్తుతినిన్దయోః,
కః స్వర్ధుని! వివేకస్తే పాపినో నయసే దివమ్.

సం॥ సాధు. దూతి! పునః సాధు. కర్తవ్యం కి మతః పరమ్,
యన్మదర్థే విలూనాసి దన్తైరపి నఖైరపి.

నిందాస్తుతిభ్యామ్=నిందచేతను, స్తుతిచేతను; స్తుతినిన్దయోః=స్తుతియొక్కయు, నిందయొక్కయు; ఉక్తిః=వ్యక్తము చేయుటయే; వ్యాజస్తుతిః=వ్యాజస్తుత్యలంకారము(అగును). హేస్వర్ధుని!=ఓ దివ్యగంగా!, తే=నీయొక్క; వివేకః+కః? వివేకము, ఏది (ఏమైపోయినది): (ఎందువలన ననఁగా) (త్వమ్=నీవు) పాపినః=పాపాత్ములను; దివం+నయసే=దివికి, చేర్చుచున్నావు.

హే దూతి!=ఓ దూతికా; సాధు+పునః+సాధు=మంచిదే, మఱియు మంచిది; మత్+అర్థే=నా కొఱకు; దన్తైః+అపి=దన్తములచేతను;

నష్టైః+అపి=నోళ్లచేతను, కూడ; విలూనా+అసి=ఉక్కబడినావు. (క్లేశమును బడసినావు). అతః+పరమ్=ఇంతకంటె, శ్రేష్ఠమైన; కర్తవ్యమ్=చేయదగిన కార్యము. కిమ్=ఏమి? (ఉన్నది).

ఇవి ఒక వ్యక్తిని గూర్చియున్న నిందాస్తుతులకు ఉదాహరణములు. ఇవి గాక భిన్నవ్యక్తులకు చెందిన విషయమందును స్తుతినిందలచే నిందాస్తుతులు వ్యక్తమైన యెడల అచటను వ్యాజస్తుత్యలంకారమగుండును. ఇట్లే అన్యగతస్తుతి వివక్షచే అన్యస్తుతి చేయబడినను వ్యాజస్తుత్యలంకారమే అగును. ఇట్లివి ఐదు విధములుగా నుండును.

## 31. వ్యాజనిందాలంకారము

తే॥ గీ॥ నిందచేతను వ్యక్తమౌ నింద యెచట
వ్యాజ నింద నాఁ గృతి నట ఖ్యాతిఁ గాంచు
బ్రహ్మ! నిన్ననన్, నింద్యుఁడా పరమశివుఁడె
పూర్వ మెవ్వఁడు నీశిరం బొకటె ద్రుంచె. 65

నిందచే నిందయే వ్యక్తమైన యెడల వ్యాజనిందాలంకారమగును. ఇది అన్యగతస్తుతిచేత అన్యస్తుతి వ్యక్తమైనను వ్యాజస్తుతియను ఐదవవాజ్యస్తుత్యలంకారమునకు ప్రతిద్వంద్విగానున్నది.

ఉదా :– ఓ బ్రహ్మదేవా! నీవే నింద్యుఁడవని అనను. కాని పూర్వము నీ శిరము నొకదానినే ద్రుంచిన ఆ పరమశివుఁడే నింద్యుఁడు.

బ్రహ్మవిషయమున క్రుద్ధుఁడైన శివుఁడు బ్రహ్మకుగల పంచశిరములలో నొకదానిని ద్రుంచినాడు. పూర్వము పంచముఖుఁడైన బ్రహ్మ ఆనాటినుండి చతుర్ముఖుఁ డాయెను. ప్రస్తుత విషయము :– ఓ బ్రహ్మ! నీ శిరములన్నింటిని ద్రుంచవలసి యుండగా ఒక్క శిరమునే ద్రుంచి నీ యీ నికృష్ట సృష్టికవకాశమును మిగిల్చిన ఆ శివుఁడే నింద్యుఁడను శివనిందచే బ్రహ్మదేవుని నిం

దయే వ్యక్తమగుచున్నది. కావున నిది వ్యాజనిందాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ నిన్దాయా నిన్దయా వ్యక్తిర్వ్యాజనిన్దేతి గీయతే,
విధే! స నిన్ద్యో యస్తే ప్రాగేకమేవాహరచ్ఛిరః.

నిన్దయా=నిందచేత; నిన్దాయా = ఇతరుని నిందయొక్క; వ్యక్తిః=అభివ్యక్తి (ప్రకటించుట); వ్యాజనిన్దా + ఇతి=వ్యాజనిందాలంకారము అని; గీయతే=(విద్వాంసులచే)కొనియాడబడుచున్నది. హే విధే!=ఓ బ్రహ్మదేవా!; యః=ఏ శివుడు; ప్రాక్=పూర్వము; తే=నీయొక్క; ఏకం+శిరః+ఏవ = ఒక్క శిరసును మాత్రమే; ఆహరత్=తొలగించెనో; సః=ఆ శివుడే; నిన్ద్యః=నింద్యుడు.

## 32. ఆక్షేపాలంకారము

తే॥ గీ॥ స్వోక్తిఁ బరికించి ప్రతిషేధ ముక్తమైన
కృతుల నదియె యాక్షేపమై యతిశయించు
చక్క దర్శనం బిమ్ము చంద్ర! లేక
వలదులే, ప్రియా వదనంబు కలదు నాకు. ౬౬

తాను చెప్పిన మాటనే పరిశీలించిన పిమ్మట ప్రతిషేధించిన యెడల నది ఆక్షేపాలంకార మగును. ఇట ఆక్షేప శబ్దము ప్రతిషేధము లేక నిషేధమను నర్థము నిచ్చుచున్నది. దీనికి ఆక్షేపమే ప్రధానమగుటచే నిది సార్థకనామ మగుచున్నది. ఈ యాక్షేపాలంకారము 1) స్వోక్తి ప్రతిషేధరూపము 2) నిషేధాభాసరూపము 3) తిరోహితనిషేధరూపము అని మూఁడు విధములుగాను ఉండును.

ఉదా :- ఓ చంద్రుఁడా! నీవు చక్కఁగా దర్శన మిమ్ము. (ఆలోచించి) లేక వలదు. నాకు ప్రియావదనమున్నదిలే.

ఇచట ప్రార్థితమే యగు చంద్ర దర్శనము ప్రియాముఖ ముండుటచే నది వ్యర్థమని తలంచి “లేక, వలదులే” అను శబ్దము

లచే ప్రతిషేధము తెలుపబడినందున ఇది స్వోక్తి ప్రతిషేధరూపమగు నాక్షేపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఆక్షేపః స్వయ ముక్తస్య ప్రతిషేధో విచారణాత్,
చంద్రః సందర్శ యాత్మానమథవా స్తి ప్రియాముఖమ్.

స్వయమ్=స్వయముగా (తనచే); ఉక్తస్య = చెప్పబడిన మాటకు: విచారణాత్ = (తిరిగి) ఆలోచించుట వలన; ప్రతిషేధః = అడ్డగించుట లేక నిషేధించుట: ఆక్షేపః=ఆక్షేపాలంకారము (అగును) హే చంద్ర=ఓ చంద్రుడా: ఆత్మానమ్=తనను (అనగా ఇట నన్ను) సందర్శయ=చూపుకొనుము: అథవా=లేక: ప్రియా+ముఖమ్=ప్రియురాలి, ముఖము; అస్తి=కలదు.

ద్వితీయ భేదము :-

తే॥ గీ॥ ఆ నిషేధ మాభాసమై యలరెనేని
అన్యమాక్షేప మని కొంద ఱంద్రు బుధులు.
దూతికను గాను కాలాగ్ని తుల్యమైన
నీదు ప్రేయసి తను తాప మొందు సుమ్ము. 67

నిషేధాభాసమును కూడ ఆక్షేపాలంకారమని కొందఱు విద్వాంసులందురు.

ఉదా :- నేను దూతిని గాను. ప్రళయకాలాగ్ని తుల్యమైన నీ ప్రేయసీతను సంతాప మొందును.

ఇది నాయికయొక్క దూతిక నాయకుని సమీపించి స్వసఖి స్థితిని దెల్పుచు పలికిన వాక్యము. ఇట దూతికయే తాను దూతికను కానను నిషేధమే ఐనను వాస్తవమది కాదు. తాను దూతికాకార్య నిర్వహణార్థమే వచ్చినది. కావున ఈ నిషేధము బాధితమై ఆభాసమే అగుచు "సాధారణ దూతికల పలుకులవలె నామాటలు కల్పితములు కావు. సత్యములే", అను నర్థాంతర స్ఫూర్తిని కల్గించుచు ప్రస్తుత

విషయమునకు-నాయికా విరహసంతాపాంశమునకు-ఉత్కర్షాపాదక మగుచున్నది. ఇచ్చట నిషేధము ఆభాసరూపమగుటచే ద్వితీయా క్షేపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ నిషేధా భాస మాక్షేపం బుధాః కేచన మన్వతే,
నాహం దూతీ తనోస్తాప స్తస్యాః కాలానలోపమః.

కేచన+బుధాః=కొందఱు, విద్వాంసులు; నిషేధ+ఆభాసమ్= ఆభాసరూపముగనుండు నిషేధమునుకూడ; ఆక్షేపమ్=ఆక్షేపాలంకారముగ; మన్వతే=తలంచుచున్నారు. అహమ్=నేను; దూతీ+న= దూతికను, కాను; తస్యాః=ఆమె (అ ప్రియసఖి)యొక్క; తనోః+ తాపః=శరీరముయొక్క, తాపము; కాల+అనల+ఉపమః=ప్రళయ కాలమందలి, అగ్నితో, సమానమైనది.

తృతీయ భేదము :-

తే॥ గీ॥ వ్యక్తమై విధియు, మఱుఁగుపడి నిషేధ
ముున్న నన్య మాక్షేపమై యొప్పు చుండు
వెళ్లు మో నాథ! వెళ్లెడ వేని నీవు
అచటనే నాకు జన్మంబు నౌను గాక. 68

విధి వ్యక్తమగుచు నిషేధము మఱుఁగుపడియున్న నదియు మఱియొక ఆక్షేపాలంకార మగును.

ఉదా :- ఓ ప్రియతమా! వెళ్లవలసిన యెడల వెళ్లుము. నీవు వెళ్లెద వేని నేను నచటనే జన్మించెదను.

ఇది దూరదేశమున కేగ సిద్ధపడిన నాయకునితో నాయిక అనుచున్న మాట. నాయకుని దూరదేశగమనము నాయికకు ఇష్టము లేదు. వెళ్లకుండుటయే ఆమెకు ఇష్టము. కాని మాటలలో ఓ నాథ! వెళ్లుము. అని విధియే వ్యక్తమగుచున్నది. "వెళ్లవలదు" అను కాంతయొక్క అభిప్రాయము మఱుఁగునపడినది. ఎట్లన నీవు

వెళ్లెదవేని నేనచటనే జన్మించెద నను మాటలలో "మీరు వెళ్ళిన యెడల నేనిట నింక బ్రతుకను. మృతి నొంది, పిదప నేనట జన్మింతును. కావున నా ప్రాణములను నిలుప గోరినచో మీరు వెళ్ల రాద"ను నిషేధ మిచట గర్భీకృతమై మఱుఁగున పడియున్నది. విధి వ్యక్తమై నిషేధము గర్భీకృతమై తిరోహితమైనది. కావున పై లక్షణమును బట్టి ఇది తృతీయాక్షేపాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ ఆక్షేపోఽన్యో విధౌ వ్యక్తే నిషేధే చ తిరోహితే,
గచ్ఛ గచ్ఛసి చేత్కాంత తత్రైవ స్యాజ్జనిర్మమ.

విధౌ=విధి: వ్యక్తే (సతి)=వ్యక్తము (స్పష్టమైనది) కాఁగా; నిషేధే=నిషేధము; తిరోహితే+చ+(సతి)=మఱుఁగుపడి యున్నది కాఁగా: అన్యః=మఱియొకటి అగు: ఆక్షేపః=ఆక్షేపాలంకారము; (స్యాత్=అగును). హే కాన్త=ఓ నాథా!: గచ్ఛ=వెళ్లుము; గచ్ఛసి+చేత్ = వెళ్లిన యెడల: తత్ర+ఏవ = అచ్చటనే: మమ=నా యొక్క; జనిః=జన్మము; స్యాత్=అగును.

## 33. విరోధాభాసాలంకారము

తే॥ గీ॥ ఎట విరోధ మాభాసమై యెసఁగు చుండు
అలరు నట విరోధాభాస మనఁగ గృతుల
హార మేదియు లేకయే హారులయ్యు
తనరు నీ వగు పాలిండ్లు తరుణి! కనుము. 69

విరోధమునకు ఆభాసత్వ మెచట నుండునో అచట విరోధాభాసాలంకార మలరుచుండును. ఆభాసత్వ మనఁగా ఒక వాక్యమును వినిన వెంటనే అందు విరోధమున్నట్లు గోచరించి, పరిశీలన చేసిన పిమ్మట ఆ విరోధము లేనట్లు భాసించుటయే. అనఁగా అచట గోచరించిన విరోధము వాస్తవము కాదని తెలియుటయే.

ఉదా :- ఓ తరుణీ! నీ పాలిండ్లు హారము లేనివయ్యు హారులై (హారసహితములై) తనరుచున్నవి చూడుమా!

ఇట హారులు అన్న పదము హారము గలవి, హారముతో కూడినవి అను నర్థము కలదగుటచే అప్పుడు హారరహితములు-హారులు (హారసహితములు) అగుట ఎట్లు? అను విరోధము గోచరించును. పరిశీలింపగా హారులు అన్న పదమునకు మనోహరములు అను అర్థము కూడ కలదని గ్రహించి "హారము లేనివయ్యు పాలిండ్లు మనోహరములుగా నున్నవి" అను నర్థమును స్వీకరించినపుడు మొదటి విరోధము వాస్తవము కాదని తెలియగలదు. కావున ఇందు విరోధమునకు అభాసత్వముండుటచే నిది విరోధాభాసాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే,
వినాపి తన్వి! హారేణ వక్షోజౌ తవ హారిణౌ.

## 34. విభావనాలంకారము

తే॥ గీ॥ కారణము లేక కార్యంబు కలుగఁ జెప్ప
కృతి విభావనాలంకార మతిశయించు.
తనర లాక్షారసాప్రసక్తంబు గాక
తరుణి చరణద్వయం బది యరుణ మయ్యె. ౭౮

కారణముచే కార్యంబు కలుగునన్న లోకన్యాయమునకు విరుద్ధముగా కారణము లేకయే కార్యంబు కలిగినట్లు చెప్పిన యెడల నది విభావనాలంకార మగును.

ఉదా :- రమణి చరణద్వయము లాక్షారసాప్రసక్తము కాకున్నను ఎంతో అరుణ మగును.

స్త్రీలు పాదములకు లాక్షారసము పూసికొనెడివారు. ఆ లాక్షారసలేపనముచే కాళ్లు ఎఱ్ఱగా కన్పించును. అట ఎఱ్ఱదనమునకు

కారణము లక్షారసము. కాని ఇట ఎఱ్ఱదనమునకు కారణముగు లాక్షా రసలేపనము లేకయే రమణి పాదద్వయము అరుణముగా నున్న దనుటచే కారణము లేకుండ కార్యము జరిగినట్లు చెప్పబడినది. కాన నిది ఉక్తలక్షణమును బట్టి విభావనాలంకారమునకు లక్ష్యముగు చున్నది.

సం॥ విభావనా వినాపి స్యాత్కారణం కార్యజన్మ చేత్,
అప్యలాక్షారసాసిక్తం రక్తం తచ్చరణద్వయమ్.

కారణం+వినా+అపి=కారణము, లేకపోయినను; కార్య+జన్మ=కార్యముయొక్క, ఉత్పత్తి: చేత్ = (జరిగినట్లు చెప్పిన) యెడల (అది); విభావనా=విభావనాలంకారము (అగును). తత్+చరణ+ద్వయమ్=ఆమెయొక్క, పాదముల, జంట; అ+లాక్షారస+ఆ+సిక్తమ్+అపి=లాక్షారసముచే, అంతట, పూయబడినది, కానిది ఐనను. రక్తమ్=ఎఱ్ఱనిది (అగును).

ఆ. వె. కరణ బలమె లేక కార్యంబు సిద్ధింప
కృతి విభావన యన నెసఁగు నొండు
బిగువు, కఱకు లేని విరియుంబు లేసి యే
శంబరారి లోకజయము వడసె. 71

కార్యసిద్ధికి తగిన కరణ (కారణ) బలము లేకయే కార్యసిద్ధి కల్గినట్లు వర్ణించిన యెడల వేఱొక విభావనాలంకార మగును.

ఉదా :- పుష్పబాణములు ప్రయోగించి మన్మథుఁడొక్కడే సర్వ లోకజయమును పొందెను.

సకలలోక విజయమునకు సుదృఢ సునిశిత శరసంపద కారణము కాఁగా ఇట సర్వలోక విజయమునకు కారణములు పూర్ణముగ లేకుండ మన్మథుఁడొక్కడే కోమలకుసుమ శరముల ప్రయోగించి

లోకవిజయరూపమగు కార్యమును పొందినట్లు వర్ణింపబడినది. కాన నిది ఉక్తవిభావనాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తిశ్చ సా మతా,
అస్త్రై రతీక్ష్ణ కఠినై ర్జగజ్జయతి మన్మథః.

హేతూనాం = కారణములయొక్క; అసమగ్రత్వే (సతి) = సమగ్రత (పరిపూర్ణత) లేకపోయినప్పటికిని; కార్య+ఉత్పత్తిః+ చ = కార్యము, సిద్ధించుటయు; సా = ఆ విభావన; (అని) మతా = (బుధులచే) అంగీకరింపబడినది. మన్మథః = మన్మథుడు; అతీక్ష్ణ కఠినైః = నిశితములు, కఠినములు కానట్టి; అస్త్రైః = శరములతో, జగత్ = లోకమును; జయతి = జయించుచున్నాడు.

తే॥ గీ॥ కలుగ ప్రతిబంధకంబది కార్యమొదవ
కృతి తృతీయ విభావన యొనగుచుండు
అధిప! త్వత్కరాసి భుజగ మవనియుండు
పరనరేంద్రుల నెల్లర నరసి [1]కఱచు.

ప్రతిబంధక మున్నను కార్యసిద్ధి కలిగినట్లు చెప్పిన యెడల నది తృతీయమగు విభావన యగును.

ఉదా :- ఓ యధిప! నీ చేతిలోని అసిభుజగము పరనరేంద్రుల నెల్లరను అరసి (యెఱిఁగి) కఱచును.

ఇట పరనరేంద్రులన శ్రేష్ఠులు అగు పాములవాండ్రు అని అర్థము. వారికి మంత్రౌషధాది సిద్ధియుండుటచే పాములు వారి దరికి చేరజాలవు. కాఁగా నసిభుజగము కఱచుటకు ప్రతిబంధక మున్నను ఆ పరనరేంద్రులను కఱచెనని చెప్పుటచే లక్షణము ప్రకారమిది తృతీయ విభావనాలంకార మగును. అయితే ఈ వైరుధ్యము శబ్దశ్లేషచే తొలఁగింపబడినది. ఎట్లన పరనరేంద్ర శబ్దమునకు శత్రు

1. కాటువేయు.

రాజులనియు నర్థమున్నది. కావున అధిప కరాసిభుజగము శ్రేష్ఠు లగు శత్రురాజులను కాటువేయుటలో వైరుధ్యముండజాలదు. ఈ యలంకారమందు శబ్దశ్లేష ప్రభావము ముఖ్యమైనది.

సం॥ కార్యోత్పత్తి స్తృతీయా స్యాత్ సత్యపి ప్రతిబంధకే,
నరేంద్రానేవ తే రాజన్! దశత్యసిభుజంగమః.

ప్రతిబంధకే+(సతి+అపి)=ప్రతిబంధకము, ఉన్నప్పటికిని; కార్య+ఉత్పత్తిః=కార్యసిద్ధి: (జరిగిన యెడల); తృతీయా=మూఁడవదగు విభావన; స్యాత్=అగును. హే రాజన్=ఓ రాజా! తే=నీ యొక్క; అసి+భుజంగము=ఖడ్గ మనెడి పాము; నర+ఇంద్రాన్+ఏవ=నరేంద్రులనే (పాములవాండ్రనే); దశతి=కఱచుచున్నది.

ఆ. వె. కార్య జన్మ మది య కారణమునఁ గల్గ
పరఁగు చౌక మౌ విభావనంబు
వీణియ నినదంబు వెడలు శంఖము నుండి
వింతలందె గొప్ప వింత యగుచు. 73

కారణము కాని దానివలన కార్యోత్పత్తి జరిగినట్లు చెప్పిన యెడల అది నాల్గవ విభావనాలంకార మగును.

ఉదా :- వింతలలో గొప్పవింత యగుచు శంఖము నుండి వీణా నినాదము వెడలుచున్నది.

లోకమున ప్రతికార్యమునకు నొక నియతకారణ ముండును. అట్టి నియతకారణము కానిదాని వలన కార్యము కలుగజాలదు. కాని ఇట "శంఖము నుండి వీణానినాదము కలిగినది. ఇది గొప్ప వింత" అనుటలో వీణానినాదోత్పత్తికి శంఖము కారణముకాదు. ఐనను కాని కారణమగు శంఖము నుండి వీణాధ్వని ఉత్పన్నమైనట్లు చెప్ప బడినది. కావున నిది ఉక్తలక్షణమును బట్టి చతుర్థ విభావనకు లక్ష్య మగుచున్నది.

సం॥ అకారణాత్కార్యజన్మ చతుర్థీ స్యాద్విభావనా,
శఙ్ఖా ద్వీణానినాదోఽయ ముదేతి మహ దద్భుతమ్.

అకారణాత్=కారణము కానిదాని వలన; కార్య+జన్మ=కార్యోత్పత్తి; (అయిన యెడల) చతుర్థీ=నాల్గవదగు; విభావనా=విభావనాలంకారము; స్యాత్=అగును. శఙ్ఖాత్=శంఖమునుండి; అయమ్=ఈ; వీణా+నినాదః=వీణానాదము; ఉదేతి=పుట్టుచున్నది. మహత్+అద్భుతమ్=మిక్కిలి, ఆశ్చర్యకరము.

ఆ. వె. కార్య మది విరుద్ధ కారణమునఁ గల్గ
నగు విభావన అయిదవది కృతుల
అమృత కిరణు కరము లరవిందవదనకు
తాళఁజాల నట్టి తపనఁ గూర్చె. 74

కారణమునకు అనురూపమగు కార్యము జనించుట లోకసహజము. కాఁగా విరుద్ధమగు కారణముచే కార్యము కలిగినట్లు చెప్పిన యెడల నది ఐదవ విభావనాలంకార మగును.

ఉదా :- అమృతకిరణుని (చంద్రుని) కరములు పద్మవదనకు ఓర్వలేని తాపమును గూర్చెను.

ఇట శీతాంశుని (చల్లని కిరణములుగల చంద్రుని) కరములు కమలముఖికి తాపమును కల్గించెనని చెప్పబడినది. చల్లని వస్తువు చల్లఁదనమును, వెచ్చని వస్తువు వెచ్చఁదనమును కల్గించుట ప్రకృతి సహజము. అది లోకానుభవమున సత్యమైనది. కాని ఇట చల్లని చంద్రకిరణముల వలన అరవింద వదనకు తాపము కల్గుట లోక విరుద్ధము. అయినను అట్లే చెప్పబడుటచే నిది ఐదవ విభావనాలంకారమునకు లక్ష్యమగుచున్నది. అయితే విరహమనుభవించువారికి మలయానిల, చంద్రకిరణాదులు తాపజనకములని కవి సమయ సిద్ధమగుటచే నిట్లు చెప్పుట ఉచితమే.

సం॥ విరుద్ధాత్కార్య నిష్పత్తి ర్దృష్టా కాచిద్విభావనా,
శీతాంశుకిరణాస్తన్వీం హన్త! సన్తాపయన్తి తామ్.

విరుద్ధాత్=విరుద్ధమగు కారణము వలన; కార్య+నిష్పత్తిః= కార్యజన్మ (కలిగిన యెడల); కాచిత్+విభావనా=ఒకానొకవిధమగు విభావనాలంకారము; దృష్టా=దృష్టము (అగుచున్నది). తామ్ = ఆ: తన్వీమ్=వనితను; శీతాంశు+కిరణాః=చల్లని చంద్రుని కిరణములు; సన్తాపయన్తి=మిక్కిలి తపింపఁజేయుచున్నవి. హన్త!= అయ్యో!

ఆ. వె. కారణంబు కలుగఁ గార్యంబునుండియే
పరఁగు షష్ఠ మౌ విభావనంబు
కనఁగ నధిప! నీదు కరకల్ప తరువునన్
జనన మందె కీర్తి జలధి [1]యొండు. 75

కారణము నుండి కార్యము కలుగుట లోకానుభవ సిద్ధము. కాఁగా దానికి విరుద్ధముగ కార్యమునుండియే కారణము జనించినట్లు చెప్పుట వేఱొక విభావనాలంకార మగును.

ఉదా :- ఓ రాజా! నీ కరకల్పతరువు నుండి వేఱొక కీర్తిజలధి జనించినది.

పాలసముద్రమునుండి కల్పవృక్షము పుట్టెననుట పురాణప్రసిద్ధమని లోకమున తెలిసెడు విషయము. అట పాలసముద్రము కారణము. కల్పవృక్షము కార్యము. కాఁగా రాజకరకల్పతరువు నుండి కీర్తి జలధి జనించె ననుట ఉదాహరణమందలి విషయము. ఇట కరకల్పతరువు కారణము. కీర్తిజలధి కార్యము. కావున కారణమగు రాజకరకల్పతరువునుండి కార్యమగు కీర్తిజలధి జనించె ననుటలో మొదటి వాక్యమందలి (కార్యమగు) కల్పవృక్షమునుండి (కల్పవృక్షమునకు) కారణమగు జలధి పుట్టెనని చెప్పెడు రెండవ

1. ఒక

వాక్యము పై లక్షణమును బట్టి ఆఱవ విభావనాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

అయితే ఇట్టి వర్ణనలోని ఔచిత్యమునకు మూలము కరమనెడి కల్పవృక్షము, కీర్తియనెడి జలధి అని కర - కల్పవృక్షములకు, కీర్తి-జలధులకును అభేదారోపణము చేయుటయే. అపుడు కరము కారణము. కీర్తి కార్యము అగును. కరముతో దానముచేసి మహా దాతయని విస్తృతకీర్తిని పుట్టించెననుటలో ననౌచిత్యమేమియు నుండజాలదు.

## 35. విశేషోక్త్యలంకారము

తే॥ గీ॥ పుష్కలంబైన కారణం బొప్పఁ, గార్య
మొదవదేని కృతుల విశేషోక్తి తనరు
విస్తృతానంగదీపంబు వెలుఁగుచుండ
నతివ హృదయాన స్నేహక్షయంబె కాదు. 78

పూర్ణమును, సమర్థమును అగు కారణమొప్పుచున్నను కార్యో త్పత్తి కలుగలేదని చెప్పిన యెడల విశేషోక్త్యలంకార మగును. సమర్థకారణ సమృద్ధిచే కార్యము జనించుట లోకసామాన్యము. కారణసమృద్ధి యున్నను కార్యము జనింపకుండుట విశేషము. అట్టి విశేషముగల ఈ విశేషోక్త్యలంకారము సార్థకనామము కలది.

ఉదా :- విస్తృతమైన మన్మథ దీపము వెలుగుచున్నను అతివ హృదయమునందు స్నేహక్షయము కాలేదు.

లోకమందు దీపము వెలిఁగిన కొలఁది స్నేహము (చమురు) తగ్గిపోవుట సహజము. దీపము వెలుగుట-కారణము. చమురు తగ్గుట- కార్యము. ఈ యుదాహరణమున పుష్కల కారణమున్నది. కాని కార్యము స్నేహక్షయము జరుగుటలేదు. కావున ఉక్తలక్షణము ప్రకారము ఇది విశేషోక్తికి లక్ష్యమగుచున్నది.

కాని ఇచట వెలుఁగుచున్నది మన్మథదీపము. అది విస్తృతమై వెలుఁగుచున్నది అమె హృదయమందలి స్నేహము (అనురాగము) క్షయించుట లేదు. మదనుడు హృద్గతుడు కాగా అనురాగ మతిశయించునే గాని తగ్గదు. ఇట స్నేహశబ్దమునకు గల శ్లేషబలముచే వైరుధ్యము తొలగింపబడినది.

## 36. అసంభవాలంకారము

తే॥ గీ॥ అర్థ సిద్ధి అసంభావ్య మనుచుఁ జెప్ప
కృతి నసంభవాలంకార మెసఁగుచుండు
గోపబాలకుం డొక్కఁడె కొండ నెత్తఁ
గలఁ డటంచు నెవ్వఁడెఱుఁగు నిలననంగ. 77

కార్యనిష్పత్తికి అసంభావ్యతను చెప్పు నది అసంభవాలంకారమన నొప్పును. ఇట అసంభావ్యత అనఁగా కార్యసిద్ధి సంభావ్యము (ఊహింపఁదగినది) కాదను భావము.

ఉదా :- గోపబాలుఁ డొక్కఁడె కొండనెత్తగలఁడని ఇల నెవ్వఁడెఱుఁగును ?

ఇట గోపబాలుఁడు కొండ నెత్తగలఁడనుట ఎవ్వరును ఊహింపని విషయము. జనుల కట్టిది అసంభవమైన విషయము. అది ఇట సంభవమైనదని చెప్పబడుటచే నిది అసంభవాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ అసంభవోఽర్థనిష్పత్తే రసంభావ్యత్వవర్ణనమ్,
కో వేద గోపశిశుకః శైలముత్పాటయే దితి.

అర్థనిష్పత్తేః=కార్యసిద్ధికి: అసంభావ్యత్వవర్ణనమ్=ఊహింపదగినది కాదని వర్ణించుట; అసమ్భవః = అసంభావాలంకారము (అగును); గోపశిశుకః=చిన్నగోపబాలుఁడు; శైలమ్ = కొండను, ఉత్పాటయేత్=పెకలింపఁగలఁడు; ఇతి=అని; కః=ఎవఁడు: వేద= ఎఱుఁగును? ఎవనికిని సంభావ్యము కాని విషయమని భావము.

# 37. అసఙ్గత్యలంకారము

తే॥ గీ॥ ఒకటఁ గార్యంబు, కారణం బొండుచోట
నుండె నన నసంగతి కృతి నొప్పు చుండు
అంబుదంబు లవి విషపానంబు సేయు
పథిక జన తరుణులు మూర్ఛఁబడిరి సఖుఁడ. 78

కార్యకారణములకు అదృష్టముగ (ఎచటను కన్పించని దగు) భిన్న దేశవృత్తిత్వమును (వేర్వేరుచోట్ల నునికిని) చెప్పిన యెడల నసంగత్యలంకారము అగును. కార్యకారణములకు సంగతి లేనిదగుట చే దీనికీపేరు సార్థకము. ఇది మూఁడు విధములు. అందు ఇది ప్రథమము.

ఉదా :- అంబుదములు విషపానముచేయ పథికజనులస్త్రీలు మూర్ఛపడిరి.

లోకమందు కారణము ఒకచోటనుండ కార్యము వేరొకచోట జరుగుట కానము. విషము త్రాగినవారు తత్ప్రభావముచే మూర్ఛపడుట సహజము. కాఁగా ఇచట అంబుదములు విషము త్రాగగా పథికాంగనలు మూర్ఛపడిరని చెప్పబడినది. అనగా విషపానము ఆకాశమునందుండు మేఘములు చేయ, భువిపై నున్న పథికాంగనలు మూర్ఛపడిరని వర్ణింపబడినది. విషపానము కారణము. మూర్ఛపడుట కార్యము కావున ఇట కార్యకారణములకు అదృష్టముగ (కనబడనిదగు) భిన్నదేశవృత్తిత్వము వర్ణింపబడినందుచే నిది అసంగత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

విషశబ్దమునకు నీరు అనికూడ నర్థము గలదు. వేసవిలో సూర్యతాపమునకు సముద్రజలము ఆవిరి యగుట సహజము. ఆ యావిరి రూపమగు జలమును స్వీకరించి మేఘములు వేసవి అనంతరమే వచ్చు వర్షాకాలమున వర్షించుటయు సహజమే.

దూరదేశ పథికుల స్త్రీలు భర్తృవిరహమును ననుభవించునపుడు వర్షాగమనము వారికి మూర్ఛను కలిగించుట అనునది కవిసమయము. కావున నిట్టి వర్ణనము కవిలోకమున సంగతమై పైఁ దెల్పినట్లు అసంగత్యలంకార మగును.

సం॥ విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వో రసఙ్గతిః,
విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాఙ్గనాః.

కార్యహేత్వోః=కార్య-కారణములకు: విరుద్ధమ్=లోకానుభవమున విరుద్ధముగ నుండు (కనఁబడని దగు); భిన్నదేశత్వమ్ = వేర్వేఱుచోట్ల నుండుట (చెప్పఁబడినయెడల); అసఙ్గతిః=అసంగత్యలంకారము (అగును). జలధరైః=మేఘములచే: విషమ్=విషము (జలము); పీతమ్=త్రాఁగఁబడినది; పథిక+అఙ్గనాః=పాంథుల వనితలు; మూర్ఛితాః=మూర్ఛనందిరి.

ద్వితీయ-తృతీయ భేదములు.

తే॥ గీ॥ ఒకటఁ గరణీయకార్య మొండొకటఁజేయ
అదియు నన్య మసంగతి యౌను కృతుల
ఒక్క పనికిఁ బూన, విరుద్ధ మొండు కార్య
మైన నదియు న ంగతి యనఁగఁ దనరు. 79

తే॥ గీ॥ భువి నపారిజాతను జేయఁ బూని కృష్ణః
దివి యపారిజాత యనంగఁ దీర్చె తీవు
మునుపు కృష్ణః గోత్రోద్ధారమునకుఁ బూని
సలిపి తీవు గోత్రోద్భేద మలర జగతి. 80

ఒకచోట చేయఁదలచిన కార్యమును వేఱొకచోట చేసినట్లు చెప్పినను వేఱొక యసంగత్యలంకార మగును. అట్లే ఒక కార్యము చేయఁబూని, దానికి విరుద్ధమగు కార్యమును చేయుటయు వేఱొక యసంగత్యలంకార మగును.

ఉదా :- ౨) ఓ కృష్ణ! భువినిన్ అపారిజాతను చేయఁగోరి దివి నపారి
జాతను చేసితివి.

ఇది కృష్ణు నుద్దేశించి దేవేంద్రుఁడు చెప్పిన సోపాలంభ (ఎత్తిపొడుపు) వచనము. నీవు భువిని అపారిజాతను చేయఁగోరి దివిని అపారిజాతను చేసితివి అనుటచే, పై లక్షణమును బట్టి, ఒకచోట చేయఁగోరిన కార్యము వేఱొకచోట చేసినట్లు చెప్పుటను బట్టి ఇది ద్వితీయాసంగత్యలంకారమునకు లక్ష్యము. భూమిని అపారిజాతగ అనునపుడు భూమి పరముగా అప+అరి+జాతగ(అపగత+శత్రు+సమూహ=తొలఁగిపోయిన శత్రువుల సమూహము గలదిగ) చేయఁదలఁచెను. కాని స్వర్గమును అపారిజాత (అ+పారిజాత)ముగా (పారిజాతము లేనిదానినిగా) చేసెను. అని చెప్పఁగా నసంగతి తొలఁగును.

ఉదా :- ౩) ఓ కృష్ణ! గోత్రోద్ధరణకు బూని తుదకు నీవు గోత్రో
ద్భేదమ్ము సలిపితివి.

కృష్ణుఁడు ముందు గోత్రోద్ధరణకు బూని తుదకు గోత్రోద్భేదము-పూనిన కార్యమునకు విరుద్ధముగు కార్యము-చేసినట్లు చెప్పబడుటచే నిది తృతీయాసంగత్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

గోత్రోద్ధార-గోత్రోద్భేద శబ్దములచే కృష్ణుఁడు భూమికి మేలుచేయగోరి కీడును చేసెనను నభిప్రాయము కల్గుచున్నది. ఇట పూనిన కార్యమునకు విరుద్ధకార్యము జరిగినట్లు చెప్పబడినది. వంశ రక్షణము గోరి గోవర్ధన పర్వతమును పెకలించి పైకెత్తితివి అని చెప్పుకొనుట వలన పై వైరుధ్యము తొలఁగును.

కాఁగా పై దెల్పిన ద్వితీయ, తృతీయోదాహరణములందు కన్పించు అసంగతత్వమును పరిహరించుటకై శ్లేషమూలకమగు అభేదాధ్యవసానము అనుసరింపబడినదనుట గుర్తింప దగును.

సం॥ అన్యత్ర కరణీయస్య తతోఽన్యత్ర కృతిశ్చ సా,
అన్యత్కర్తుం ప్రవృత్తస్య తద్విరుద్ధకృతిశ్చ సా.

సం॥ అపారిజాతాం వసుధాం చికీర్షన్ ద్యాం తథాఽకృథాః,
గోత్రోద్ధారప్రవృత్తోఽపి గోత్రోద్భేదం పురాఽకరోః.

అన్యత్ర = వేఱొకచోట; కరణీయస్య = చేయదగినదానియొక్క; తతః + అన్యత్ర = దానికంటె, వేఱైనచోట; కృతిః + చ = చేయుటయు; సా = ఆ యసంగత్యలంకారమే. వసుధామ్ = భూమిని; అప + అరి + జాతామ్ = అపగతమైన శత్రుసమూహము కలదానినిగా (శత్రుసముదాయములేనిదానినిగా); చికీర్షన్ = చేయగోరినవాడవై; ద్యామ్ = స్వర్గమును; తథా = అపారిజాతముగా; అకరోః = చేసితివి.

అన్యత్ = వేఱొకదానిని; కర్తుమ్ = చేయుటకు; ప్రవృత్తస్య = పూనుకొనినవాని యొక్క; తత్ + విరుద్ధ + కృతిః + చ = (చేయబూనిన) దానికి విరుద్ధమైన కార్యముచేయుట కూడ; సా = ఆ యసంగత్యలంకారమే. గోత్ర + ఉద్ధార + ప్రవృత్తః + అపి = గోత్రమును, ఉద్ధరింప, బూనుకొన్నవాడవు, ఐనను; గోత్ర + ఉద్భేదమ్ = గోత్రముయొక్క, ఉద్భేదమును (పెరుకుటను); పురా = మునుపు; అకరోః = చేసితివి.

## 38. విషమాలంకారము

తే॥ గీ॥ అననురూపములకు సంఘటనము నరసి
వర్ణనము సేయు విషమమై వఱలు కృతుల,
అలశిరీష కుసుమ పేశలాంగి యెడ?
పరమదుః సహమన్మథ జ్వర మదేడ? 81

అననురూపములకు సంఘటనము వర్ణింపబడిన యెడల విషమాలంకార మగును. అట్లే విరూప కార్యోత్పత్తిరూపము, అనిష్టావాప్తిరూపము నగు విషమాలంకారములును గలవు.

ఉదా :- శిరీషకుసుమ కోమలాంగి యెక్కడ? బహు దుస్సహమగు
మదనజ్వరమెక్కడ? (ఈ రెంటికి పొసఁగదని భావము).

కోమలాంగి, దుస్సహ జ్వరము అను నీరెండు పరస్పరము అననుకూలములు. కాఁగా వాని రెంటికి సంఘటన మిట వర్ణింపబడినది. కాన నిది ప్రథమ విషమాలంకారమునకు లక్ష్యమౌను.

సం॥ విషమం వర్ణ్యతే యత్ర ఘటనాఽననురూపయోః,
క్వేయం శిరీషమృద్వంగీ క్వ తావన్మదనజ్వరః.

యత్ర = ఎచ్చట; అననురూపయోః = అనురూపములు కాని వానికి; ఘటనా = సంబంధము; వర్ణ్యతే = వర్ణింపబడునో; (తత్ర = అచట) విషమమ్ = విషమాలంకారము (ఉండును). ఇయం = ఈ; శిరీష + కుసుమ + మృదు + అంగీ = దిరిసెనపు, పూవువలె, కోమలమైన, శరీరముగల వనిత; క్వ = ఎక్కడ? తావత్ = అంత తీవ్రమగు; మదన + జ్వరః = మదనహేతుకమైన, జ్వరము; క్వ = ఎక్కడ?

తే॥ గీ॥ కారణవిరూప కార్యంబు కలిగె నేని
అయ్యది విషమాలంకార మన్య మగును
శ్యామ మౌ నీ కృపాణ మో యధిప? ధరణి
దశదిశల వెలయు ధవళయశముఁ గూర్చె. 82

కారణమునకు విరుద్ధరూపముగల కార్యము కలిగినట్లు చెప్పినను విషమాలంకారమే యగును.

ఉదా :- ఓ రాజా! నీ శ్యామ కృపాణము ధవళయశము నిచ్చుచున్నది.

ఇట నల్లని కత్తి తెల్లని కీర్తి నిచ్చుచున్న దనుటలో విరుద్ధరూప కార్యోత్పత్తి కలదు. కారణగుణము నలుపు, కార్యగుణము తెలుపు. కాఁగా నిది లక్షణమును బట్టి అన్యమగు విషమాలంకార లక్ష్యమగును.

సం॥ విరూప కార్యస్యోత్పత్తి రపరం విషమం మతమ్,
కీర్తిం ప్రసూతే ధవలాం శ్యామా తవ కృపాణికా.

విరూప+కార్యస్య=కారణ విరుద్ధమగు, కార్యముయొక్క; ఉత్పత్తిః=పుట్టుక; అపరమ్=మఱియొక; విషమమ్=విషమాలంకారముగ; మతమ్=అంగీకృతము (ఐనది). తవ=నీయొక్క; శ్యామా=నల్లని దగు; కృపాణికా=కత్తి; ధవళామ్=తెల్లనైన; కీర్తిమ్=యశస్సును; ప్రసూతే=కలుగఁజేయుచున్నది.

తే॥ గీ॥ ఈప్సితార్థోద్యమమున ననిష్ట లాభ
మొదవిన విషమాలంకార మొండు వెలయు
ఎలుక భక్ష్యేశ ఫణిపేటిఁ దొలిచి చొచ్చ
పాముచే నట భక్షింపఁ బడియె నదియు. 83

ఈప్సితార్థసిద్ధికై చేయు యత్నముచేతనే అనిష్టప్రాప్తి కలిగినట్లు చెప్పినను విషమాలంకారమే.

ఉదా :– భక్ష్యమందలి ఆశచే పాము పెట్టెను తొలిచి అందు ప్రవేశించిన ఎలుక అందే ఉన్న పాముచే భక్షింపబడెను.

ఇట ఎలుకకు ఈప్సితార్థము భక్ష్యము. తత్ప్రాప్తికై పామున్న పెట్టెను (పామున్నట్లు తెలియక) తొలచినది. అట తనకు భక్ష్యలాభము లేకపోగా అటనున్న పాముచే తనకు ప్రాణాపాయమే జరిగినది. కావున నిది ఉక్తలక్షణమును బట్టి విషమాలంకార లక్ష్యమగుచున్నది.

సం॥ అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థ సముద్యమాత్,
భక్ష్యాశయాహిమఞ్జూషాం దష్ట్వాఖుస్తేన భక్షితః.

ఇష్ట+అర్థ+సముద్యమాత్ = కోరిన, ఫలముయొక్క సిద్ధికై చేసిన యత్నము వలన; అనిష్టస్య=కీడుయొక్క; అవాప్తిః+చ+అపి=ప్రాప్తి, కూడ; తత్ = ఆ విషమాలంకారమే. ఆఖుః=ఎలుక;

భక్ష్య + ఆశయా = భక్ష్యమందుండు ఆశచే; అహి + మంజూషామ్ = పాము పెట్టెను; దష్ట్వా = తొలిచి; తేన = (అంతటి) పాముచే; భక్షితః = భక్షింపఁబడినది.

## 39. సమాలంకారము

తే॥ గీ॥ స్యాదనురూప వస్తుద్వయ వర్ణనంబె
శ్రుతి సమాలంకృతి యనంగ నతిశయించు
పడఁతి కుచమండలంబది పరఁగనయ్యె
మహితహారాను రూప మౌ మందిరంబు. 84

అనురూపములగు వస్తువుల జంటకు సంబంధము వర్ణితంబైన యెడల సమాలంకార మగును. ఇది విషమాలంకారమునకు విరుద్ధమైనది. విషమమునకువలె దీనికిని మూఁడు భేదములు గలవు.

ఉదా॥ పడఁతి కుచమండలము హారమునకు తగు మందిరమైనది.

ఇట కుచమండలమ్ము, హారము రెండును మనోహరములైనవే. మఱియు పరస్పరము శోభాదాయకములే. కనుకనే హారమును అలంకరించుటకు తగినచోటు కుచమండలము. అట్లే కుచమండలమునకు తగిన అలంకారము హారము. ఈ యనురూపవస్తుద్వయమునకు కిట సంబంధము చెప్పఁబడినది. కావున నిది సమాలంకారమునకు లక్ష్యమైనది.

సం॥ సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయోరప్యనురూపయోః
స్వానురూపం కృతం సద్మ హారేణ కుచమండలమ్. ॥

యత్ర = ఎచ్చట; అనురూపయోః = పరస్పరానురూపములగు; ద్వయోః + అపి = వస్తువుల రెండింటికిని; వర్ణనమ్ = వర్ణించుట (జరిగినచో): (అది) సమమ్ = సమాలంకారము; స్యాత్ = అగును; హారేణ = హారముచేత; కుచమణ్డలమ్ = స్తనప్రదేశము; స్వ + అనురూపమ్ = తనకు తగినట్టి; సద్మ = మందిరముగ; కృతమ్ = చేయఁబడినది.

తే॥ గీ॥ కార్యకారణ సారూప్య కథన మున్న
అన్య మగు సమాలంకార మనిరి కృతులు
నీటఁ బుట్టిన యో లక్ష్మి! నీకె తగును
సతతము నీచ ప్రవణతను సాగుచుంట. 85

కార్యమునకు కారణముతో సారూప్యము (అనురూపత) చెప్పఁ బడెనేని అదియు సమాలంకారమే యగును.

ఉదా :- ఓ లక్ష్మీ! నీటిలో బుట్టిన నీకు నీచప్రవణత్వము తగినట్టిది.

నీరు పల్లమునకుఁ బ్రవహించుట సహజగుణము. అట్టి నీటిలోఁ బుట్టిన లక్ష్మికిని నీచ ప్రవణత్వము సంక్రమించుటయు నుచితమే. ఇట కార్యముగు లక్ష్మికి కారణముగు జలముయొక్క నీచ ప్రవణతారూపముగు లక్షణము సంక్రమించినది. ఇట్లు కార్యకారణములకు అనురూపత్వము చెప్పబడినందువలన నిది సమాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇట నీచప్రవణత యన నీటి విషయమున పల్లమునకు ప్రవహించుట. లక్ష్మి విషయమున అధముల యందాసక్తి చూపుట అను నర్థము గ్రాహ్యము. కావున నిట సారూప్యము శ్లేషమూలక మైనది.

సం॥ సారూప్య మపి కార్యస్య కారణేన సమం విదుః,
నీచప్రవణతా లక్ష్మి! జలజాయా స్తవోచితా.

కార్యస్య=కార్యమునకు; కారణేన=కారణముతో; సారూప్యమ్+అపి = అనురూపత్వము కూడ; సమమ్=సమాలంకారము (అని); విదుః=(విద్వాంసులు) స్వీకరింతురు. హే లక్ష్మి! = ఓ లక్ష్మీ! జలజాయాః=నీటిలోఁబుట్టిన; తవ=నీకు; నీచ+ప్రవణతా=పల్లమునకు ప్రవహించుట, నీచులయందు ఆసక్తిచూపుట; ఉచితా=తగి యున్నది.

తే॥ గీ॥ ఇష్టసిద్ధి కౌ యత్న మనిష్టముడుగ
సఫలమై సమాలంకృతి సరుగు కృతుల
వారణముఁ గోరు నయ్యర్థి వరున కయ్యె
ద్వారదేశాన యుక్తము వారణంబు. 86

కర్త దేనికై ప్రయత్నించునో, అనిష్టమేమియు లేకుండ అది సఫలమయ్యె నేని అదియు సమాలంకారమే యగును.

ఉదా :- వారణము నర్థించు యాచకునకు ద్వారమందే వారణము యుక్తము.

ఇట అర్థి కోరునది, పొందినదియు వారణమే. కాన ఏ విఘ్నము లేక కీడు లేకుండ ఇష్టసిద్ధి కలిగినట్లు చెప్పినందు వలన సమాలంకారమున కిది లక్ష్యమగును.

వివరణ - ఒకానొకఁడు వారణము (ఏనుఁగు) ను పొంద గోరి రాజదర్శనమున కేగ, ద్వారపాలకులు వానిని ద్వారముకడ అడ్డగించిరి. ఆ విషయ మెఱిఁగినట్టి వేఱొక వ్యక్తియొక్క పరిహాస వచన మిది.

ఇట వారణశబ్దమునకు ఏనుఁగు, వారించుట అను రెండర్థములు గలవు. వారణము గోరిన అర్థికి వారణము లభించినదనుట ఇష్టసిద్ధిని దెల్పుచున్నట్లున్నను వాస్తవముగా అట లభించినది ద్వారమువద్ద నిరోధమేగాని గజప్రాప్తి కాదు. ఇట అనురూపత శబ్దశ్లేష మూలకమేగాని నిజము కాదు. ఇది పరిహాస స్థానము కనుక శబ్దానురూప్యతయే శోభాదాయకము.

సం॥ వినానిష్టం చ తత్సిద్ధిర్యమర్థం కర్తు ముద్యతః,
యుక్తో వారణలాభోఽయం స్యాన్న తే వారణార్థినః.

యమ్=ఏదో; అర్థమ్ = ప్రయోజనమును (కార్యమును) కర్తుమ్=నెఱవేర్చుటకు; ఉద్యతః= ప్రయత్నించువానికి; అనిష్టం+

పెనా=అనర్థము లేకుండ; తత్+సిద్ధిః=ఆ కార్యముయొక్క సిద్ధియు (నెఱవేఱుటయు); (సమాలంకారమగును). వారణ+అర్థినః=వారణము నర్థించునట్టి తే=నీకు; అయమ్+వారణలాభః=ఈ, వారణము యొక్క ప్రాప్తి; యుక్తః=తగినది; న+స్యాత్=కాదా? అగునని భావము.

ఈ మూఁడు సమాలంకారములు వరుసగా మూఁడు విషమాలంకారములకు ప్రతిద్వంద్వులే యగును.

## 40. విచిత్రాలంకారము

తే॥ గీ॥ అల ఫలేచ్ఛచే విపరీతమైన యత్న
మొనరఁజేయ విచిత్రాఖ్య మొప్పుఁ గృతుల
ముజ్జగముల సమున్నతిఁ బొందఁగోరి
అఖిల సజ్జను లతినమ్రు లౌదురిలను. 87

ఫలేచ్ఛను బట్టి విరుద్ధముగనుండు ప్రయత్నము చేయబడిన యెడల విచిత్రాలంకార మగును. ప్రయత్నమునకు విపరీతమైన ఫలము నాశించి యత్నించిన విచిత్రాలంకార మగును. రెంటి సారాంశ మొక్కటియే.

ఉదా :- మూఁడులోకములందు అత్యున్నతి నంద గోరిన సజ్జను లందఱు వినమ్రము లౌదురు.

సజ్జనులు కోరునది సమున్నతి. కాని చేయు క్రియ ఎక్కువ నమ్రతా ప్రకటనము. అత్యున్నతి కోరి వినతులగుటలో ఫలేచ్ఛచే ఉన్నతికి విరుద్ధముగ గన్పించు వినమ్రతను జూప యత్నించుచుండుట ఇట స్పష్టము. కావున నిది ఉక్తలక్షణమును బట్టి విచిత్రాలంకారమునకు లక్ష్యమగును.

సం॥ విచిత్రం తత్ప్రయత్నశ్చేద్విపరీతః ఫలేచ్ఛయా,
నమన్తి సన్తస్త్రైలోక్యాదపి లబ్ధుం సమున్నతిమ్.

ఫల+ఇచ్ఛయా=ఫలము యొక్క కోరికచే (పరిశీలింప) తత్+ప్రయత్నః=ఇష్టఫలావాప్తికిచేయు, ప్రయత్నము; విపరీతః+చేత్=విరుద్ధమైనది, ఐనయెడల; విచిత్రమ్ = విచిత్రాలంకారము (అగును). సన్తః=సజ్జనులు; త్రైలోక్యాత్+అపి=ముల్లోకముల కంటె కూడ; సమున్నతిమ్=అత్యున్నతిని; లబ్ధుమ్=పొందుటకు; నమన్తి=నమ్రులగుచున్నారు.

## 41. అధికాలంకారము

తే॥ గీ॥ విస్తృతాధారమును మించి వెలసెనేని
వర్ణితాధేయ మధిక మై వఱలు కృతుల
ఎందు బ్రహ్మాండము లవెల్ల నిమిడి యుండె
అజ్జలమునందు త్వద్గుణా లణఁగ వధిప 88

విపులమైన ఆధారముకంటె ఆధేయమునకు అధిక్యమును వర్ణించిన యెడల నధికాలంకార మగును. ఆధారమన ఒక వస్తువు నకు ఆశ్రయము. ఆధేయము ఆధారమును ఆశ్రయించి యుండు వేఱొక వస్తువు. ఆధారము విస్తృతమై ఆధేయము దానికంటె విస్తృతిలో చిన్నదిగ నుండుట లోక సామాన్యము.

ఉదా :- బ్రహ్మాండములెల్ల నిముడు జలమునందు నీ గుణములు ఇముడకున్నవి.

ఇట జలము ఆధారము. అది బ్రహ్మాండముల నన్నింటిని తనలో నిముడ్చుకొనగలిగినంత విస్తృతమైనది. అందు అధేయ మగు (రాజ) గుణములు ఇముడకున్నవనుటచే లోకసామాన్యరీతికి విరుద్ధముగ ఆధారము కంటె ఆధేయము విస్తృతమైనదనుట స్పష్టము. కావున నిది అధికాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ అధికం పృథులాధారా దాధేయాధిక్యవర్ణనమ్,
బ్రహ్మాణ్డాని జలే యత్ర తత్ర మాన్తి న తే గుణాః.

పృథుల+ఆధారాత్=విపులమైన, ఆధారముకంటె; ఆధేయ+ఆధిక్య+వర్ణనమ్ = ఆధేయవస్తువునకు, ఆధిక్యమును, వర్ణించుట; అధికమ్=అధికాలంకారము (అగును). యత్ర=ఏ; జలే=నీటియందు; (బ్రహ్మ+అణ్డాని)=బ్రహ్మాండములు; మాన్తి=ఇముడు చున్నవో; తత్ర=ఆ నీటియందు; తే=నీయొక్క; గుణాః=గుణములు; న+మాన్తి=ఇముడకున్నవి.

తే॥ గీ॥ విస్తృతాధేయమునకంటె విపులరీతి
నలర వర్ణితాధార మొండధిక మగును
ఎంత విపులంబొ వార్ధి బ్రహ్మ, ఇమిడె నందె
నీ గుణము లెల్ల విశ్రాంతి [1]నెలవుకొనఁగ. 89

విశాలమగు అధేయముకంటె ఆధారమే అధికవిశాలమైనదని చెప్పినచో అది వేరొక అధికాలంకార మగును.

ఉదా :- నీ గుణము లెల్ల విశ్రాంతి గైకొన నిమిడిన వార్ధిబ్రహ్మ మెంత విశాలమో!

ఇట నాధేయమగు రాజగుణములకంటె తద్గుణములకాధారమగు వార్ధిబ్రహ్మకు ఆధిక్యము చెప్పబడుటచే నిది అధికాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ పృథ్వాధేయా ద్యదాధారాధిక్యం తదపి తన్మతమ్,
కియద్వార్ధిబ్రహ్మ యత్రైతే విశ్రామ్యన్తి గుణాస్తవ.

పృథు+ఆధేయాత్=విశాలమగు, నాధేయముకంటె; ఆధార+ఆధిక్యమ్=ఆధారమునకు, అధిక్యము; యత్=ఏది(వర్ణింపబడెనో); తత్+అపి=అదికూడ; తత్=ఆ యధికాలంకారము(అని); మతమ్=

1. నిలుకడ కలుగ.

అంగీకరింపబడినది. తవ=నీయొక్క; ఏతే=ఈ; గుణాః=గుణ ములు; యత్ర=ఎచ్చట; విశ్రామ్యన్తి = విశ్రమించుచున్నవో; వాక్+బ్రహ్మ = (అ) వాగ్రూపమగు బ్రహ్మ; కియత్ = ఎంత (గొప్పదో) ?

ఆధారముకంటె ఆధేయమునకో, ఆధేయముకంటె ఆధారము నకో ఆధిక్యము దెల్పుచుండు దీని కీపేరు సార్థకము.

## 42. అల్పాలంకారము

తే॥ గీ॥ అల్ప మాధేయ మాధార మల్పతరము
కాఁగ నది యల్ప మౌ నలంకార మగును
రత్నమాలోర్మికయె యవ్విరహిణి కిపుడు
చేత జపమాల యయ్యెను చెలఁగుచుండె. 90

అల్పమగు నాధేయముకంటె ఆధారము నల్పతరముగ వర్ణించిన యెడల నల్పాలంకార మగును.

ఉదా :- రత్నాలు పొదిగిన ఉంగరమే విరహిణికి జపమాల అయ్యెను.

ఇట అంగుళికి పరిమితమగు రత్నమాలోర్మిక అల్పమైనది. అదికూడ నా విరహిణి కరమున జపమాలవలె వ్రేలాడుచున్నదను టచే అల్పాధేయమగు రత్నాంగుళీయముకంటె విరహముచే కృశిం చిన ఆమె కరము అల్పతరము ఐనదిగా వర్ణింపబడినది. కావున నిది అల్పాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ అల్పంతు సూక్ష్మా దాధేయాద్యదాధారస్య సూక్ష్మతా,
మణిమాలోర్మికా తేఽద్య కరే జపవటీయతే.

సూక్ష్మాత్=సూక్ష్మ (అల్ప)మైన; ఆధేయాత్=ఆధేయము కంటె; ఆధారస్య=ఆధారమునకు; సూక్ష్మతా=అల్పత్వము: యత్+తు = యేదయితే (చెప్పబడినదో); (తత్=అది); అల్పమ్=అల్పా

లంకారము (అగును). అద్య=నేడు; తే=నీయొక్క; కరే=చేతి యందలి; మణిమాలా+ఊర్మికా=రత్నాంగుళీయకము: జపవటీయుతే=జపమాల యగుచున్నది.

## 43. అన్యోన్యాలంకారము

ఆ. వె. ఒండొరుల కుపకృతి యొప్పంగ నన్యోన్య
మను నలంకృతి కృతి నలరుచుండు
రాత్రి చంద్రుచేత, రాత్రిచేఁ జంద్రుండు
శోభ గాంచుచుంద్రు చూడు సఖుఁడ! 91

పరస్పరము ఉపకారమును పొందినట్లు వర్ణించిన యెడల అన్యోన్యాలంకార మగును.

ఉదా :- రాత్రి చంద్రునిచే, రాత్రిచే చంద్రుడును శోభింతురు.

ఇట రాత్రియొక్క శోభకు చంద్రుడును, చంద్రుని శోభకు రాత్రియు ఉపకారులగుచున్నందువలన ఇది అన్యోన్యాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ అన్యోన్యం నామ యత్ర స్యా దుపకారః పరస్పరమ్,
త్రియమా శశినా భాతి, శశీ భాతి త్రియామయా.

యత్ర=ఎచ్చట; పరస్పరమ్=అన్యోన్యముగా; ఉపకారః=ఉపకారము; స్యాత్=ఉండునో; (అచ్చట) అన్య+అన్యం+నామ=అన్యోన్యమను నలంకారము (అగును). శశినా = చంద్రునిచే; త్రియామా=రాత్రి: భాతి=ప్రకాశించుచున్నది. త్రియామయా=రాత్రిచే: శశీ=చంద్రుఁడు; భాతి=ప్రకాశించుచున్నాడు.

## 44. విశేషాలంకారము

తే॥ గీ॥ ఖ్యాత మాధారమున్ వీడి కడఁగి కృతుల
చెప్ప నాధేయ మదియె విశేష మౌను
అర్కుఁ డస్తం గతుం డైన నరుణరుచులు
దీపగతములై చీఁకటిం బాపుచుండు.

ప్రసిద్ధమైన ఆధారమును విడిచి ఆధేయమును వర్ణించిన యెడల విశేషాలంకార మగును. ఇది మూఁడు విధములు.

ఉదా :- రవి అస్తమించినను రవికరములు దీపస్థితములై చీఁకటిని పోగొట్టుచున్నవి.

ఇట సూర్యుఁడు - ఆధారము. కిరణములు - ఆధేయము. సూర్యుఁడు అస్తమించుటచే నిట ఆధారము లేదు. అది లేకున్నను ఆధేయములగు కిరణములు దీపముల నాధారముగ చేసికొని యున్నవనుటచే ప్రసిద్ధాధారమును విడిచి ఆధేయ మున్నట్లు వర్ణించుటచే నిది విశేషాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

శ॥ విశేషః ఖ్యాత మాధారం వినాప్యాధేయవర్ణనమ్,
గతేఽపి సూర్యే దీపస్థాస్తమశ్ఛిన్దన్తి తత్కరాః.

ఖ్యాతమ్=సుప్రసిద్ధమైన; అధారమ్=ఆధారము, వినా + అపి=లేకపోయినను: ఆధేయ+వర్ణనమ్=ఆధేయముయొక్క, వర్ణనము; విశేషః=విశేషాలంకారము (అగును). సూర్యే=సూర్యుఁడు; గతే+అపి=అస్తమించినప్పటికిని: తత్+కరాః=సూర్యకిరణములు, దీప + స్థాః=దీపములందు, ఉన్నవై; తమః=చీఁకటిని: ఛిన్దన్తి = ఛేదించుచున్నవి.

ద్వితీయ భేదము :-

తే॥ గీ॥ వస్తు వొకటె పెక్కు కడల వర్ణితంబు
వయి కృతుల విశేష మనఁగ నలరుచుండు
వెనుక, ముందఱ లోపలన్ వెలుపల నిల
దశదిశల నొప్పు నా కామె దర్శనంబు. 93

ఒకే వస్తువు వనేక స్థలము లందున్నట్లు వర్ణించిన యెడల అది వేఱొక విశేషాలంకార మగును. ఒక ఆధారమునందు ఒకటి గాని. అంతకంటె నెక్కువగాని ఆధేయములుండుట లోకసామాన్య

విషయము. దానికి భిన్నముగ ఒకే ఆధేయము ఒకేసారు అనేకా ధారములందున్నట్లు ఇందు విశేషించి చెప్పబడుటచే నిది విశేషా లంకారమై సార్థకనామ మగుచున్నది.

ఉదా :- వెనుక, ముందట, లోపల, వెలుపల, దశదెశ లందును నాకామె దర్శనమగుచున్నది.

ఇది పత్ని ఎడంబాటు ననుభవించు నాయకుని మాట. ఇట నాయిక ఒకటే అయ్యును ఒకేమాఱు ముందు-వెనుకలందు, బహి రంతరతములగను, అన్ని దిక్కులందును కన్పించుచున్నట్లు చెప్పబడి నందుచే ఇది ద్వితీయ విశేషాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ విశేషః సోఽపి యద్యేకం వస్త్వనేకత్ర వర్ణ్యతే,
అన్తర్బహిః పురఃపశ్చాత్ సర్వదిక్ష్వపి సైవ మే.

ఏకమ్=ఒక్క; వస్తు=వస్తువే; అనేకత్ర = పెక్కు స్థలము లందు; (ఉన్నట్లు) వర్ణ్యతే+యది=వర్ణింపబడినట్లైన; సః+అపి= అది, కూడ; విశేషః=విశేషాలంకారము(అగును). మే=నాయొక్క; అన్తః=లోపల; బహిః=వెలుపల; పురః=ఎదుట; పశ్చాత్=వెనుక; సర్వదిక్షు+అపి = అన్ని దిక్కులందుకూడ; సా+ఏవ = ఆమెయే (కన్పించుచున్నది).

తృతీయ భేదము :-

తే॥ గీ॥ అల్పకృషిచే నశక్య వస్త్వంతరకృతి
నలరు నొండు విశేషంబు నయ్యెఁ గృతుల
అధిప! నిన్నుఁ జూచెడు నాకుఁ బ్రాప్తమయ్యె
ధర నశాక్యామరతరు సందర్శనంబు. 94

అల్పమగు కృషిచేతనే అశక్యమగు వస్త్వంతరము సమ కూరినట్లు వర్ణింపబడిన యెడల అదియు వేరొక విశేషాలంకార మగును.

ఉదా :- ఓ రాజా! నిన్ను చూచుచున్న నాకు అశక్యమగు సుర
తరు సందర్శనం బాయెను.

ఇట యాచకునకు సులభసాధ్యమగు రాజదర్శనము వలన అతని కశక్యమైన కల్పవృక్ష దర్శనంబైనట్లు వర్ణింపఁబడుటచే నిది తృతీయ విశేషోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ కిఞ్చిదారమ్భతోఽశక్యవస్త్వంతర కృతిశ్చ సః
త్వాం పశ్యతా మయా లబ్ధం కల్పవృక్ష నిరీక్షణమ్.

కిఞ్చిత్ + ఆరమ్భతః = అల్పమైన, ఆరంభమువలననే; అశక్య+ (వస్తు+అంతర)+కృతిః+చ = అసాధ్యమగు, మరొక కార్యముయొక్క; సంభవము, కూడ; సః=ఆ విశేషోక్త్యలంకారమే (అగును). (ఓ రాజా!) త్వామ్=నిన్ను; పశ్యతా=చూచుచున్న; మయా=నాచేత; కల్పవృక్ష+నిరీక్షణమ్=కల్పవృక్షము యొక్క, దర్శనము; లబ్ధమ్=పొందఁబడినది.

## 45. వ్యాఘాతాలంకారము

తే॥ గీ॥ ఒక పని కొదవు దాని వేఱొక్క మాఱు
పని కొదవె నేని వ్యాఘాత మనఁగ నొప్పు
జనుల కిల నేవి సంప్రీతి నొసరఁ గూర్చు
వాని చేతనె మదనుండు వారి నేఁచు. 95

ఒక కార్యమునకు ఉపయోగించు దానినే వేఱొక మాఱు (విరుద్ధమగు) పనికి సాధనముగ నుపయోగించునేని అది వ్యాఘాతాలంకార మగును. ఏది, ఏ కార్యమునకు సాధనముగ ఉపయోగింపఁబడినదో అది అన్యునిచే తద్విరుద్ధ కార్యమునకు సాధనముగా చేయబడిన యెడల నది వ్యాఘాతాలంకార మగును.

ఉదా :- లోకమందు ఏవి జనులకు సంప్రీతిని కల్గించునో ఆ పువ్వుల
చేతనే మన్మథుఁడు వారిని బాధించును.

పువ్వులు జనులకు ప్రీతిని కల్గించుటకు సాధనము అగు చున్నవి. మదనుఁడాపువ్వులనే వారిపై ప్రయోగించి వారినే బాధించుచున్నాడు. జనుల ప్రీతికి సాధనమైన పువ్వులనే మదనుఁడు జనులను బాధించుటకు సాధనములుగా చేసికొన్నట్లు వర్ణించుటచే నిది పై లక్షణమును బట్టి వ్యాఘాతాలంకారమునకు లక్ష్యమగును.

సం॥ స్యా ద్వ్యాఘాతోఽన్యథాకారి తథాకారి క్రియేత చేత్.
యై ర్జగత్ ప్రీయతే హన్తి తై రేవ కుసుమాయుధః.

తథాకారి=ఒక కార్యమునకు సాధనమైన వస్తువే; అన్యథాకారి=తత్కార్య విరుద్ధమైన కార్యమునకు సాధనముగ; క్రియేత+చేత్=చేయబడినది, ఐనయెడల; వ్యాఘాతః = వ్యాఘాతమను నలంకారము; స్యాత్=అగును. యైః=ఏ పూవులచే; జగత్=లోకము (జనము); ప్రీయతే=సంతోషపఱచబడుచున్నదో; తైః+ఏవ = ఆ పూవులతోనే; కుసుమ+ఆయుధః = మన్మథుఁడు; (జనమునే) హన్తి=బాధించుచున్నాడు.

తే॥ గీ॥ అధిక సౌకర్య మాశించి [1]యందు క్రియయె
కార్యమాపఁ జాలినను వ్యాఘాతమగును
బాలుఁడని దయ నాయెడఁ బరఁగునేని
దాన విడువఁదగనివాఁడ నేను నీకు. 96

అధికమగు ననుగుణకారణముగ కైకొనిన క్రియ ఇష్టకార్యమునకు నిరోధకమగునట్లు చెప్పెనేని అదియు వేఱొక వ్యాఘాతాలంకారమగును.

ఉదా :- నేను బాలుఁడనని నాయందు దయ కల్గిన బాలుఁడనను కారణముచేతనే నేను నీకు విడువదగని వాఁడను.

---

1. కైకొను, గ్రహించు.

ఇట జైత్రయాత్రకు సంసిద్ధుఁడైన రాజు యువరాజును రాజ్యమునందే నిలుపఁగోరి బాలుఁడవు గాన నిన్ను నా వెంట గొని పోరాదనఁగా యువరాజు "బాలుఁడను కనుక మీరు నన్ను విడిచి పెట్టక, తప్పక మీవెంట గొని పోవలె" ననెను. ఇతర కారణములతో పాటు రాజు స్వాభీష్టసిద్ధికి సౌకర్యముగచూపిన బాలత్వమును యువ రాజు అధిపాభీష్టసిద్ధికి విరుద్ధముగ స్వాభీష్ట (పిత్రను గమనకార్య) సిద్ధికి అనుకూలముగ ఉపయోగించుకొన్నట్లు చెప్పుటచే నిది ద్వితీయ వ్యాఘాతాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ సౌకర్యేణ నిబద్ధాపి క్రియా కార్యవిరోధినీ,
దయా చేద్బాల ఇతి మయ్యపరిత్యాజ్య ఏవ తే.

సౌకర్యేణ=కారణమునకు అనుగుణ్యాధిక్యమునాశించి; నిబద్ధా= కవిచే వర్ణింపబడిన; క్రియా+అపి=క్రియ కూడ; కార్యవిరోధినీ= అభీష్టకార్యమునకు విరుద్ధమైనది (ఐన యెడల) అదియు వ్యాఘాతాలంకారము అగును.

ఆ. వె. ధనము నిచ్చెనేని దారిద్ర్య 1మగునంచు
దాన మీయ కుండు ధరణి లోభి
ధనము నీయకున్న దారిద్ర్య మౌ నంచు
ధనము నిచ్చి దాత ధరణి వెలయు. 96–A

ధనమును దానము నిచ్చుచు వచ్చిన నరుఁడు ఒకనాటికి దరిద్రుఁడగునని లోభి దానము చేయఁడు. దానము చేయకున్నచో దారిద్ర్య మబ్బునని దాత దానము చేయును.

ఇట పూర్వార్థమందు లోభియొక్క దానాభావమునకు సాధకముగా చేయుబడిన దారిద్ర్య శంక పూర్వపక్షముగా నిరూపింపఁ బడినది. ఉత్తరార్థమున ఆ దారిద్ర్యశంకయే దానాభావవిరుద్ధమగు

96–1. కలుగు

దానమునకు సాధకముగ సమ్మతమని పూర్వపక్షమునకు విరుద్ధమైన వేరొక పక్షము నిరూపింపబడినది. ఇట్లు ఇచట పక్ష-ప్రతిపక్షరూప మైన ఇద్దఱి వచనములు చెప్పబడినందుచే నిదియు ద్వితీయ వ్యాఘాతోదాహరణ మగుచున్నది.

## 46. కారణమాలాలంకారము

తే: గీ॥ అలరు *ప్రాక్ప్రాస్త కారణంబులను గూర్చ
కృతిని కారణమాల నా నతిశయించు
నీతిచే లక్ష్మి, లక్ష్మిచే [1]నెనరు నీవి
ఈవిచేతను కీర్తియు నెసఁగు నధిప! 97

ఉత్తరోత్తరమునకు కారణభూతములైన పూర్వపూర్వ వస్తువులను గాని, పూర్వపూర్వములు కారణములుగా గల ఉత్తరోత్తర వస్తువులను గాని, క్రమము దప్పకుండ చెప్పిన కారణమాలాలంకార మగును.

ఉదా :- నీతి (న్యాయము) చే లక్ష్మి, లక్ష్మిచే నీవి (దానము) దానముచే కీర్తియు నతిశయించును.

ఇట నీతి, లక్ష్మి, దానములు పూర్వ-పూర్వములై వరుసగ ఉత్తరోత్తరములగు లక్ష్మి, దానము, కీర్తి అను కార్యములకు కారణములగుచున్నవి. అనగా కారణమగు నీతిచే కార్యమగు సిరియు, కారణమగు నీవి (దానము) చే కార్యమగు కీర్తియు క్రమమున గూర్చబడినవి. ఇట్లు ఇచట పూర్వాపూర్వ వస్తువులు ఉత్తరోత్తర వస్తువులకు కారణభూతములైనవి. కార్యములకు మూలములు కారణములగుటను బట్టిగాని, వ్యక్తియొక్క వివక్షను బట్టి

* పాఠాంతరము.
వరుసఁ దప్పని కారణ పంక్తిఁ గూర్చ

97-1. ప్రియము.

గాని కారణములు ప్రధానము లగుటచే నిది కారణమాలాలంకార ముగాఁ బ్రసిద్ధమైనది. ఆ యలంకార లక్షణము ననుసరించుచు నిది తల్లక్ష్యమగుచున్నది.

సం॥ గుమ్ఫః కారణమాలా స్యాద్యథా ప్రాక్ప్రాన్తకారణైః,
నయేన శ్రీః, శ్రియా త్యాగస్త్యాగేన విపులం యశః.

యథా ప్రాక్ప్రాన్తకారణైః=పూర్వపూర్వము తత్పూర్వోత్త రోత్తరమును అతిక్రమించకుండ నుండు కారణములతో; గుమ్ఫః= కూర్పు, (రచన); కారణమాలా=కారణమాలయను నలంకారము; స్యాత్=అగును. నయేన=నీతిచే; శ్రీః=సంపద; శ్రియా=సంప దచే; త్యాగః=దానగుణము; త్యాగేన=దానలక్షణముచే; విపులమ్= విస్తృతమైన; యశః=కీర్తి (కలుగును).

తే॥ గీ॥ నరకములు పాపమువలన నమరుచుండు
పాపము దరిద్రతవలన వఱలుచుండు
క్రమ్మ దారిద్ర్య మప్రదానమ్మువలన
కాన నీవును దాతవై క్రాల వలయు. 98

నరకములు పాపముచే, పాపము దారిద్ర్యముచే, దారిద్ర్యము దానము చేయకపోవుటచే కలుగును. కాన నీవు దాతవై ప్రవ ర్తించుము.

ఇట పూర్వపూర్వములకు కారణభూతములగు ఉత్తరోత్తరములు మాలగా కూర్పబడినవి. పూర్వమునను్న నరకమునకు కారణమగు

---

ప్రాక్ చ ప్రాన్తంచ=ప్రాక్ప్రాన్తే; తే అనతిక్రమ్య ఇతి=యథా ప్రాక్రాన్తం; (తత్) యానికారణాని తైః। పూర్వంపూర్వం ప్రతి కారణైః, ఉత్తరోత్తరం ప్రతి కారణైశ్చేత్యర్థః। ఏవం చ ఉత్తరో త్తరేత్యాదివ్యత్క్రమేణాభిధానముదాహరణ క్రమానురోధేన ఇతి జ్ఞేయమ్.

పాప ముత్తరమునను, పూర్వమునను్న పాపమునకు కారణమగు దారిద్ర్యము ఉత్తరమునను, అట్లే పూర్వమందున్న దారిద్ర్యము నకు కారణమగు అప్రదానము ఉత్తరమునను చెప్పబడినవి. ఉత్తరోత్తర వస్తువులు పూర్వపూర్వములకు కారణములుగా చెప్పబడినవి. కావున నిదియు కారణమాలాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

పూర్వలక్ష్యమందు పూర్వపూర్వములు కారణములై ఉత్తరోత్తరములు కార్యములుగను, ఈ రెండవ లక్ష్యమందు పూర్వపూర్వములు కార్యములై ఉత్తరోత్తరములు కారణములుగను క్రమము దప్పని రీతిలో కూర్చుటయే గమనింపదగు భేదము.

## 47. ఏకావళ్యలంకారము

తే॥ గీ॥ పట్టి విడుచు రీతిగ నర్థపంక్తి యమర
కృతుల నేకావళి యనంగఁ గీర్తితంబు.
విభుని కన్ను లాకర్ణాంత విస్తృతములు
కర్ణములు భుజ స్తంభాగ్ర కంపితములు
భుజము లాజాను లంబితా భూషితములు
జానువుల్ రత్నదర్పణ సజ్జితములు. 99

గృహీతము క్తరీతిని (గ్రహించిన దానిని విడుచు పద్ధతిలో) అర్థపంక్తిని గూర్చినయెడల నది ఏకావళ్యలంకార మగును. ఇందు పూర్వపూర్వములకు నుత్తరోత్తరములు విశేషణభావమును కల్గియుండును.

ఉదా :- విభుని కన్నులు ఆకర్ణాంతవిశాలములు. కర్ణములు భుజస్తమ్భాగ్రముల వఱకును కంపించుచున్నవి. భుజములు జాను (మోకాళ్లు) వుల వఱకు వ్రేలాడుచు శోభించుచున్నవి. జానువులు రత్నదర్పణలవలె సుసంధితములు.

ఇట మొదట కన్నులు గ్రహింపబడి విడువబడినవి. అట్లే

పిమ్మట భుజములు, జానువులును వరుసగా ముందు గ్రహింపబడి తరువాత విడువబడినవి. మఱియు కన్నులు పూర్వమున ఆకర్ణాంత విశాలములు ఉత్తరమునైనది.కాఁగా పూర్వమునకు ఉత్తరము విశేషణమైనది. ఇట్లు ఇట పూర్వపూర్వములకు ఉత్తరోత్తరములు విశేషణత్వమున వెలయుచున్నవి. ఉక్తలక్షణము ప్రకారమిది ఏకావళ్యలంకారము. ఇదియు ఏకావళియను మాలావిశేషము వలెనే మాలాకృతి నుండుటచే దీనికి పేరు ఏర్పడినది.

కారణమాలయందు పూర్వోత్తరములకు కారణకార్యసంబంధము ఉండగా ఇట పూర్వోత్తరములకు విశేష్య విశేషణసంబంధముండుట గమనింపదగిన అంశము. గృహీతముక్త పద్ధతి రెంటియందును గలదు.

సం॥ గృహీతముక్త రీత్యార్థశ్రేణి రేకావళీ మతా,
నేత్రే కర్ణాన్తవిశ్రాన్తే కర్ణౌ దోస్స్తమ్భదోలితౌ.
దోస్స్తమ్భౌ జానుపర్యన్త ప్రలంబన మనోహరౌ,
జానునీ రత్నముకురాకారే తస్య మహీభుజః.

గృహీత+ముక్త+రీత్యా = ముందు గృహీతము, పిదప ముక్తము అగు రీతిలో; అర్థ+శ్రేణిః=విషయములవరుస; ఏకావళీ= ఏకావళియను నలంకారముగా; మతా=అంగీకరింపబడినది.తస్య=ఆ; మహీభుజః=రాజుయొక్క; నేత్రే=కన్నులు; ఆకర్ణాన్త విశ్రాన్తే= చెవులవఱకు చేరునంతటి విశాలమైనవి. కర్ణౌ=(ఆ) రెండు చెవులును; దోః+స్తమ్భ+దోలితౌ= స్తమ్భములను బోలిన భుజముల వఱకు వ్రేలాడుచున్నవి; దోః+స్తంభౌ= స్తంభములఁ బోలిన రెండు భుజములు: జాను+పర్యన్త+ప్రలమ్బన+మనోహరౌ=మోకాళ్ల, వఱకు, వ్రేలాడుచు, మనోహరములు ఐనవి. జానునీ = రెండు మోకాళ్లును; రత్న+ముకుర+ఆకారే=మణులు పొదిగిన, అద్దము యొక్క ఆకారమువంటి ఆకారము గలవి.

# 48. మాలాదీపకము

తే॥ గీ॥ దీపకైకావళీ యోగదీప్త మగుచు
ఖ్యాత మౌను మాలాదీపకంబు కృతుల
మన్మథుని బాధ ప్రియసఖీ మనసునందు,
మనసు నీయందుఁ బాయక మట్టుకొనెను. 100

దీపకము-ఏకావళి అను రెండలంకారముల మేళనముచే మాలాదీపకము ప్రసిద్ధ మగును. అనగా దీపక-ఏకావళీ సంయోగముచే మాలాదీపక మేర్పడును.

ఉదా ॥- మన్మథుని బాధ ప్రియసఖీ మనసునందు, మనసు నీయందును తొలఁగక కుదురుకొనెను.

ఇది నాయిక దూతి నాయకునితో చెప్పెడు విషయము. ఇట మన్మథుని బాధ ప్రియసఖీ మనసునందును ఆమె మనస్సు నీయందును పాయకమట్టుకొనెను అను రెండు వాక్యములందు మట్టుకొనెను అను క్రియ మన్మథబాధకును, మనస్సునకును అన్వయించుచు వాక్యద్వయమునకు ధర్మైక్యమును తెల్పుచున్నందువలన ఇది దీపకమగుచున్నది. మఱియు పూర్వము విశేష్యమై ఉత్తరము విశేషణ మగుచుండు ఏకావళీ లక్షణమును ఇందు కలదు. ఎట్లన ఇట పూర్వమగు మన్మథబాధ విశేష్యము, ఉత్తరమగు "ప్రియసఖి మనస్సున మట్టుకొనినది" అను భాగము విశేషణము. అట్లే మనస్సు (పూర్వము) విశేష్యము, "నీయందు మట్టుకొనినది" అను నుత్తరభాగము విశేషణకార్యమును నిర్వహించుచున్నది. అంతియేగాక ఇట మన్మథబాధ ముందు గృహీతము పిదప ముక్తమైనది. ఇట్లు గృహీత-ముక్తరీతి విషయశ్రేణి పూర్వోత్తరములకు విశేష్య-విశేషణ భావములొప్పు రీతిగా చెప్పబడుటచే ఏకావళ్యలంకార లక్షణమును ఇట వర్తించుటచే నిది ఏకావళి యగుచున్నది. ఈ రీతిగా

దీపక - ఏకావళ్యలంకారముల సంయోగ మిందు చెప్పబడి పై యుదాహరణము మాలాదీపకమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ దీపకైకావళీ యోగాన్మాలా దీపక ముచ్యతే,
స్మరేణ హృదయే తస్యాస్తేన త్వయి కృతా స్థితిః.

దీపక+ఏకావళీ+యోగాత్=దీపకము యొక్కయు, ఏకావళి యొక్కయు, మేళనము వలన; మాలాదీపకమ్ = మాలాదీపకమను నలంకారము; ఉచ్యతే = చెప్పబడును. స్మరేణ = మన్మథునిచే; తస్యాః=ఆమెయొక్క; హృదయే=హృదయమునందును, తేన= ఆ హృదయముచే; త్వయి=నీయందును; స్థితిః=ఉనికి; కృతా= చేయబడినది.

## 49. సారాలంకారము

ఆ. వె. ఉత్తరోత్తరంబు నుత్కర్ష మొప్పంగ
సారమనుచు నెంత్రు శాస్త్ర విదులు
మధువె మధుర మౌను, మధువుకంటెను సుధ
దానికంటె సూక్తి ధరణియందు. 101

పూర్వముకంటె నుత్తరము, దానికంటెను తదుత్తరము ఉత్కర్ష మనురీతి ఉత్తరోత్తరము శ్రేష్ఠత యొప్పునట్లు చెప్పిన సారాలంకార మగునని శాస్త్రవేత్త లందురు.

ఉదా :- మధువు (తేనె) మధురము. మధువు కంటె సుధ (అమృతము)యు, దానికంటె సూక్తియు మధురమని భావము.

ఇట మధువు, దానికంటె తదుత్తరము సుధ, దానికంటె తదుత్తరము సూక్తి మధురమని ఉత్తరోత్తరము మాధుర్యమున శ్రేష్ఠమని చెప్పబడుటచే ఇది సారాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఉత్తరోత్తర ముత్కర్షః సార ఇత్యభి ధీయతే,
మధురం మధు, తస్మాచ్చ సుధా, తస్యాః కవేర్వచః.

ఉత్తర+ఉత్తరమ్=ఉత్తరమునకు, దానికంటె నుత్తరముగ ఉన్న దానికిని; ఉత్కర్షః=శ్రేష్ఠత; (చెప్పబడిన యెడల) సారః+ఇతి=సారాలంకారమని; అభిధీయతే=చెప్పబడుచున్నది. మధు=తేనె; మధురమ్=తియ్యనిది. తస్మాత్=ఆ తేనె కంటె; సుధా=అమృతము: తస్యాః=ఆ యమృతము కంటె: కవేః=కవియొక్క; వచః+చ=ఉక్తియును (మధురమైనదని భావము).

## 50. యథా సంఖ్యాలంకారము

తే॥ గీ॥ క్రమముతో నన్వయము క్రమికలకుఁ జెప్ప
నది యథా సంఖ్య మనఁ గృతి నలరుచుండు
అరుల, మిత్రుల, విపదల నవనివిభుఁడు
పరిభవించె నాదృతిఁ జూపె, పరఁగఁ దొలఁచె. 102

క్రమికలు అనగా నొక క్రమముతో చెప్పబడిన వస్తువులు. క్రమికలకు అదే క్రమముతో నన్వయము చెప్పినచో అది యథా సంఖ్యాలంకార మగును.

ఉదా :- రాజు శత్రువులను, మిత్రులను, ఆపదలను-పరిభవించె, ఆదరించె, తొలఁగఁజేసెను.

ఇట 1. అరులు 2. మిత్రులు 3. విపదలు అనునవి క్రమికలు. ఈ క్రమికలతో అదే క్రమములో 1. పరిభవించె 2. ఆదరించె 3. పరఁగఁ దొలఁచె ననువానితో అన్వయము చెప్పబడినది. అందుచే అవనిపతి అరులను పరిభవించెను, మిత్రులను ఆదరించెను, విపదలను చక్కగా దొలఁగించెనను నభిప్రాయము ఇట స్పష్టమగుచున్నది. కావున నిది యథా సంఖ్యాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః,
శత్రుం మిత్రం విపత్తిం చ జయరఞ్జయ భఞ్జయ.

క్రమికాణామ్ = క్రమముగా చెప్పఁబడిన పదార్థములకు; క్రమేణ=అదే క్రమముతో: సమన్వయః = చక్కని పొందికయే: యథా సంఖ్యమ్=యథా సంఖ్యాలంకారము(అగును). శత్రుమ్= శత్రువును: మిత్రమ్=స్నేహితుని; విపత్తిం+చ=ఆపదను: జయ= జయించుము; రఞ్జయ=రంజింపజేయుము; భఞ్జయ = భంగపఱ చుము (తొలఁగజేయుము).

## 51. పర్యాయాలంకారము

తే॥ గీ॥ అరయఁ బర్యాయమున ననేకాశ్రయత్వ
మొకటికే జెప్ప పర్యాయ మొప్పు కృతుల
తరుణీ ముఖసామ్య మొప్పగు తమ్మి వీడి
కుముద బాంధవుఁ జేరెను గుదురుకొనఁగ. 103

ఒక్కదానికే క్రమముగా అనేకముల నాశ్రయించి యుండు టను చెప్పిన నది పర్యాయాలంకార మగును. ఇట పర్యాయ మను టచే నొక ఆశ్రయమును వదిలిన పిమ్మట మఱియొకదానిని ఆశ్ర యించుట, దానిని వీడిన తరువాత వేఱొకదాని నాశ్రయించుట అనునిట్టి క్రమమని గుర్తింపవలెను.

ఉదా :- తరుణీ ముఖసామ్యము ముందు పద్మమును విడిచి చం ద్రుని చేరెను.

ఇట తరుణీ ముఖసామ్యము ముందు పద్మమును చేరి, పిమ్మట దానిని వీడి చంద్రుని చేరెననుటలో ఆధేయమగు ముఖ సామ్య మొక్కటే పద్మ-చంద్రరూపములుగ నున్న పెక్కు ఆధార ముల నాశ్రయించినట్లు చెప్పబడుటచే నిది పర్యాయాలంకారము నకు లక్ష్యమగు చున్నది.

సం॥ పర్యాయో యది పర్యాయేణైకస్యానేక సంశ్రయః,
పద్మం ముక్త్వా గతా చంద్రం కామినీ వదనోపమా.

పర్యాయేణ=ఒకదాని వీడి మఱియొకదాని జేరు క్రమమును బట్టి; ఏకస్య=ఒక్కదానికే; అనేక+సంశ్రయః=అనేకములగు నాధారముల నాశ్రయించుట; (వర్ణితమ్) యది=(వర్ణింపబడినది) ఐన యెడల; పర్యాయః=పర్యాయాలంకారము(అగును). కామినీ+వదన+ఉపమా=కాంతయొక్క; ముఖముయొక్క; పోలిక; పద్మమ్=కమలమును; ముక్త్వా=విడిచి; చంద్రమ్=చంద్రుని; గతా=చేరినది.

ద్వితీయ భేదము :-

తే॥ గీ॥ అన్యపర్యాయమై కృతి నలరు, నొకటఁ (దీనిని
గడఁటి పర్యాయమున ననేకంబు) జెప్ప
ఎచట మును నీరు ప్రవహించె నచట నేఁడు
ఇసుక తిన్నెయె రమ్యమై పొసఁగు సుమ్ము. 104

ఒక ఆధారమునందే పర్యాయమున ననేకమున్నట్లు చెప్పిన యెడల అదియును మఱియొక పర్యాయాలంకార మగును.

ఉదా :- మునుపెచ్చట నీరు ప్రవహించెనో నేఁడచట ఇసుకతిన్నెయే శోభించుచున్నది.

ఇంతకు మునుపు అనగా వర్షాకాలమున నీరు ప్రవహించిన చోట నేఁడు ఇసుకతిన్నెయే రమ్యముగ నున్నదని ఒకే అధారమైన ప్రదేశము ఒకప్పుడు నీటికి, నేఁడు ఇసుకతిన్నెకును ఆశ్రయమైనట్లు పర్యాయమున చెప్పబడుటచే నిది ద్వితీయ పర్యాయాలంకారమునకు లక్ష్యముగ నున్నది.

శ్లో॥ ఏకస్మిన్యద్యనేకం వా పర్యాయః సోఽపి సమ్మతః,
అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురాజని.

ఏకస్మిన్=ఒక ఆధారమునందు; అనేకం+వా=అనేకముగాని; (వర్ణితమ్) యది=(చెప్పబడిన) యెడల; సః+అపి=అది కూడ;

పర్యాయః=పర్యాయాలంకారముగ; సమ్మతః=(బుధులకు)సమ్మతమైనది. పురా=పూర్వము; యత్ర=ఎచ్చట; స్రోతః=జల ప్రవాహము; అజని = పుట్టెనో (ఉండెనో): తత్ర=అచ్చట: అధునా=ఇప్పుడు: పులినమ్=ఇసుకతిన్నె: (అజని=ఉండెను).

## 52. పరివృత్త్యలంకారము

తే॥ గీ॥ వెలయ న్యూనాధి కాన్యోన్య వినిమయంబు
తనరు పరివృత్త్యలంకార మనఁగఁ గృతుల
అధిపుఁ డమ్మొక్కటేసి యత్యధికమైన
శత్రు లక్ష్మీకటాక్షముల్ సంగ్రహించె. 105

అల్పాధికములకు అన్యోన్యము వినిమయమును వర్ణించిన యెడల పరివృత్త్యలంకార మగును. వినిమయ మనగా రెండు వస్తువులను మార్చుకొనుట. ఒక వస్తువిచ్చి దానికి బదులు వేఱొక వస్తువును గైకొనుట. ఆ వస్తువులలో నొకటి చిన్నదై మఱియొకటి గొప్పదై యుండి వినిమయము జరిగినపుడే పరివృత్త్యలంకార మగును.

ఉదా :- రాజు ఒక్క బాణమును ప్రయోగించి శత్రురాజ లక్ష్మీ కటాక్షములను సంగ్రహించె. అనగా ఈ రాజొక బాణము వేయగానే శత్రువులు పారిపోవుట, శత్రురాజ సంపద అంతయు జయించిన రాజునకు అధీన మయ్యెనని భావము.

ఇట రాజు ఇచ్చినదల్పము. గ్రహించినది అధికము. అల్పాధిక వస్తువుల వినిమయము జరిగినట్లు వర్ణించుటచే నిది పరివృత్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యధికయోర్మిథః,
జగ్రాహైకం శరం ముక్త్వా కటాక్షాన్స రిపుశ్రియమ్.

న్యూన+అభ్యధికయోః=అల్పము, అధికము అగు రెండు

వస్తువులకు; మిథః=పరస్పరము; వినిమయః=మార్పు (జరుగుట); పరివృత్తిః=పరివృత్త్యలంకారము(అగును). ఏకమ్=ఒక; శరమ్=బాణమును; ముక్త్వా=విడిచి (ప్రయోగించి, ఇచ్చి); సః=ఆ రాజు; రిపుశ్రియః=శత్రువుల రాజలక్ష్మి యొక్క; కటాక్షాన్=కటాక్షములను; జగ్రాహ=గ్రహించెను.

## 53. పరిసంఖ్యాలంకారము

తే॥ గీ॥ ఒక్కచోటను ద్రోసి వేఱొకట వస్తు
యంత్రణము సేయ పరిసంఖ్య యనఁగఁ దనరు
ఆ ప్రదీపములందె స్నేహక్షయంబు,
లేదు కామినీ స్వాంతంబు లందు నరయ. 106

ఒక వస్తువును ఒకచోట నిషేధించి మఱియొకచోట యంత్రణము (నియమనము) చెప్పిన యెడలఁ బరిసంఖ్యాలంకార మగును. అనఁగా ఒకదానిని ఒకచోట లేదనిచెప్పి (నిషేధించి) వేఱొకచోట ఉండునని చెప్పు (విధించు) ట పరిసంఖ్యాలంకారమని యర్థము. పరిత్యజ్య సంఖ్యానమ్ పరిసంఖ్యా [ఒకచో విడిచి వేరొకచోట గణించుట (నిలుపుట అని ఇట గ్రాహ్యము)] అని దీనికి సార్థక్యమును కూడ చెప్పుదురు.

ఉదా :- స్నేహక్షయము ప్రదీపములందే గాని కామినీ స్వాంతము లందు లేదు.

స్నేహ మన నూనె మొదలగు స్నిగ్ధద్రవ్యము, అనురాగము అనియు నర్థము. స్నేహశబ్దమునకు గల అర్థభేదమును బట్టి స్నేహక్షయము (నూనె తగ్గుట) ప్రదీపములందే కన్పించుచున్నది. దీపములు వెలుగుచున్న కొలఁది అందలి స్నేహము (నూనె) క్షయమగుచుండును. ఇది లోకసహజము. ఈ స్నేహ (అనురాగ) క్షయము కామినీ స్వాంతములందు లేదు.

నాయకులకై రాత్రి అంతయు నిరీక్షించిన నాయికలకు సంబంధించు నదీ వాక్యము. వియోగముచే ప్రేమ పరిపుష్టమగుట సహజము. కావున నాయక నిరీక్షణము చేయు నాయికలకు ప్రేమ పెరుగునే గాని క్షయము గనదు.

ఇట స్నేహక్షయమును కామినీ హృదయములందు నిషేధించుట, ప్రదీపములందు నియమించుట స్పష్టమగుచున్నది. కాన నిది పరిసంఖ్యాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ పరిసంఖ్యా నిషిధ్యైక మేకస్మిన్ వస్తు యన్త్రణమ్,
స్నేహక్షయః ప్రదీపేషు న స్వాన్తేషు నతభ్రువామ్.

ఏకమ్=ఒక వస్తువును; ఏకస్మిన్=ఒకచోట; నిషిధ్య=నిషేధించి (లేదని చెప్పి); (వేఱొకచోట) యన్త్రణమ్=నియమించుట; పరిసంఖ్యా = పరిసంఖ్యాలంకారము (అగును). ప్రదీపేషు=ప్రకృష్టములగు దీపములందు; స్నేహక్షయః=స్నేహక్షయము; (నూనె క్షీణించుట) (ఉన్నది). నతభ్రువామ్=కామినులయొక్క; స్వాన్తేషు=హృదయములందు; స్నేహక్షయః=స్నేహక్షయము (అనురాగము తగ్గుట); న=లేదు.

## 54. వికల్పాలంకారము

తే॥ గీ॥ తుల్యబల విరోధం బది తోఁచె నేని
కృతి వికల్ప నామం బయ్యె నతిశయించు
ధరణి పతులార మీ దలు శిరములైన
చాపముల నైన వంచుఁడీ సమర మందు. 107

తుల్యమగు బలము గలవారికి విరోధము కలుగఁ జెప్పిన యెడల వికల్పాలంకార మగును. తుల్యబల విరోధ మనగా సమానమగు ప్రాధాన్యము గల రెండు పనులలో ఏదో ఒకటి మాత్రమే చేయుటకు అవకాశ మేర్పడుటయే. ఈ పని యైన యెడల ఆ పని

కాదు. ఆ పని యైన యెడల నీపని కాదు. ఇట్లు తుల్యబలము గల వానికి విరోధ మేర్పడును.

ఉదా :- ఓ రాజులార! మీరీ సమరమున శిరములనైనను, చాపము లనైనను వంచుడీ!

ఇచట శిరోనమనము, చాపనమనములు రెండును ఒక్కసారే చేయుట కశక్యమై తటస్థపడినవి. కావున అందేదో ఒకటి మాత్రమే చేయవలెనని చెప్పబడినందుచే నిది వికల్పాలంకారమునకు లక్ష్య మగుచున్నది.

సం॥ విరోధే తుల్యబలయో ర్వికల్పాల ఙ్కృతిర్మతా,
సద్యః శిరాంసి చాపాన్వా నమయన్తు మహీభుజః.

తుల్యబలయోః = సమాన ప్రాధాన్యముగల రెండింటికి; విరోధే+(సతి) = విరోధము కలుగగా: వికల్పాలంకృతిః=వికల్ప మను నలంకారము; మతా=అంగీకృతమైనది. హే మహీభుజః=ఓ రాజులారా!: శిరాంసి=శిరస్సులనో: వా=లేక: చాపాన్=ధనుస్సు లనో; సద్యః=వెంటనే; నమయన్తు=వంచెదరుగాక.

## 55. సముచ్చయాలంకారము

తే॥ గీ॥ యౌగపద్యా న్వితానేకయోగ మలర
చెప్పెనేని సముచ్చయం బొప్పు గృతుల
వెఱచుచుందురు, చత్తురు, పఱచుచుంద్రు
యుద్ధమున నీదు శాత్రవు లుర్వినాథ! 108

యుగపద్భావమును పొందినట్టి యనేకముల నొకచోట గూర్చెనేని సముచ్చయాలంకార మగును. యౌగపద్యమన యుగ పద్భావము=ఏకకాలమందు జరుగుట. ఏకకాలమునందు జరుగ వలసియుండు ననేకకార్యముల యోగమే (కూర్పుటయే) సము చ్చయాలంకార మగును.

ఉదా :- ఓ రాజా! నీ శత్రువులు యుద్ధమునందు వెఱచుచుందురు.
చత్తురు. పాఱిపోవుదురు.

ఇట "యుద్ధమందు ప్రస్తుత రాజును గూర్చి శత్రువులు వెఱచుచుందురు. చత్తురు. పాఱిపోవుదురు." అని శత్రువులందు యుగపద్భావముతో కూడిన అనేకాంశముల గూర్చుటచే నిది సముచ్చయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ బహూనాం యుగపద్భావ భాజాం గుమ్ఫః సముచ్చయః,
నశ్యన్తి పశ్చాత్పశ్యన్తి త్రస్యన్తి చ భవద్విషః.

యుగపత్+భావ+భాజామ్ = యౌగపద్యమును పొందిన; బహూనామ్=పెక్కింటియొక్క; గుమ్ఫః=కూర్పు: సముచ్చయః= సముచ్చయాలంకారము (అగును). (ఓ రాజా!) భవత్+ద్విషః= తమ శత్రువులు; నశ్యన్తి=చత్తురు; పశ్చాత్+పశ్యన్తి=వెనుదిరిగి చూతురు; త్రస్యన్తి+చ=భయపడుదురు కూడ.

ద్వితీయ భేదము :-

తే॥ గీ॥ అహమహమికఁ ననేకంబు లంచితముగ
ఏకకార్యాన్వయంబుతో నెసఁగ నొండు
కులము, రూపంబు, వయువంబు, కూర్చు విద్య,
ధనము మదము సేయు నవని జనుల కెంతొ. 109

నేను ముందు, నేను ముందు అను భావముగల యనేకములు ఒక్క కార్యమునందు అన్వయించునటుల చెప్పిన యెడల వేఱొక సముచ్చయాలంకారమగును. ఒక కారణముచే కార్యసాధన కుపక్రమింప అన్యములుకూడ ననేకములు అహం ప్రాథమిక భావముతో •ఖలేకపోతన్యాయమున తత్కార్యసిద్ధి నొనర్చినను సముచ్చయాలంకారమే యగును.

---

• గింజలకై కళ్ళములో దిగి వలలో జిక్కి ప్రాణరక్షణకై అన్నియు నొక్కటై వలతో నెగిరిపోయి ప్రాణముల రక్షించు కొనిన రీతి.

ఉదా :- కులము, రూపము, యౌవనము, విద్య, ధనము అనునవి
జనులకెంతో మదము (గర్వము) ను కల్గించును.

ఇట ఆభిజాత్యము (సత్కులమున పుట్టుట) ఒక్కటే గర్వమునకు కారణమగును. కాఁగా అట్టివే అగు రూప, యౌవ్వనాదులు కూడ తత్కారణములుగ చెప్పఁబడినందువలన ఇది ద్వితీయ సముచ్చయాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ అహం ప్రాథమికాభాజా మేకకార్యాన్వయేऽపి సః,
కులం రూపం వయో విద్యా ధనం చ మదయ న్త్యమమ్.

అహం+ప్రాథమికా+భాజామ్=నేను ప్రాథమికుఁడ (ప్రథముఁడ) నను భావముగల పెక్కింటికి: ఏక+కార్య+అన్వయే+(సతి)+అపి=ఒక్క, కార్యమునందు, అన్వయము, చెప్పఁబడినప్పటికిని: సః=అ సముచ్చయాలంకారమే (అగును). కులమ్=సత్కులజననము: రూపమ్=సుందరాకారము: వయః=యౌవనము: విద్యా=చదువు: ధనం+చ=ధనమున్ను; అముమ్=ఇతనిని (ఈ నరుని); మదయన్తి=గర్వింపఁజేయుచున్నవి.

## 56. కారకదీపకాలంకారము

తే॥ గీ॥ కోరి క్రమికైక గతముల కూర్పు సేయ
కృతుల కారకదీపకం బతిశయించు
పాంథుఁ డేగును, వచ్చును, పరఁగఁ జూచు
శొంకు, తగ మార్గ మడుగును జంకు వీడి. 110

క్రమికములు అనఁగా ఏకకారక గతక్రియలు. ఒకే కర్త యొనర్చెడు పెక్కు క్రియలు. అట్టి క్రియలను పెక్కింటిని కూర్చి చెప్పినేని అవి కారకదీపకాలంకార మగును.

ఉదా :- పాంథుఁడు ఏగును. తిరిగి వచ్చును. పరఁగఁ జూచును.
సందేహించును. జంకు విడిచి తగు మార్గ మడుగును.

ఇట పాంథుఁడు అనునది ఒక్కటే కర్తృకారకము. ఈ యొక్క కారకమునకు గమన-ఆగమనాద్యనేక వ్యాపార్యర్థములతో అన్వయ ముండుటచే నిది కారకదీపకాలంకార మగుచున్నది. ఇట ఒక్క కారకమే అనేక క్రియలను దీపింపజేయుటనుబట్టి దీని కి నామము సార్థకమగుచున్నది. ఇందు క్రియలన్నియు ఒక క్రమమును (ఒకదాని తరువాత నొకటి జరుగు పద్ధతిని) బట్టి జరిగినట్లు చెప్పబడినది. కావున నిది క్రియా యౌగపద్యప్రాప్తి ముఖ్యముగ నుండు సముచ్చయము కాజాలదు. సముచ్చయము నందు క్రియలకు యౌగపద్యప్రాప్తి, కారకదీపకమున క్రియలకు క్రమప్రాప్తి యుండుట గమనింపదగు భేదము.

సం॥ క్రమికైకగతానం తు గుమ్ఫః కారకదీపకమ్,
గచ్ఛత్యాగచ్ఛతి పునః పాన్థః పశ్యతి పృచ్ఛతి.

క్రమిక+ఏకగతానామ్=క్రమాగతములగుచు, ఒకదాని నాశ్రయించి అన్వయించు క్రియలయొక్క; గుమ్ఫః=కూర్పు; కారకదీపకమ్ = కారకదీపకాలంకారము (అగును). పాన్థః=పథికుఁడు (బాటసారి); గచ్ఛతి=వెళ్లును; పునః=తిరిగి; ఆగచ్ఛతి=వెనుకకు వచ్చును; పశ్యతి=చూచును; పృచ్ఛతి=అడుగును.

## 57. సమాధ్యలంకారము

తే॥ గీ॥ కారణాన్తర సన్నిధిన్ కార్యలబ్ధి
కానుకూల్య మొప్ప సమాధి యలరుచుండు
అతివ పోవుతంత కాఁగ నా యర్కుఁ డొదిగె
సంధ్య మెసఁగంగఁ జీఁకటి వ్యాప్తమయ్యె. 111

ఇతర కారణముయొక్క సాన్నిధ్యము వలన అభీష్టకార్యలాభమునకు సౌకర్యము (సౌలభ్యము-అనుకూల్యము) ఏర్పడిన యెడల సమాధ్యలంకార మగును.

ఉదా :- కాంత నాయక సమీపమున కేగ ఉత్కంఠ (ఇష్టవస్తు ప్రాప్తికగు వేగిరపాటు) కలది కాఁగా అర్కుఁడస్తమిం చెను. అంధ్యము (అంధత్వము) ను కల్గించుచు చీఁకటి వ్యాపించెను.

కాంత కాంతుని జేరబోవుటలో ఉత్కంఠయే పుష్కల కారణ మగుచుండ విధివశమున సూర్యుఁడస్తమించుట; అంధకార వ్యాప్తి యు ఇష్టలాభమున కనుకూలమైనందువలన నిది సమాధ్యలంకారము నకు లక్ష్యమగుచున్నది.

ఇది రెండవ సముచ్చయమునకు ప్రతిద్వంద్వి. సముచ్చ యమందు కారణములు అన్నియు అహం ప్రాథమికా భావము కలిగి సమప్రధానములై ఖలేకపోతన్యాయమున ఒక్కసారిగా కార్య సాధనములగును. సమాధియందు ఒక్క ముఖ్యకారణమే కార్య సాధనకు చాలియుండగా కారణాంతరము •కాకతాళీయన్యాయమున సంభవించి కార్యసౌకర్యజనకముగా సహకరించును.

సం॥ సమాధిః కార్యసౌకర్యం కారణాన్తర సన్నిధేః,
ఉత్కణ్ఠితా చ తరుణీ జగామాస్తం చ భానుమాన్.

(కారణ+అంతర) సన్నిధేః=అన్యకారణముయొక్క, సాన్ని ధ్యమువలన; కార్య+సౌకర్యమ్=కార్యము సులభమగుట (జరిగిన యెడల); సమాధిః=సమాధ్యలంకార మగును. తరుణీ+చ=యువ తియు; ఉత్కణ్ఠితా=ఇష్టప్రాప్తి కారాటపడుచున్నది; భానుమాన్+ చ=సూర్యుఁడును; అస్తం+జగామ=అస్తమించెను.

---

• కాకి వచ్చి చెట్టునగల తాటిపండుపై వ్రాలుట, పండిన ఆ తాటి పండు వెంటనే రాలుట, కాకి దానిని సుఖముగ ఆస్వాదించుట జరిగిన విధముగా.

## 58. ప్రత్యనీకాలంకారము

తే॥ గీ॥ ప్రబల శాత్రవ మిత్రునిఁ బరిభవింప
ప్రత్యనీకం బలంకృతి పరఁగుఁ గృతుల
జైత్రనయనానుగాములౌ శ్రవణములను
ఉత్పలంబు లధఃకృతి నొప్పఁ గాంచె. 112

ప్రబలమగు శత్రువుయొక్క మిత్రుని తన పరాక్రమముచే పరాభవించుట ప్రత్యనీకాలంకార మగును.

ఉదా :- ఉత్పలములు తమను జయించిన నేత్రములను అనుసరించు శ్రవణము (చెవు) లను అధఃకరించి యొప్పెను.

ఇట నేత్రములు - వైశాల్యసౌందర్యాదులచే ఉత్పలము (కలువ)లను జయింపఁగా, నా కలువలు ఆ నేత్రములను జయింప లేక వాని ననుసరించు శ్రవణములను అధఃకరించి (క్రిందుచేసి లేక తిరస్కరించి) ఒప్పినవి. ఇట్లనుటచే కర్ణభూషణములగు కలువలు కర్ణములపై నుండుటచే ఆ కర్ణములు అధఃకృతములు (కలువల కంటె క్రిందనున్నవిగ చేయబడినవి) కాఁగా కర్ణముల పై నుండుట మూలమున ఉత్పలములు తమ శత్రువుయొక్క మిత్రుఁను పరిభవించి, ఒప్పు గాంచినట్లు వర్ణింపబడినది. కావున నిది ప్రత్యనీకాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ప్రత్యనీకం బలవతః శత్రోః పక్షే పరాక్రమః,
జైత్రనేత్రానుగౌ కర్ణావుత్పలాభ్యామధః కృతౌ.

బలవతః=బలముగల; శత్రోః=శత్రువుయొక్క; పక్షే=పక్షమున అంతర్గతమైయున్న వానియందు, పరాక్రమః=విక్రమము; (వర్ణింపబడిన యెడల) ప్రత్యనీకమ్ = ప్రత్యనీకమను నలంకారమగును. ఉత్పలాభ్యామ్=రెండు నల్లగలువలచే; జైత్ర+నేత్ర+అనుగౌ=విజయశీలములైన, నయనముల, ననుసరించునట్టి; కర్ణౌ=

రెండు చెవులు: అధఃకృతౌ=క్రిందు చేయబడినవి (తమక్రింద నుంచబడినవి).

## 59. అర్థాపత్త్యలంకారము

తే॥ గీ॥ "కిముత" యను న్యాయమున నర్థ మమరె నేని
కావ్యమందు నర్థాపత్తి గాలుచుండు
చెలువ! నీ ముఖ మవ్విధున్ గెలిచె ననఁగ
పంకజంబుల వార్తయుఁ బలుక వలెనె? 113

"కిముత" అను న్యాయము లేక కైముతిక న్యాయము లేక దండాపూపికా న్యాయము, "మహాగజా? పలాయన్తే మశకానాం తుకా కథా" అను న్యాయములు దాదాపు సమానభావమునే తెలుపఁ జాలినవి. కిముత యనగా ఏమి చెప్పవలెను? ఏమియు జెప్పనక్కఱ లేదు. చెప్పకున్నను ఆ విషయము స్పష్టముగా తెలియునని భావము. అట్లే ఎలుకలు దండమునే తినివేసినవి అని చెప్పినపుడు దండమునకు గుచ్చిన అపూపములను కూడ తిన్నవని వేఱుగ చెప్పకుండ తెలియునను భావ మిచ్చుట గ్రాహ్యమగును.

ఇట్టి "కిముత" న్యాయముతో అర్థ మమరియుండునట్లు చెప్పిన యెడల అది కావ్యార్థాపత్త్యలంకార మగును. ఇట కావ్యార్థాపత్తి అనుటచే నిది తాంత్రికుల అర్థాపత్తి కా జాలదని తెల్పినట్లైనది.

ఉదా :- ఓ చెలి! నీముఖము ఆ విధునే (చంద్రునే) జయించినది అనిన పద్మముల వార్త వేఱుఁగ చెప్పవలెనా ? చెప్పనక్కఱ లేదని భావము.

ఇట ఆ విధుఁడన పద్మములను జయించిన చంద్రుఁడని వివక్షితమగు (చెప్పగోరిన) అర్థము. కాఁగా అట్టి చంద్రునే చెలి ముఖము జయింపఁగా ఆ ముఖము పద్మములనుకూడా జయించిన దని చెప్పవలయునా? చెప్పకున్నను పద్మములను జయించిన విష

యము సిద్ధించుచున్నదని భావము ఇట్లు ఇచట కైముతికన్యాయముచే అర్థసిద్ధి కల్గుటచే నిది కావ్యార్థాపత్త్యలంకార మగుచున్నది.

సం॥ కైముత్యేనార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే,
స జిత స్త్వన్ముఖేనేన్దుః కా వార్తా సరసీరుహామ్.

కైముత్యేన=కైముతికన్యాయముచే; అర్థసంసిద్ధిః=అభీష్టార్థప్రాప్తి; కావ్యార్థపత్తిః=కావ్యములందలి అర్థాపత్త్యలంకారముగా; ఇష్యతే=(విద్వాంసులచే) కోరబడుచున్నది. త్వత్+ముఖేన=నీయొక్క, ముఖముచే; సః=ప్రసిద్ధుడగు; ఇన్దుః=చంద్రుడే; జితః = జయింపబడినాడు; సరసీరుహామ్=పద్మములయొక్క; వార్తా=విషయము; కా=ఏమి (చెప్పవలయును.) చెప్పనక్కఱ లేదని భావము.

## 60 కావ్యలింగాలంకారము

తే॥ గీ॥ అల సమర్థనీయార్థ సమర్థనంబె
కావ్యలింగాఖ్య మౌ నలంకార మొప్పు
చిత్తజా! నీవు నాచేత జితుఁడ వైతి,
త్రినయనుండు నా హృదయావ స్థిరత నుండె. 114

సమర్థనము నపేక్షించు విషయమును సమర్థించుటను వర్ణించిన యెడల కావ్యలింగాలంకార మగును.

ఉదా :- ఓ చిత్తజా! నీవు నాచే జితుఁడ వైనావు. నా హృదయమందు త్రినయనుండు (ఈశ్వరుఁడు) స్థిరముగా నుండెను.

ఇట మన్మథ జయమను విషయము దుష్కరమై సమర్థనమును అపేక్షించుచున్నది. దానికి "నాచిత్తమున త్రిలోచనుఁడు న్నాఁడ"ని స్వాంతఃకరుణ మందలి శివసాన్నిధ్యమును ప్రదర్శించి సమర్థనము చేయబడినది. కావున నిది కావ్యలింగాకారమునకు లక్ష్య మగుచున్నది. వ్యాప్తిధర్మతాది సాపేక్షమై నైయాయికులకు అభి

మతమగు "లింగ" వ్యావర్తనము (వెనుకకుమరల్చుట) కొఱకు కావ్యలింగమని పేర్కొనబడినది. ఇది వాక్యార్థ హేతుకమైన కావ్య లింగాలంకారము.

సం॥ సమర్థనీయస్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్,
జితోఽసి మన్దకన్దర్ప! మచ్చిత్తేఽస్తి త్రిలోచనః.

సమర్థనీయస్య=సమర్థింపదగిన; (సమర్థనము నపేక్షించు చున్న) అర్థస్య=అర్థముయొక్క; సమర్థనమ్=సమర్థనమే; కావ్య లిఙ్గమ్=కావ్యలింగాలంకార మగును. మన్ద+కందర్ప!=చలనము లేక జడుఁడవైన ఓ మన్మథుఁడా! జితః+అసి=(నాచే) జితుడవైయు చున్నావు. మత్+చిత్తే = నా హృదయమందు; త్రిలోచనః = ముక్కంటి యగు శివుఁడు; అస్తి=కలఁడు.

## 61. అర్థాన్తరన్యాసాలంకారము

తే॥ గీ॥ సరవి సామాన్యమును విశేషంబు నమరఁ
జెప్ప నర్థాన్తరన్యాస మొప్పు గృతుల
అంజనేయుఁడు సాగర మధిగమించె
నరయ దుష్కరం బేది మహాత్ములకును. 115

తే॥ గీ॥ సుగుణవస్తు సంసర్గాన స్వల్పవస్తు
వధిక గౌరవంబును పొంద నన్య మదియె
పుష్పమాలానుషంగంబు పొసఁగుచుండ
నల్పసూత్రంబు శిరమునఁ దాల్పఁబడును. 116

సామాన్య-విశేష విషయములను చెప్పిన యెడల నర్థాంతర న్యాసాలంకార మగును. అందొకటి ప్రకృతవిషయము. వేఱొకటి అప్రకృతవిషయముగ నుండును. కావున ప్రస్తుతమగు విశేషముతో అప్రకృతమగు సామాన్యవిషయమును గాని, ప్రకృతమగు సామాన్యవిషయముతో అప్రస్తుతమగు విశేషవిషయమును గాని చేర్చి చెప్పిన యెడల నర్థాంతరన్యాస మగును.

అందు మొదటిదానికి ఉదా :- ఆంజనేయుఁడు సాగరమును దాటెను!
మహాత్ములకు దుష్కరము ఉండదు
గదా !

"ఇట ఆంజనేయుఁడు సాగరమును దాటెను" అనునది విశేష విషయము. "మహాత్ములకు దుష్కరమైన దుండదు గదా!" అనునది సామాన్యవిషయము. ఇట విశేషవిషయము సామాన్యవిషయముచే సమర్థింపఁబడినది. కాన నిది అర్థాంతరన్యాస మగును.

ద్వితీయ భేదము :-

ఉదా :- సుగుణములుగల వస్తువుతోడి సంసర్గము (కలయిక) చే నల్పవస్తువుకూడ అధికగౌరవమును పొందును. పుష్పమాల యొక్క సంబంధముచే సూత్రము (దారము) కూడ తలఁదాల్పబడుచున్నది.

ఇట "గుణవంతమగు వస్తువుయొక్క సంసర్గముచే నల్ప వస్తువు కూడ అధిక గౌరవమును పొందును" అను సామాన్యవిషయము, పుష్పమాల యొక్క సంబంధముచే శిరస్సున ధరింపఁబడుట అను గౌరవమును పొందుచున్నదను విశేషవిషయముచే సమర్థింపబడుచున్నది. కావున నిది అర్థాంతరన్యాసమునకు లక్ష్యమగుచున్నది.

సమర్థ్య సమర్థకములకు సామాన్య విశేషసంబంధమున్నచో నర్థాంతరన్యాసమును, తదితర సంబంధమున్నపుడు కావ్యలింగాలంకారమను వ్యవస్థ (శాస్త్ర నిరూపిత నియమము) నిశ్చయింపబడినది.

సం॥ ఉక్తి రర్థాన్తరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః,
హనూమా నబ్ధి మతర ద్దుష్కరం కిం మహాత్మనామ్.
గుణవద్వస్తు సంసర్గా ద్యాతి స్వల్పోఽపి గౌరవమ్,
పుష్పమాలానుషఙ్గేణ సూత్రం శిరసి ధార్యతే.

సామాన్య-విశేషయోః=సామాన్యమగు నర్థము యొక్కయు, విశేషమగు నర్థము యొక్కయు; ఉక్తిః=చెప్పుటః (అర్థ+అన్తర) +న్యాసః=అర్థాన్తరన్యాస మను నలంకారము; స్యాత్=అగును. హనూమాన్=హనుమంతుడు; అబ్ధిమ్=సముద్రమును; అతరత్= తరించెను (దాటెను). మహత్ (మహా)+ఆత్మానామ్=మహానుభావు లకు; దుష్కరమ్=చేయశక్యముగానిది; కిమ్=ఏమి: స్యాత్?= ఉండును ?

గుణవత్+వస్తు+సంసర్గాత్ = సుగుణములుగల, వస్తువు యొక్క, కలయికవలన; స్వల్పః+అపి=అల్పమైన వస్తువు ఐనను; గౌరవమ్=గౌరవమును; యాతి=పొందును. పుష్ప+మాలా+అను షఙ్గేణ = పూలమాలతో నగు సంబంధముచే; సూత్రమ్=దారము; శిరసి=తలపై; ధ్రియతే=ధరింపబడుచున్నది.

## 62. వికస్వరాలంకారము

తే॥ గీ॥ స్థిత విశేష-సామాన్య-విశేష రచనఁ
ద్రగమసమర్థనం బౌను వికస్వరంబు
అన్యజితుఁడు గాఁడా నృపుం డల మహాత్ము
లమిత దుర్ధర్షు లౌ సాగరముల వోలె. 117

ఒకానొక విశేషమును సమర్థించుటకై సామాన్యమును చెప్పి, ఆ సామాన్యము ప్రసిద్ధమే ఐనను అంతటితో సంతృప్తి వడక ఆ సామాన్యమును సమర్థింప తిరిగి మఱియొక విశేషము ఉపమాన మూలముననో, అర్థాంతరన్యాసమూలముననో చెప్పిన యెడల నది వికస్వరాలంకారము అగును.

ఉదా :- ఆ రాజు పరులచే జితుఁడుగాడు. మహాత్ములు సాగరముల వలె దుర్ధర్షులు (దురాక్రమణ చేయశక్యము కానివారు) గదా !

ఇట రాజు పరులచే జితుఁడు కాఁడు అనునది విశేషము. మహాత్ములు దుర్ధర్షులు అనునది సామాన్యము. సాగరములవలె అనునది ఉపమాన పద్ధతిలో గూర్చిన మఱియొక విశేషము. ఇట్లు ఇచట మొదట విశేషమును, పిదప దానిని సమర్థించు నొక సామాన్యమును, తరువాత ఆసామాన్యమును సమర్థించుటకు వేఱొక విశేషమును క్రమముగాఁ గూర్పు చేయుటచే నిది వికస్వరాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

మహాత్ముల అనాక్రమణీయత (ఇతరులచే ఆక్రమింప శక్యమైనవాఁడు కాకుండుట) అతిప్రసిద్ధమగుటచే తత్సమర్థనాపేక్ష కలుగదు. కాన చంద్రాలోకగతమగు ఉదాహరణము సముచితము కాదని దీక్షితుఁ డిచ్చిన ఉదాహరణము.

తే॥ గీ॥ ఇల ననంతరత్నా స్పదత హైమగిరికి
హిమము సౌభాగ్యహారియై యమరదెపుడు
దోషమొకటి యున్న గుణసందోహమందు
మగ్నమౌ నిందు కిరణాల మచ్చ పగిది. 118

ఇట అనన్తరత్నసహితుఁడగు హిమవంతునకు హిమము (మంచు) సౌభాగ్యహారి కాదు. ఒక దోషమున్నను అది గుణసమూహమందు లీనమైపోవును. చంద్రకిరణములందు మచ్చ మునిగిపోయినట్లు అని చెప్పుటలో హిమము సౌభాగ్యహారి కాదు అనునది విశేషము. ఏదేని దోషమొకటి ఉన్నను అది గుణసముదాయమందు మునిగిపోయి కన్పించదు. విశేషమును సామాన్యముచే సమర్థించియు, తృప్తిపడక, ఆ సామాన్యమును ఇందుకిరణములందు మచ్చ పగిది అను ఉపమానమూలమగు విశేషముతో సమర్థించుచు చెప్పినందువలన నిది వికస్వరాలంకారమునకు తగిన లక్ష్యమగుచున్నది.

సం॥ యస్మిన్ విశేషసామాన్య విశేషాః స వికస్వరః
స న జిగ్యే మహాన్తో హి దుర్ధర్షా సాగారా ఇవ.

యస్మిన్=దేనియందు; విశేష+సామాన్య+విశేషాః=విశేషము, సామాన్యము, విశేషము (క్రమ సమర్థనముతో చెప్పబడిన యెడల); సః=అది; వికస్వరః=వికస్వరాలంకారము (అగును). సః=ఆ ప్రసిద్ధుఁడగు రాజు; న+జిగ్యే = జయింపబడినవాఁడు కానేరఁడు. మహాత్మానః=మహాత్ములు; సాగరాః+ఇవ=సముద్రముల వలె; దుర్ధర్షాః+హి=అతిక్రమింప శక్యముకానివారు గదా!

## 63. ప్రౌఢోక్త్యలంకారము

తే॥ గీ॥ కారణము కాని దాని నుత్కర్షహేతు
వనఁగఁ బ్రౌఢోక్తి నాఁ గృతి నలరుచుండు
తరుణి కచముల్ కళిందజా తటతమాల
మేచకంబులై నిరతంబు మెఱయుచుండు. 119

వస్తువుయొక్క ఉత్కర్షకు హేతువు కానిదాని నుత్కర్షహేతువుగఁ జెప్పుట ప్రౌఢోక్త్యలంకార మగును.

ఉదా:- తరుణి కచములు యమునానదీ తట తమాల వృక్షముల వలె శ్యామములు.

ఇట తమాలవృక్షమన చీఁకటిచెట్టు. ఇది సహజముగనే నల్లనిది. యమునాజలముకూడ నల్లగనే ఉండును. చీకటిచెట్టుయొక్క నల్లదనము అతిశయించుటకు యమునా తీరస్థమగుట కారణము కాదు. ఐనను నల్లనివస్తు సామీప్యముచే సమీపమున నుండు వస్తువు కూడ నల్లనగునను యుక్తి నాధారముగా గొని నల్లని యమునా నదీ తటస్థిత తమాలములని తమాలనీలత్వోత్కర్షకు కారణము గాని యమునానదీ తీరస్థత్వమును కారణముగా గల్పించి చెప్పుటచే నిది ప్రౌఢోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ప్రౌఢోక్తి రుత్కర్షాహేతౌ తద్ధేతుత్వప్రకల్పనమ్,
కచాః కళిన్దజాతీరతమాల స్తోమమేచకాః

ఉత్కర్ష+అహేతే=ఉత్కర్షకు, హేతువుకానిదానియందు; తత్+హేతుత్వ+ప్రకల్పనమ్=ఉత్కర్షకు, హేతు భావమును కల్పించిన యెడల; ప్రౌఢ+ఉక్తి=ప్రౌఢోక్తి (పొడలపలుకు) యను నలంకార మగును. కచాః=(తరుణీ) శిరోజములు; కళింద+జా+తీర+తమాల+స్తోమ+మేచకాః = కళింద పరత్వమునుండి జనించినట్టి యమునానది యొడ్డునగల, చీకటిచెట్లచే నల్లనైనవి. ప్రౌఢుల నఁగా=చిత్రవిచిత్రకల్పనా సమర్థులని తాత్పర్యము.

## 64. సంభావనాలంకారము

తే॥ గీ॥ ఇదిటు లయ్యెనే నయ్యర్థ మొనయుననెడు
ఊహ సంభావనం బన నొప్పు కృతుల
ఆదిశేషుఁడే వక్తగా నమరునేని
అధిప గుణము లెన్న బహుసమర్థుఁ డగును. 120

ఇది యిట్లు జరిగినచో అ ఫల మతిశయించు ననునట్టి ఊహయే సంభావనాలంకార మను పేరుతో నొప్పుచుండును.

ఉదా :- ఓ రాజా! ఆదిశేషుఁడే వక్తగా నేర్పడినచో మీ గుణముల నెన్న సమర్థుడౌను.

ఇట సహస్రముఖములుగల ఆదిశేషుఁడు వక్త ఐన మీ గుణములనెల్ల వర్ణింపగలఁడని భావము. ఆదిశేషుఁడు వక్త యైనపుడే రాజ గుణవర్ణనము జరుగగలదు. లేనిచో ఒకే ముఖముగల నరునిచే ఆ పని జరుగదు అనునది ఇట ఊహయే. రాజగుణములు అసంఖ్యాకములుగా నున్నవని భావము. కావున నిది సంభావనాలంకారమునకు లక్ష్యమగును.

సం॥ సంభావనా యదీత్థం స్యా దిత్యూహోఽన్యస్య సిద్ధయే,
యది శేషో భవేద్వక్తా కథితాస్స్యుర్గుణాస్తవ.

అన్యసం = వివక్షితమగు అర్థముయొక్క; సిద్ధయే = సిద్ధి కొఱకు; ఇత్థమ్=ఈ తీరుగా; యది+స్యాత్=జరిగిన యెడల; ఇతి+

ఊహా=అను ఊహయే; సంభావనమ్ = సంభావనాలంకార మగును. శేషః=శేషుఁడు; వక్తా+యది+భవేత్=వక్త, ఐన, యెడల; తవ= నీయొక్క; గుణా = గుణములు; కథితాః+స్యుః = వర్ణింపబడినవి అగును.

## 65. మిథ్యాధ్యవసిత్యలంకారము

తే॥ గీ॥ ఏకమిథ్యాత్వసిద్ధికై యేతదన్య
మైన మిథ్యార్థకల్పనం బరసి చేయు
కృతుల మిథ్యాధ్యవసితి నా నతిశయించు
ఖస్రజముఁదాల్చి లోఁచు నా, గణిక నితఁడు. 121

ఒకటి మిథ్య యని నిరూపించుటకై మఱియొక మిథ్యార్థమును గల్పించుట మిథ్యాధ్యవసిత్యలంకారము. మిథ్య యనఁగా సత్యము, (వాస్తవము) కానిది అని అర్థము.

ఉదా :- ఇతఁడు ఖస్రజము (గగనకుసుమమాల) ను ధరించి గణికను లోఁబఱచుకొనును.

ఇట వేశ్యావశీకరణము అసంభావితమని సిద్ధింపఁజేయుటకై గగన కుసుమమాలికాధారణరూపమైన అర్థాంతరకల్పనముండుటచే మిథ్యాధ్యవ సిత్యలంకారమగును. ఇటగగనకుసుమమాలాధారణము వంటిదేవేశ్యా వశీకరణమని కూడ చెప్ప నవకాశమిచ్చు నీ యుదాహరణము నిదర్శనాగర్భమని చెప్పదగి యున్నది.

సం॥ కిఞ్చి న్మిథ్యాత్వ సిద్ధ్యర్థం మిథ్యార్థాన్తరకల్పనమ్,
మిథ్యాధ్యవసితి ర్వేశ్యాం వశయేత్ ఖస్రజం వహన్.

కిఞ్చిత్+మిథ్యాత్వ+సిద్ధ్యర్థమ్=ఒకదాని అసత్యతయొక్క, సిద్ధికొఱకు (ఒకటి మిథ్య అని నిరూపించుటకై); మిథ్యా+అర్థాన్తర+కల్పనమ్=మిథ్యయగు అర్థాన్తరమును, కల్పించుట; మిథ్యా+అధ్యవసితిః=మిథ్యాధ్యవసితి అను నలంకారము (అగును). ఖ+స్రజమ్=గగన కుసుమముల మాలను; వహన్=ధరించుచున్న వాఁడై; వేశ్యామ్=గణికను; వశయేత్=వశపఱచుకొనును.

## 66. లలితాలంకారము

తే॥ గీ॥ వర్ణ్య వాక్యార్థ ప్రతిబింబ వర్ణనంబె
వర్ణ్యమునఁ జేయ లలితమై వఱలు కృతుల
ఉదకమంతయు వెడలంగ సుమిద యిపుడు
సేతు బంధనంబును వేగఁ జేయఁగోరు. 122

ప్రస్తుతమునందు వర్ణనీయమగు వాక్యార్థమును వర్ణింపకుండ అందే దానికి ప్రతిబింబ రూపమగు అప్రస్తుత వాక్యార్థమును వర్ణించిన యెడల లలితాలంకార మగును.

ఉదా :- నీరంతయు వెడలిపోఁగా నిపుడీమె సేతుబంధనము సేయ త్వరపడుచున్నది.

సందర్భము :- ఏదో ఒక విధమగు దాక్షిణ్యాభావముచే వచ్చి, తత్కాలమందు నాయికచే ఉపేక్షించబడి మఱలిపోయి నాయికాంతరాసక్తుడైనట్టి నాయకుని తీసికొనివచ్చుటకై చెలికత్తెను పంపఁ గోరిన ఒక నాయికను ఉద్దేశించి, ఆమె చెలికత్తె తద్విషయమునకు ప్రతిబింబరూపమగు గతజలసేతు బంధన వర్ణనమిట్లు చేసినది

వచ్చిన నాయకుని మఱలిపోకముందే ఆహ్వానించి ఆదరింపక అతఁడు మఱలివెళ్లి నాయికాంతరాసక్తుడై తనవద్దకు రాకున్న నాయకుని తీసికొని రాఁగోరి సఖి నంపుట ప్రస్తుతవిషయము. కాఁగా ఆ విషయమును చెప్పక దానికి ప్రతిబింబరూపముగా వచ్చిన నీరంతయు చెరువునుండి బయటికిపోగా ఆ నీటి నడ్డగింపఁగోరి సేతుబంధనము చేయుగోరుచున్నది ఈవనిత-అని చెప్పెడు చెలికత్తె వాక్యమిది

ఇటు నీరు వెడలిన పిమ్మట సేతుబంధనము ఎట్లు వ్యర్థమో నాయకుని గమనానంతరము అతనిని ప్రసన్నుని చేసికొనఁజేయు ప్రయత్నమును అట్లే వ్యర్థమగు ననుట వివక్షిత విషయము.

కావ నిట వర్ణ్యమునందు దాని ప్రతిబింబరూపమగు అప్రస్తుత

వాక్యార్థము వర్ణింపబడుటచే నిది లలితాలంకార మగుచున్నది. ఇట వర్ణ్యమందు అనఁగా వర్ణ్యాంశము చెప్పవలసినచోట అను నర్థము గ్రాహ్యము.

ఈ వర్ణనము ప్రస్తుతధర్మికము గాన అప్రస్తుతప్రశంసా లంకారము కాజాలదు. ప్రస్తుతవృత్తాన్తము వర్ణ్యమాన మగుచుండ విశేషణ సామ్యముచేతగాని, సారూప్యముచేతగాని, అప్రస్తుత వృత్తాంతస్ఫూర్తి లేనందున ఇది సమాసోక్త్యలంకారమును కాఁజా లదు. పైగా ఇట సహావమగు అప్రస్తుతవృత్తాంతమువలన ప్రస్తుత వృత్తాంతమే గమ్యమగుచున్నది. మఱియు శబ్దోపాత్తములైన ప్రస్తుతాప్రస్తుత వృత్తాంతములకు ఐక్యసమారోపమున్నపుడే స్ఫు రించు నిదర్శనాలంకారమును కాఁజాలదు.

ఒకవేళ శబ్దోపాత్తములగు విషయి-విషయములందు ప్రవ ర్తించు నలంకారమే విషయిమాత్రోపాదానమందును ఉండునన్నచో భేదమునందు అభేదమునే చెప్పు అసంబంధాతిశయోక్తిస్థానమును రూపకమే అక్రమించును. కావున నిది తత్తదలంకార విలక్షణమైనదే

శ్లో॥ ప్రస్తుతే వర్ణ్యవాక్యార్థ ప్రతిబింబస్య వర్ణనమ్,
లలితం, నిర్గతే నీరే సేతు మేషా చికీర్షతి.

ప్రస్తుతే = ప్రకృతవిషయమునందు; వర్ణ్య+వాక్యార్థ+ప్రతి బింబస్య=వర్ణింపదగిన, వాక్యవిషయమునకు సంబంధించిన, ప్రతి బింబభూతమగు మఱియొక విషయముయొక్క; వర్ణనమ్= వర్ణిం చుట; లలితమ్=లలితాలంకారము (అగును). నీరే=నీరు; నిర్గతే+ (సతి)=వెడలిపోయినది కాఁగా; ఏషా=ఈమె; సేతుమ్=ఆనకట్టను; చికీర్షతి=నిర్మింపగోరుచున్నది.

## 67. ప్రహర్షణాలంకారము

ఇది మూఁడు విధములు. అందు ప్రథమము :-

తే॥ గీ॥ యత్న మది లేక ఉత్కంఠితార్థసిద్ధిఁ
చెప్పఁ గృతుల బ్రహర్షణం బొప్పుచుండు
దానికై తాను సతతంబు తలఁచుచుండ
అతని కడ కదె దూతిగా పంపఁబడియె. 128

•ఉత్కంఠితార్థము (పొందఁ దొందర పెట్టు నభీష్టఫలము) ప్రయత్నము చేయకుండ సిద్ధించినట్లు చెప్పినేని ప్రహర్షణాలంకారమగును.

ఉదా :- ఏ దూతికను తాను సతతము స్మరించుచున్నాడో ఆ దూతికయే తనను తీసికొనివచ్చుటకై నాయికచే పంపబడినది.

ఇట ఉత్కంఠితార్థము దూతిక. అది తాను యత్నింపవలసిన పని లేకుండ నాయికచే తనవద్దకే దూతికగా పంపబడినట్లు చెప్పబడుటచే నిది ప్రహర్షణాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఉత్కంఠితార్థసంసిద్ధి ర్వినా యత్నం ప్రహర్షణమ్,
తామేవ ధ్యాయతే తస్మై నిసృష్టా సైవ దూతికా.

ఉత్కంఠిత+అర్థ+సిద్ధిః=ఉత్కంఠతోఁగూడిన, అభీష్టార్థము యొక్క, లాభము యత్నం+వినా=ప్రయత్నము లేకయే; (కలిగినట్లు వర్ణించిన యెడల) ప్రహర్షణమ్ = ప్రహర్షణాలంకారము (అగును). తామ్+ఏవ=ఆమెనే; ధ్యాయతే=ధ్యానించుచున్నాడు. తస్మై=అతనికొఱకై ; సా+ఏవ=ఆ వనితయే; దూతికా=దూతికగా; నిసృష్టా=పంపబడినది.

ద్వితీయము : తే॥ గీ॥ వాంఛితార్థాధికంబగు ఫలము కలుగ
కృతిఁ బ్రహర్షణాలంకార మేసఁగు నొండు
ఎంతలో దివ్వె వెలిగించె నంతలోనే
భాస్కరు డుదయించె నతిప్రభాకరుండు.

• సర్వేంద్రియ సుఖాస్వాదో యత్రాస్తీత్యభిమన్యతే,
తత్ప్రాప్తీచ్ఛాం ససంకల్పాం ఉత్కంఠాం కవయో విదుః.

వాంఛితార్థము కంటె నధికమైన ఫలము సిద్ధించినట్లు వర్ణించి నను వేఱొక ప్రహర్షణాలంకార మగును.

ఉదా :- ఎంతలో దీపము వెలిగించెనో అంతలోనే అధికప్రభకు ఆకరుఁడగు భాస్కరుఁ డుదయించెను.

ఇట వెలుగు కొఱకై దీపము వెలిగించు నంతలోనే దీపకాంతి కంటె ఎన్నోరెట్లు వెలుగునిచ్చెడు భాస్కరుఁడుదయించినట్లు చెప్ప బడుటచే నిది వేఱొక ప్రహర్షణాలంకార మగు చున్నది.

సం॥ వాఞ్ఛితాదధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్।
దీప ముద్యోజయేద్యా వత్తావదభ్యుదితో రవిః॥

వాఞ్ఛితాత్=కోరఁబడినదానికంటె, అధిక+అర్థస్య=అధిక మగు ప్రయోజనము యొక్క; సంసిద్ధిః+చ=సిద్ధించుటయు; ప్రహర్షణమ్=ప్రహర్షణాలంకారము (అగును). యావత్=ఎంతలో; దీపమ్=దీపమును; ఉద్యోజయేత్ = వెలిగించునో; తావత్=అంత లోనే; రవిః=సూర్యుఁడు; అభ్యుదితః=ఉదయించెను.

తృతీయము : తే॥ గీ॥ వెరవు సిద్ధింప యత్నంబు వెలయఁ జేయ,
కలుగ ప్రత్యక్ష ఫలసిద్ధి యలరు నొందు
పూని నిధ్యంజ నౌషధీమూల మంద
ధరణిఁ ద్రవ్వంగ నిధియె తాఁదక్కె ననఁగ.

ఫలసిద్ధికి వలయు సాధనమునకై ప్రయత్నింప ఫలసిద్ధియే ప్రత్యక్షమయ్యెనని వర్ణించెనేని అదియు మఱియొక ప్రహర్షణా లంకారమగును.

ఉదా :- నిధిని జూపఁజాలు అంజనౌషధీ మూలమును పొందగోరి భువిని ద్రవ్వగా నిధియె దక్కినది.

ఇట నిధిప్రాప్తికి సాధనమగు నంజనౌషధీ మూలమును పొందుటకై ధరణిని ద్రవ్వగా సాక్షాత్తుగా నిధియె దక్కినది అని

చెప్పుటచే నిది మఱియొక ప్రహర్షణాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ యత్నాదుపాయ సిద్ధ్యర్థాత్సాక్షాల్లాభః ఫలస్య చ,
నిధ్యఞ్జ నౌషధీమూలం ఖనతా సాధితో నిధిః.

ఉపాయ+సిద్ధి+అర్థాత్=సాధనముయొక్క; లబ్ధియే, ప్రయోజనముగాగల; యత్నాత్=ప్రయత్నమువలన: సాక్షాత్ = ప్రత్యక్షముగా: ఫలస్య = ఫలము (కార్యసిద్ధి) యొక్క; లాభః + చ = లబ్ధియే: (వర్ణింపబడిన యెడల) వేఱొక ప్రహర్షణాలంకారము (అగును). నిధి+అఞ్జన+ఓషధీ+మూలమ్=నిధిని కనుగొనుటకైన; కాటుకకై, ఓషధి యొక్క మూలము (వేరు)ను; ఖనతా=త్రవ్వెడు జనునిచే, నిధిః=నిధియే: సాధితః=సాధింపబడినది.

## 68. విషాదనాలంకారము

తే॥ గీ॥ అభిమతార్థ విరుద్ధమౌ నర్థ మెనయ,
కృతి విషాదనాలంకార మెసఁగుచుండు
ఎంతలో దివ్వె, వెలిగించు నంతలోనె
దివియ నిర్వాణ మాయెను దివ్యు తొలఁగ. 126

ఇష్టార్థమునకు విరుద్ధమైన అర్థము కలిగినట్లు చెప్పబడిన యెడల విషాదనాలంకారము అగును.

ఉదా :- ఎంతలో దీపమును వెలిగించునో, అంతలోనె దీపము నిర్వాణమైనది. ఇట దీపమును వెలిగించుటకు విరుద్ధమైన అర్థసిద్ధిచే (దీపము చల్లారుట అంధకార ప్రాప్తి) కల్గినట్లు చెప్పుటచే నిది విషాదనాలంకారమునకు లక్ష్యమగును.

సం॥ ఇష్యమాణ విరుద్ధార్థ సంప్రాప్తిస్తు విషాదనమ్,
దీప ముద్యోజయే ద్యావన్నిర్వాణస్తావదేవ సః.

ఇష్యమాణ+విరుద్ధ-అర్థ + సంప్రాప్తిః+తు = కోరఁబడుచున్నదానికి వ్యతిరేకమగు, ఫలసిద్ధియొక్క, లాభము చెప్పబడిన

యెడల విషాదనాలంకారమగును. యావత్=ఎంతలో; దీపమ్=దీపమును; ఉద్యోజయేత్=వెలిగించునో; తావత్+ఏవ=అంతలోనే; సః = ఆ దీపము; నిర్వాణః=ఆరిపోయినది.

## 69. ఉల్లాసాలంకారము

తే॥ గీ॥ ఒకని గుణదోషములచేత నొరున కవియె
అమరెనేని ఉల్లాసమై యలరు కృతుల
సాధ్వి! నన్ పూతఁ జేయుమీ చక్క మునిఁగి
అనుచు జాహ్నవి ప్రార్థించె వనిత ననఁగ. 127

తే॥ గీ॥ అధిప! నీవొనర్చు సమరయాత్రలందు
పగఱ వనితలు భయముతో పఱచి చనుచు
చనుబిగు వడుగు దమ్ములం దనర కునికి
బ్రహ్మదేవుని నిందింత్రు బడలు పడుచు. 128

తే॥ గీ॥ ఉర్వి ధనము సజ్జనుఁ జేరకుండుఁ గాక
అది ధనమున కభాగ్యంబ యౌను సుమ్ము
చిరము సేవించు భూపాల సేవకులకు
పథ జరుగకుంట లాభమై పరఁగుచుండు. 129

ఒకానొకని 1. గుణముచేత ఒరునకు గుణము 2. దోషముచేత దోషము 3. గుణముచేత దోషము 4. దోషముచేత గుణముగాని కలిగినట్లు వర్ణింప నది ఉల్లాసాలంకారమగును. క్రమముగా ఉదాహరణములు :

1. సాధ్వి యొక్క మహిమ నెఱిఁగిన జాహ్నవి ఆ పతివ్రతను నీవు నాయందు మునిఁగి నన్ను పవిత్రను చేయుమని ప్రార్థించెను.

ఇట పతివ్రత పాతివ్రత్య లక్షణమునుబట్టి ఆ సాధ్వి స్నానము చేయుటచే గంగకును పావనత్వ గుణమబ్బినట్లు

వర్ణింపబడినందున మొదటి ఉల్లాసాలంకారమున కిది లక్ష్యమగు చున్నది.

2. ఓ రాజా! నీ సమర యాత్రలందు భయపడి పారిపోవు శత్రుకాంతలు తమ చనులకున్న బిగువు పాదపద్మములకు లేనందుకు సృష్టికర్తను నిందింతురు.

ఇట రాజుచేయు దండయాత్రలందు అడవిలో పలాయనము చేయుచున్న శత్రు స్త్రీలు తమ పాదములందలి మార్దవ దోషము పరుగెత్తుటకు ఆటంకమగుటచే కాఠిన్యము అవసరమగు పాదము లకు సృష్టించకుండ వ్యర్థములగు కుచములకు సృష్టించినాడని బ్రహ్మను నిందించుచున్నట్లు వర్ణింపఁబడినది. ఇట శత్రు స్త్రీల పాదములందలి కాఠిన్యాభావ దోషముచే బ్రహ్మకు దోషమున్నట్లు వర్ణించుటచే నిది ద్వితీయోల్లాసాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

3. సజ్జనుల కైశ్వర్యము అబ్బకున్న ఆ యభాగ్యము ధనము నకు చెందునే కాని వారికేమి కొఱత.

లోకమందు ధనము అల్పగుణుల చేరుచు సజ్జనులకు దూర మగుచుండు నందురు. ఆ యభిప్రాయమే ఈ వాక్యమునందు చెప్పబడినది. సజ్జనులకు ఐశ్వర్యమమరకున్నను వారికే కొఱతయు నుండదు. ఆ దౌర్భాగ్యము ధనమునకే చెందునని, సుజనులలోని సౌజన్యము వలన వారి నాశ్రయింపకుండుట ధనమునకే అను దోషముగా వర్ణించుటచే నిది తృతీయోల్లాసమునకు లక్ష్యమగు చున్నది.

4. రాజసేవకులకు వధ పరుగకుండుటయే లాభము.

రాజసేవకులకు ప్రాణములు దక్కుటయే మహాలాభమని భావము. ఇట పాలకుని క్రౌర్యరూపమగు దోషముచే సేవకులకు

పథాభావ రూపమగు గుణముగా వర్ణించుటచే నిది చతుర్థమగు ఉల్లాసాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌ యది,
అపి మాం పావయేత్సాధ్వీ స్నాత్వేతీచ్ఛతి జాహ్నవీ. 1

,, కాఠిన్యం కుచయోః, స్రష్టుం వాఞ్ఛన్త్యః పాదపద్మయోః,
నిన్దన్తి చ విధాతారం త్వద్ధాటీష్వరియోషితః. 2

,, తదభాగ్యం ధనస్యైవ యన్నాశ్రయతి సజ్జనమ్,
లాభోఽయమేవ భూపాలసేవకానాం న చేద్వధః. 3

1) ఏకస్య=ఒకనియొక్క; గుణదోషాభ్యామ్ = గుణము, దోషముచేత; అన్యస్య=ఇతరునకు; తౌ=అవి (ఆ గుణదోషములు) యది+(స్యాతామ్) = కలుగునెడల; ఉల్లాసః = ఉల్లాసాలంకారము (అగును). సాధ్వీ=పతివ్రత; స్నాత్వా=స్నానముచేసి; మామ్+అపి=నన్నుకూడ; పావయేత్=పవిత్రముచేయునుగాక; ఇతి=అని; జాహ్నవీ=గంగానది; ఇచ్ఛతి=కోరుచున్నది.

2) త్వత్ + ధాటీషు = నీ దండయాత్రలయందు: అరి+యోషితః=శత్రురాజుల స్త్రీలు; కుచయోః=స్తనములకు సంబంధించిన; కాఠిన్యమ్=కఠినత్వమును; పాదపద్మయోః = పద్మముల వంటి పాదములకు; స్రష్టుమ్=సృజించుటకై; వాఞ్ఛన్త్యః=కోరుచున్నవారై; విధాతారం+చ = బ్రహ్మదేవుని, కూడ; నిన్దన్తి = నిందించుచున్నారు.

3) సత్+జనమ్=సత్పురుషుని; (ధనము) న+ఆశ్రయతి=ఆశ్రయింపదు; (ఇతి)+యత్=అనునది యేది కలదో; తత్=అది; ధనస్య=ధనముయొక్క అభాగ్యమ్+ఏవ=దౌర్భాగ్యమే; (అది సజ్జన దోషము కాదని భావము). భూపాల సేవకానామ్ = రాజ సేవకులకు; వధః=వధ; న+చేత్=జరుగకున్నయెడల; అయమ్+ఏవ=ఇదియే; లాభః=లాభము (మేలని భావము).

## 70. అవజ్ఞాలంకారము

తే॥ గీ॥ ఒప్పు గుణదోషముల నవె యొలయ కున్న
అలరు కృతుల నవజ్ఞాఖ్యమయ్యు నొకటి,
ప్రస్థ మయ్యపారాంభోధిఁ బడసి కూడ;
అల్పజలమునె గ్రహియించు ననుటఁ గనుము.
చలివెలుగు రాఁగఁ గమలముల్ ముడుగుచుండు
దాన నమృతాంశునకు గల్గు హాని యేమి ? 130

గుణ-దోషములచే గుణదోషములే కలుగకున్న అవి యవజ్ఞాలంకార మగును. ఇట ఒకనియొక్క గుణముచే నన్యునకు గుణము కలుగకుండుట, ఒకని దోషముచే అన్యునకు దోషము కలుగకుండుట అని ఇది ద్వివిధము.

ఉదా : 1) ప్రస్థము (కొలతలో 4 మానికల పరిమాణము గల పాత్ర) అపార సముద్రము నుండియు అల్పజలమునే గ్రహించును.

సముద్రములో జలము అమితముగనే ఉన్నది. ప్రస్థము అల్ప పరిమాణము గలది. కాఁగా నిట అపార జలవత్త్వ గుణము గల సముద్రమును చేరినను, ప్రస్థమునకు అధిక జలగ్రహణ గుణము కలుగలేదని చెప్పుటచే నిది ప్రథమావజ్ఞాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఉదా : 2) చలివెలుగు రాఁగఁ గమలములు ముడుచుకొనుటచే చంద్రునకు ఏహానియు కలుగదు.

ఇట కమలముల యొక్క ముకుళీభావము అను దోషముచే చంద్రునకు ఆ దోషాలాభమే వర్ణింపబడినది. కావున నిది రెండవ అవజ్ఞాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ తాభ్యాం తౌ యది న స్యాతా మవజ్ఞాలంకృతిస్తు సా,
స్వల్పమేవామ్బు లభతే ప్రస్థం ప్రాప్యాపి సాగరమ్,
మీలన్తి యది పద్మాని కా హాని రమృతద్యుతేః.

తాభ్యామ్=ఆ గుణదోషములవలన, తౌ=ఆ గుణదోషములు; న+స్యాతామ్+యది = కలుగకున్నయెడల; సా+తు = అదైతే, అవజ్ఞా+అలంకృతిః = అవజ్ఞాలంకారము (అగును). ప్రస్థః = కుంచము (4 మానికలు) పరిమాణముగల కొలమానము; సాగరమ్= సముద్రమును; ప్రాప్య+అపి=చేరికూడ; స్వల్పమ్=కొలఁదియగు; అమ్బు+ఏవ=జలమునే; లభతే = పొందుచున్నది. పద్మాని = కమలములు; మీలన్తి+యది = ముడుచుకొనినయెడల; అమృత ద్యుతేః=చంద్రునికి; హానిః+కా = కొఱత ఏమి? (ఉండును?) కొఱత ఏమియు నుండదని భావము.

## 71. అనుజ్ఞాలంకారము

తే॥ గీ॥ అచటి గుణ మెంచి దోషంబు నమరఁ గోర
అది యనుజ్ఞ నా కృతులందు నలరుచుండు
అడరు నాపదల్ నాకెప్డు కలుగుఁ గాక
అపుడె తరియింప శక్యమౌ హరి భజించి. 130

దోషమందుగల గుణము నెఱిఁగి ఆ దోషము తన కమరునట్లు గోరిన యెడల అది అనుజ్ఞాలంకార మగును.

ఉదా :- అతిశయించు నాపదలు నాకు కలుగునుగాక. అపుడు హరిని గొలిచి తరింప శక్యమగును.

ఇట బాధకు కారణమగు దోషమున్నను ఆపదలు కలిగినపుడే హరి భజన చేయుదురు. దాని మూలమున తరింప శక్యమగును. అట్టి గుణముండుటచే నాయాపదలనే కోరుట ఇటఁ వర్ణింపబడినందు వలన నిది అనుజ్ఞాలంకారమగును.

జనులు మేలును కోరుకొనుటయు, కీడును అడ్డుకొనుటయు సహజము. అట్లే కష్టములు కలిగినపుడు భగవంతుని దలంచుట, సుఖముగా జీవనము జరుగుచున్నపుడు భగవంతుని మరచుటయును లోకములో సహజముగా జరుగుచుండు విధము. ఇందలి విశేషము తెలిసిన విజ్ఞులు హరి భజనముయొక్క ఘనతను గుర్తించి, అది అవశ్యము చేయదగినదిగా భావింతురు. హరి భజనకు తోడ్పడును కావున ఆపదలు క్లేశదాయకములైనను అందలి ఈ గుణమును ఎఱిగి కొందఱు వానినే కోరుకొనుటయు జరుగుచుండుననుట ఇచట జ్ఞాపకము చేసికొనవలసిన విషయము.

సం॥ దోషస్యాభ్యర్థనానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్,
విపదః సన్తు నః శశ్వద్యాసు సఙ్కీర్త్యతే హరిః.

తత్ర+ఏవ=ఆ దోషమునందే; గుణ+దర్శనాత్=సుగుణము, కన్పించుటవలన; దోషస్య=దోషముయొక్క; అభి+అర్థనా=ప్రార్థన; అనుజ్ఞా=అనుజ్ఞయను నలంకారమగును. యాసు=ఏ యాపదలయందు; హరిః=విష్ణువు; సఙ్కీర్త్యతే=చక్కగా కీర్తింపబడునో; విపదః=(ఆ) విపత్తులు; నః=మాకు; శశ్వత్=ఎల్లవేళల; సన్తు=కలుగుగాక.

## 72. లేశాలంకారము

తే॥ గీ॥ దోష-గుణములకును గుణ-దోష భావ
కల్పనన్ లేశమను నలంకారమగును.
సకల విహగముల్ స్వేచ్ఛతో సంచరింప
చిలుక! నీ తెలి మధురోక్తి ఫలమదెయ్యె! 132

దోషమునకు గుణత్వమును, గుణమునకు దోషత్వమును కల్పించుటచే లేశాలంకారము అగును.

ఉదా :- పక్షులన్నియు స్వేచ్ఛగా విహరించుచుండ, ఓ చిలుకా!

మధురోక్తుల ఫలముగా నీవు పంజరమున బంధింపబడు చుంటివి. అయ్యో!

సందర్భము : రాజున కిష్టుడైన విద్వాంసుడగు పుత్రుడు చిరకాలము రాజధానిలో నుండగా, పుత్రునిచూడ నుత్కంఠితుడై యింటనున్న తండ్రియొక్క అప్రస్తుత ప్రశంసా రూపమగు మాట యిది.

లోకమందు మానవేతర ప్రాణులకు మాటలాడు శక్తి లేదు. పక్షుల విషయమును అంతియే. కాని చిలుక మాత్రము– నేర్పినచో కొంత మాట్లాడగలుగును. మాట్లాడలేకుండుట ఇతర పక్షులలో గల దోషము. మాట్లాడగలుగుట చిలుకలో గల గుణము. ఇట్లు ఈ పక్షులలో గల దోష గుణములకు ఇచట గుణదోష భావ కల్పనము జరిగినది. ఎట్లన– మాట్లాడలేని ఇతర పక్షులు స్వేచ్ఛతో విహరించుచున్నవి. మాట్లాడగల చిలుక పంజరమందు నిర్బంధింపబడుచున్నది. మాటలు రాని దోషముగల ఇతర పక్షులకు స్వేచ్ఛా సంచారము గుణముగను, మాట్లాడు గుణము గల చిలుకకు పంజర బంధనము దోషముగ కల్పింపబడినది. కావున నిది లేశాలంకారమున కుదాహరణము.

సం॥ లేశః స్యాద్దోష గుణయో ర్గుణదోషత్వ కల్పనమ్,
అఖిలేషు విహఙ్గేషు హన్త! స్వచ్ఛన్దచారిషు
శుకః పఞ్జర బన్ధస్తే మధురాణాం గిరాం ఫలమ్.

దోష–గుణయోః = దోషమునకును, గుణమునకును: గుణ–దోషత్వ + కల్పనమ్=(వరుసగా) గుణత్వమును, దోషత్వమును, కల్పించుట: లేశః=లేశాలంకారము; స్యాత్=అగును. హే శుక = ఓ చిలుకా!; అఖిలేషు=సమస్తమైన; విహఙ్గేషు = పక్షులు; స్వచ్ఛన్ద

చారిషు+(సత్సు)=స్వేచ్ఛగా సంచరించుచున్నవి కాఁగా; తే=నీ యొక్క; మధురాణామ్ = మనోహరమైన; గిరామ్ = పలుకుల యొక్క; ఫలమ్=ఫలము; పఞ్జర+బంధః = పంజరమునందు, బంధనమే; హ న్త=అయ్యో!

## 73. ముద్రాలంకారము

తే॥ గీ॥ ప్రస్తుతార్థంబు బోధించు పలుకు లవియె
చెలఁగి సూచ్యార్థసూచనం జేయ ముద్ర
తేర్చు సంక్షుబ్ధ హృదయాలఁ దేటగీతి
పరమ పావన భక్త సంభావితంబు. 133

ప్రకృతార్థమును బోధించు పలుకులచే సూచ్యము (సూచింపదగినది) అగు వేఱొక అర్థము సూచింపబడిన యెడల ముద్రాలంకార మగును.

ఉదా :- బహు పవిత్రుఁడగు భక్తునిచే సంభావన చేయబడిన స్వచ్ఛ మగు పాట సంక్షోభము పొందిన హృదయములను తేటపఱచును.

ఇట ప్రకృత విషయము పావన భక్తుని గీతికను విని, దానిని ప్రశంసించుట. ఈ భక్తుని తేటయైన గీతి క్షుబ్ధ హృదయములఁ దేర్చుచు మనోహరముగా నున్నదనుట ప్రస్తుతార్థము. కాఁగా ఇది తేటగీతి పద్యమనునది ఇట సూచ్యార్థము. ప్రకృతార్థమగు భక్తుని తేట యగు గీతిని తెల్పు "తేటగీతి" అను పదము, ఇది తేటగీతి పద్యము అను సూచ్యార్థమును సూచించుటచే నిది ముద్రాలంకార లక్ష్యమగుచున్నది.

సం॥ సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః,
నితమ్బ గుర్వీ తరుణీ దృగ్యుగ్మ విపులా చ సా.

ప్రకృత+అర్థ + పరైః = ప్రకృతమైన, అర్థమునందు

తాత్పర్యము గల; పదైః=పదములనే; సూచ్య+అర్థ+సూచనమ్=సూచింపదగిన, వేరొక విషయము యొక్క: సూచనము (సూచించుట): ముద్రా=ముద్రాలంకారము (అగును). సా+తరుణీ = ఆ యువతి: నితమ్బ గుర్వీ = నితంబముల (పిఱుదుల)చే భారము గలది: దృక్+యుగ్మ+విపులా+చ=కనుల, జంటయొక్క, వైపుల్యము గలదియును.

సూచన :- ఇట సూచ్యార్థము ఈ శ్లోకము యుగ్మవిపులాఖ్యమైనది అనుట. కాఁగా అది తెలుఁగు భాషలోనికి అనువదించుట కుదరనిదగుటచే వేఱొకటి ఉదాహరణముగ కూర్పఁబడినది.

## 74. రత్నావళ్యలంకారము

తే॥ గీ॥ ప్రస్తుతార్థములఁ బ్రథితక్రమముఁ బట్టి
చెప్ప రత్నావళి యనంగఁ జెలఁగు కృతుల
అరయఁ జతురాస్యుఁడవు నీవె యౌదు, లక్ష్మి
కీవె పతివి, సర్వజ్ఞుండ వీవె యధిప! 134

ప్రకృతార్థములను క్రమికగతిని (ప్రసిద్ధ క్రమమును) బట్టి చెప్పిన యెడల నది రత్నావళ్యలంకార మగును.

ఉదా : ఓ యధిపా! నీవె చతురాస్యుడవు. నీవె లక్ష్మికి పతివి. నీవె సర్వజ్ఞుఁడవు.

ఇట చతురాస్యాది పదములంచే వర్ణింపబడినవాడు రాజే. ఈ పదములు ప్రకృతార్థములు. వీనిచే వర్ణనీయాధిపునకు బ్రహ్మ-విష్ణు-మహేశ్వరాత్మత్వము స్ఫురించుచున్నది. బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల క్రమము ప్రసిద్ధమైనది. ఈ ప్రసిద్ధ క్రమము ననుసరించియే I చతురాస్య = 1) చతురమైన ఆస్యము కలవాఁడు, 2) బ్రహ్మ; II లక్ష్మీపతి = 1) ఐశ్వర్యము కలవాడు. 2) విష్ణువు. III- సర్వజ్ఞుడు=1) సర్వము నెఱిగినవాఁడు 2) మహేశ్వరుఁడు

అను పదములు ప్రయోగింపబడి యుండుటచే నిది రత్నావళ్య
లంకార మగును.

సం॥ క్రమికం ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః,
చతురాస్యః పతిర్లక్ష్మ్యాః స్సర్వజ్ఞస్త్వం మహీపతేః.

ప్రకృతార్థానామ్ = ప్రస్తుతార్థములకు; క్రమికమ్ = ప్రసిద్ధ
క్రమము ననుసరించునట్టి; న్యాసమ్ = న్యసనమే (నిల్పుటయే);
రత్నావళిమ్=రత్నావళ్యలంకారముగ; విదుః=(పండితులు) తెలిసి
కొందురు (తెల్పుదురు అని భావము). హే మహీపతే! = ఓ రాజా!
త్వమ్ = నీవు; చతురాస్యః = నిపుణమగు ముఖము గలవాడవు
బ్రహ్మవు; లక్ష్మ్యాః + పతిః = ఐశ్వర్యమునకు అధిపతివి; విష్ణు
మూర్తివి; సర్వజ్ఞః=సర్వమును ఎఱిగినవాడవు; శివుడవు.

## 75. తద్గుణాలంకారము

ఆ. వె. ఆత్మగుణము విడిచి యన్యగుణము నంద
తద్గుణం బనఁ గృతిఁ దనరుచుండు
అధర కాంతిచేత నతివ నాసాముక్త
మలరె పద్మరాగ మనఁగ నెసఁగి. 135

తన గుణమును విడిచి అన్య (ఇతర) గుణమును పొందినట్లు
చెప్పినయెడల నది తద్గుణాలంకారమని చెప్పఁబడును.

ఉదా : అధర కాంతిచే నతివ యొక్క నాసాముక్తము పద్మరాగము
వలె నతిశయించెను.

ఇట ముక్కురపు (ముక్కు నగయొక్క) ముత్యము వనిత
యొక్క అధర కాంతిచే పద్మరాగము వలె నెఱ్ఱనిదాయెను. అనఁగా
తెల్లని ముత్యము ఆత్మ గుణమును (తన తెల్లని కాంతిని) విడిచి,
అధరము యొక్క ఎఱ్ఱని కాంతిని బొంది పద్మరాగమువలె ప్రకా
శించినట్లు చెప్పబడుటచే నిది తద్గుణాలంకార మగుచున్నది.

సం॥ తద్గుణః స్వగుణ త్యాగా దన్యదీయ గుణ గ్రహః,
పద్మరాగాయతే నాసామౌక్తికం తేఽధరత్విషా.

స్వ+గుణ+త్యాగాత్=తన యొక్క, గుణమును, విడుచుట వలన: అన్యదీయ+గుణ+గ్రహః=అన్య వస్తువు యొక్క, గుణమును, గ్రహించుట; తద్గుణః=తద్గుణాలంకారము (అగును). తే=నీ యొక్క: నాసామౌక్తికమ్=ముక్కరపు ముత్యము; అధరత్విషా=క్రింది పెదవి కాంతిచే: పద్మరాగాయతే=పద్మరాగమువలె ప్రకాశించుచున్నది.

## 76. పూర్వరూపాలంకారము

ఆ. వె. ఆత్మ గుణమె తిరిగి ప్రాప్తమైన యెడల
పూర్వరూప మనఁగఁ బొసఁగు కృతుల
శంకరు గళకాంతి సంగతాసితశేషుఁ
డధిపు యశము చేత నయ్యె సితుఁడు. 136

ఒకప్పుడు తనకున్న గుణమును విడిచిపెట్టిన తరువాత తిరిగి పూర్వ గుణము నందెనేని పూర్వ రూపాలంకారము అగును. ఇది రెండు విధములు.

ఉదా : ఓ రాజా! శేషుఁడు శంకరుని నల్లని కంఠకాంతి లేపనముచే కోల్పోయిన సితవర్ణమును నీ యశముచే తిరిగి పొందినాఁడు.

ఇట ఆధిశేషుఁడు తెల్లని వాడైనను శివుని అసితగళ కాంతిచే సంలిప్తుడై తన తెల్లని కాంతిని కోల్పోయినాఁడు. అతఁడు నీ యశముచే తిరిగి సితవర్ణుఁడైనాడు. కావున నిది పూర్వ రూపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ పునః స్వగుణ సంప్రాప్తిః పూర్వరూప ముదాహృతమ్,
హరకంఠాంశు లిప్తోఽపి శేష స్త్వద్యశసా సితః.

పునః=తిరిగి; స్వగుణ+సంప్రాప్తిః=స్వీయ గుణములను

హొందుట: పూర్వ రూపమ్=పూర్వ రూపాలంకారముగ: ఉదాహృతమ్=(పండితులచే) చెప్పబడినది. శేషః=ఆదిశేషుఁడు: హర+కంఠ+అంశు+లిప్తః+అపి = ఈశ్వరుని, కంఠమునకు చెందిన, (నల్లని) కాంతులచె. పూయబడిన (వ్యాప్తమైన) వాఁడు, ఐనను; త్వత్+యశసా=నీయొక్క, కీర్తిచేసితః=తెల్లనివాఁడు(అయ్యెను).

ద్వితీయము.

ఆ. వె. వస్తు వంద వికృతిఁ బరఁగు పూర్వదశయె
అనుసృతము యైన దనఁ దనరు నొండు
దీప్తి తోడ వెలుగు దీపంబె చల్లార
కాంచిరత్న మిచ్చె కామ్యకాంతి. 137

ఒక వస్తువు వికారమును హొందినప్పటికిని పూర్వదశయే అనుసృతమైనదని చెప్పిన యెడల నది వేరొక పూర్వ రూపాలంకారము అగును.

ఉదా :- పెద్ద కాంతితో వెలుగు దీపము చల్లారగానే కాంచీ (వడ్డాణపు) రత్నములు గొప్ప వెలుగు నిచ్చినవి.

ఇట దీపించు దీపము వికృతమైనది అనఁగా చల్లారినది. కాఁగా కాంచీ రత్నముచే మొదటి (వెలుగునప్పటి) దశయే అనువృత్తమైనది (కొనసాగినది) అనునట్లు చెప్పబడుటచే నిది ద్వితీయ పూర్వ రూపాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ పూర్వావస్థానువృత్తిశ్చ వికృతే సతి వస్తుని,
దీపే నిర్వాపితేఽప్యాసీత్ కాంచీరత్నై ర్మహన్మహః.

వస్తుని+వికృతే+(సతి)=వస్తువు, వికారము హొందినది కాఁగా; పూర్వ+అవస్థా+అనువృత్తిః+చ=పూర్వమున్న దశ, కొనసాగుటయు; పూర్వరూపాలంకారః = పూర్వరూపమను నలంకారము (అగును). దీపే=దీపము; నిర్వాపితే+అపి=ఆర్పఁబడినదైనప్పటి

క్తిని; శాంపేర రత్నైః=వజ్రాణపు మణులచేత: మహత్+మహాః=గొప్ప
కాంతి; అసత్=కలిగెను.

## 77. అతద్గుణాలంకారము

ఆ. వె. సంగతాన్య గుణము నంగీకరింపమిఁ
గృతి నతద్గుణ మన నెసఁగుచుండు
చిరము నిల్పి రక్తచిత్తమందును నిన్ను
చూపవైతి రక్తి సుంత నీవు. 138

సంగతమైన అన్య పదార్థ గుణమును అంగీకరింప (స్వీకరింప) కుండుట అతద్గుణాలంకార మగును. తన దగ్గఱనో తనతో కలిసియో యున్న అన్య పదార్థము యొక్క గుణమును స్వీకరింప కుండుట అతద్గుణమని తాత్పర్యము.

ఉదా :- రాగయుక్తమగు నా చిత్తమందు నీవు బహుకాల ముండి
నప్పటికిని రక్తుఁడవు కాకుంటివి.

రాగయుక్తమగు దానియందున్నవాఁడు రక్తుఁడగుట లోక సామాన్య విషయము.కాని ఇట రక్త (రాగయుక్త) చిత్తమందు చిరకాలమున్నను రక్తుఁడు కాలేదని చెప్పబడినది. అతనితో భార్యా చిత్తము సంగతమైనది. ఐనను సంగతమైన దాని గుణమును భర్త స్వీకరింపలేదు. కావున నిది అతద్గుణాలంకారమునకు లక్ష్య మగు చున్నది.

సం॥ సఙ్గతాన్య గుణాన ఙ్గీకార మాహు రతద్గుణమ్,
చిరం రాగిణి మచ్చిత్తే నిహితోఽపి న రఞ్జసి.

సఙ్గత+అన్య+గుణ+అనఙ్గీకారమ్=చేరియున్న, ఇతరమగు, పదార్థము యొక్క, గుణమును, అంగీకరింపకుండుటను; అతద్గుణమ్ = అతద్గుణాలంకారముగ; ఆహుః = (విద్వాంసులు) చెప్పుదురు. చిరమ్=బహుకాలము; రాగిణి = రాగవంతమైన; మత్+చిత్తే = నా

యొక్క, మనస్సునందు; నిహితః+అపి = నిల్పబడినవాడవు ఐనను: న+రజ్యసి = రాగము పొందకున్నావు. అనురాగయుక్తుడవు కాకున్నావు.

<u>విశేషము :</u> ఏకత్ర ఉన్న గుణముచేత అన్యత్ర గుణోదయము కల్గిన ఉల్లాసమును: గుణానుదయమున అవజ్ఞాలంకారము నగును. స్వగుణ త్యాగమున అన్యదీయ గుణ గ్రహణమున్న తద్గుణమును, సంగతాన్య గుణానంగీకార రూపమగు నది అతద్గుణము. కాగా ఈ యుల్లాసావజ్ఞాలంకారములకును, తద్గుణ-అతద్గుణాలంకారములకు గల భేద మేమియన :- మొదటి జంట యందు (ఉల్లాసావజ్ఞా లంకారములందు) గుణశబ్దము దోష ప్రతిపక్షవాచిగా ఉపయుక్తమైనది. అన్యగుణేన అన్యత్ర గుణోదయ, గుణానుదయ రూపములగు నీ ఉల్లాసావజ్ఞాలంకారములందు అన్య గుణమునకే అన్యత్ర సంక్రమణముగాని, అసంక్రమణముగాని రాదు. కాని అవి సద్గురూపదేశముచే సద సచ్ఛిష్యులందు కలుగు జ్ఞానోత్పత్త్య నుత్పత్తులవలె తద్గుణ జన్యములుగ సంభావింపబడిన గుణాంతరముల ఉత్పత్త్య నుత్పత్తు లగును.

కాగా తద్గుణా తద్గుణములందలి గుణ శబ్దము మాత్రము రూపరస గంధాది గుణవాచి. అచట అన్యదీయ గుణగ్రహణ, అగ్రహణములు రక్త స్ఫటిక వస్త్రమాలిన్యాది న్యాయానుసారము అన్యదీయ గుణముచేతనే అనురంజన, అననురంజనములు వివక్షితములు. తదనుసారముగనే ఉదాహరింపబడినవి.

"కార్యా జని ర్విశేషోక్తిః సతి పుష్కలకారణే" అని విశేషాలంకారము యొక్క సామాన్య లక్షణముచే ఆక్రాంతము లగుటచే అవజ్ఞా-అతద్గుణములు రెండును విశేషోక్తి విశేషములే అయినను ఉల్లాస-తద్గుణ ప్రతిద్వంద్వియగు విశేషాలంకారము కంటె వేరు అలంకారములుగా పరిగణింపబడినవి.

# 78 అనుగుణాలంకారము

ఆ. వె. పరగుణమ్ము చెంత ప్రాక్సిద్ధమౌ గుణ
మతిశయింపఁ గృతుల ననుగుణంబు
చెలి కటాక్షము లవి చేర నతిశయించె
నల్లఁగలువలందు నల్లఁదనము. 139

ప్రాక్సిద్ధము (మును పే సిద్ధించి యున్నది) అగు గుణమే పరగుణము చెంతనున్న పుడతి శయించె చెప్పినని అనుగుణాలంకార మగును.

ఉదా :- చెలి కటాక్షములు దరిఁజేర నల్లఁగలువల నల్లదనము అతి శయించెను.

ఇట చెలి కర్ణభూషణములగు నల్లఁగలువలందు ప్రాక్సిద్ధ మగు నల్లదనమే పరగుణమగు కటాక్షనైల్యము (నీలత్వము) దరిఁ జేరగా ఇంకను అతిశయించెను. కాన నిది అనుగుణాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ ప్రాక్సిద్ధ స్వగుణోత్కర్షోఽను గుణః పరసన్నిధౌః,
నీలోత్పలాని దధతే కటాక్షై రతినీలతామ్.

పరసన్నిధౌ=ఇతర వస్తువు యొక్క, సామీప్యము వలన, ప్రాక్ + సిద్ధ+స్వగుణ+ఉత్కర్షః=మును పే, సిద్ధించియున్న, తన గుణమునకు, ఉత్కర్ష (అతిశయము) అనుగుణః=అనుగుణాలంకా రము (అగును). కటాక్షైః=కొనకంటి చూపులచే నీల+ఉత్పలాని= నల్లఁగలువలు; అంతనీలతామ్=మిక్కిలి నల్లదనమును, దధతే= తాల్చుచున్నవి.

## 79. మీలితాలంకారము

ఆ. వె. ఎసఁగు మీలితంబు కృతి సామ్యబలముచే
కనఁగఁబడదు భేద మనుచుఁ జెప్ప
జవ్వని చరణములు సహజారుణము లౌట
కాన లేమ లక్తకంబు నపుడు. 139

సామ్యబలమును బట్టి అర్థమగు భేదమును కూడా కానలేని యటుల చెప్పు నది మీలితాలంకార మగును.

ఉదా :- జవరాలి చరణములు సహజముగనే అరుణములగుటచే అలక్తకము (లత్తుగ రసము)ను కానలేము.

ఇట జవ్వని చరణగుణమును, లాక్షరస గుణమును, అరుణత్వమే. ఇవి రెండు భిన్నములైనను తగు భేదమున్నను సామ్య బలము వలన ఇట ప్రకృతి సిద్ధమైన అరుణత్వము, లాక్షరసజనిత మైన అరుణత్వము వేఱువఱవ రాకున్నది అని చెప్పుటచే నిది మీలి తాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ మీలితం యది సాదృశ్యాద్భేద ఏవ న దృశ్యతే,
రసో నాలక్షి లాక్షాయాశ్చరణే సహజారుణే.

సాదృశ్యాత్ = సామ్యము వలన; భేదః + ఏవ = భేదమే; న + దృశ్యతే + యది = కన్పింపకపోయిన యెడల; మీలితమ్ = మీలితా లంకారము (అగును). సహజ + అరుణే = పుట్టుకతోడనే ఎఱ్ఱనైన చరణే = పాదము నందు; లాక్షాయాః = లత్తుక యొక్క; రసః = రసలేప నము; న + అలక్షి = కన్పింపలేదు.

## 80. సామాన్యాలంకారము

తే॥ గీ॥ సమత వలన నమరు విశేషంబు లేద
నంగ సామాన్య మన చెల్లునదియె కృతుల

అమల కమలాకరముఁ జొచ్చు నంబుజాక్షి
వదనములు కానరానయ్యె స్పష్టమగుసు. 140

సామ్య బలము వలన ఒప్పెడు విశేష (భేదక ధర్మ) మేదియు లేకుండ చెప్పిన యెడల నది సామాన్యాలంకారమగును. రెండింటికిని భేద ప్రతీతి యున్నను భేదమును చూపెట్టు ధర్మము కన్పించకుండెనేనిది సామాన్యాలంకారమగునని భావము.

ఉదా :- కమలాకరముఁ జొచ్చిన అంబుజాక్షుల ముఖములు వేఱుగ కాన రాకుండెను.

కమలాకరము నందు పద్మములున్నవి. ఆ సరస్సు నందే అంబుజాక్షులు ప్రవేశించినారు. వారి ముఖములకు, పద్మములకుగల సామ్యమును బట్టి అంబుజములేవో అంబుజాక్షుల ముఖము లేవో వేఱుగ కానరాకున్నవి అని చెప్పుటచే నిది సామాన్యాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

విశేషము :- మీలితాలంకారము నందు ఒక వస్తువుచే మఱియొక వస్తువునకు భిన్నమగు స్వరూపము లేనట్లు మీలనము చేయబడును. అనగా ఒక వస్తువుచే భిన్న స్వరూపము కనబడనట్లుగా అన్యవస్తు మీలనము(కప్పిపుచ్చుట)జరుగును. గుణసామ్యముచేతనే ఇట్లు జరుగుచున్నది. సామాన్యాలంకారము నందు వస్తుద్వయమునకు భిన్న స్వరూపమున్నను వ్యావర్తక ధర్మము (=భేదక ధర్మము=విశేషము) కన్పింపదు. పై మీలితోదాహరణము నందు సహజారుణములగు చరణాదులకును, వస్త్వంతరముగ చేరిన యావకారుణ్యము (అలతుంటల ఎఱ్ఱదనము) వేఱుగ భాసించుట లేదు. సామాన్యోదాహరణము నందు పద్మములకును, ముఖములకును- హనుమంతుఁడా రావణ సభలో చూచిన రావణుని దేహమునకు, తత్ప్రతి బింబములకువలె, వస్త్వంతరముగ భాసించుట కలదు.

కాని ఇది పద్మము, ఇది ముఖము; ఇది బింబము, ఇది ప్రతిబింబము అను విశేషము (భేదక ధర్మము) మాత్రము కన్పించుట లేదు. కావున ఒక వస్తువుచే వేఱొక వస్తువునకు గల భేదము తిరోహితమైన మీలితమనియు, అట్లు భేద తిరోధానము లేకున్నను సామ్యముచె విశేషము భాసమానము కానపుడు సామాన్యమనియు గుర్తింప దగును.

## 81. ఉన్మీలితాలంకారము

తే॥ గీ॥ భేద విస్ఫూర్తి దెలుప నభేదమందు
కృతుల నున్మీలితం బది యెసఁగుచుండు.
అధిప! నీ యశోమగ్నమౌ నా హిమాద్రిఁ
జల్లఁ దనమున నమరులు చక్కఁ గంద్రు. 141

అభేదమున్నచోట భేదస్ఫూర్తి చెప్పఁబడిన యెడల ఉన్మీలితా లంకారమగును. అనగా సాదృశ్య వలన రెండు వస్తువులు భిన్నములుగ కన్పింపనపుడు ఆ రెంటికిని విశేషముచె భేదస్ఫూర్తిని తెల్పిన యెడల ఉన్మీలితాలంకారమని భావము.

ఉదా :- ఓ రాజా! నీ కీర్తియందు మగ్నమైన హిమాద్రిని దేవతలు చల్లఁదనముచే గుర్తింతురు.

రాజకీర్తి అంతట వ్యాపించినది. కీర్తి తెల్లగా ప్రకాశించునని కవిసమయము. కాగా తెల్లని రాజకీర్తి యందు సర్వ పర్వతములతోపాటు అన్ని వస్తువులు తెల్లబడినవి. మంచుకొండయగు హిమాద్రి సహజముగనే తెల్లనిది. కీర్తిచే తెల్లనివగు ఇతర పర్వతములకును. హిమాద్రికిని అభేద మేర్పడినది. ఇతర పర్వతములు రూపమున కీర్తిచే తెల్లగనున్నను, హిమాద్రికి మాత్రమే ఉన్న సహజమగు చల్లదనమను విశేషము (భేదక ధర్మము)చే దేవతలు హిమాద్రిని వేఱుగా గుర్తింపగల్గిరని భేదస్ఫూర్తి చెప్పబడుటచే నిది

ఉన్మీలితాలంకారమునకు లక్ష్యమగుచున్నది. కప్పబడిన భిన్నత్వము విశేషముచే ఉన్మీలితము (తెరువబడినది లేక కనుగొనబడినది) ఐనందున దీనికి పేరు సార్థకమగుచున్నది. ఇది మీలితాలంకారమునకు ప్రతిద్వంద్వి.

## 87. విశేషాలంకారము

తే॥ గీ॥ అరయ వైశిష్ట్య విస్ఫూర్తి అలరెనేని
అది విశేషమై కృతులందు నమరియుండు.
వెలఁదుల ముఖంబు లబ్జముల్ వేఱుగాఁగ
తెలిసె వినువీధిఁ జంద్రుండు వెలయునపుడె. 142

సామాన్యముగ విశేష స్ఫూర్తి కలుగనపుడు తద్వైశిష్ట్య స్ఫూర్తి కలిగినట్లు వర్ణించెనేని విశేషాలంకార మగును. సాదృశ్యము వలన రెండు వస్తువుల భేదము కల్పింపనపుడు ఒకానొక కారణముచే వ్యావర్తక ధర్మ స్ఫూర్తి కలిగి రెండును భిన్నములని గుర్తింప సాధ్యమైనట్లు చెప్పిన యెడల విశేషాలంకారమగును. ఇది సామాన్యాలంకారమునకు ప్రతిద్వంద్వి.

ఉదా :- చంద్రుఁ డుదయింపఁగా వెలఁదుల ముఖములును, అబ్జములును వేర్వేఱుగ కాంచబడినవి.

ఇట చంద్రోదయము ఐన వెంటనే అబ్జములు సంకోచము నందినవి (ముడుచుకొన్నవి) ముఖములందెట్టి సంకోచమును లేదు. సంకోచ (పద్మము లందు) తదభావ (ముఖములందు) రూప విశేషము స్ఫురింప అబ్జములు, వెలఁదుల ముఖములు వేర్వేఱని గుర్తింపబడినవి.

సం॥ భేద-వైశిష్ట్యయో స్ఫూర్తా వున్మీలిత విశేషకౌ,
హిమాద్రిం త్వద్యశోమగ్నం సురాః శీతేన జానతే।
లక్షితా న్యుదితే చంద్రే పద్మాని చ ముఖాని చ.

భేద- వైశిష్ట్యయోః=భిన్నతా- విశిష్టతల యొక్క స్ఫూర్తౌ+(సతి)=స్ఫూర్తి కలుగుచున్నది కాఁగా: ఉన్మీలిత-విశేషకౌ=(క్రమముగా) ఉన్మీలితము, విశేషము అను అలంకారములు (అగును) త్వత్+యశః+మగ్నమ్=నీ యొక్క కీర్తి యందు, మునిఁగినట్టి; హిమ+అద్రిమ్=హిమవత్పర్వతమును; సురాః=దేవతలు; శీతేన=శీతలత్వము (చల్లదనము)చే; జానతే=తెలిసికొనుచున్నారు.

చన్ద్రే=చంద్రుఁడు; ఉదితే+(సతి)=ఉదయించినవాఁడు కాఁగా; పద్మాని+చ=పద్మములును; ముఖాని+చ=ముఖములును; లక్షితాని=(వేర్వేఱుగ) గుర్తింపబడినవి.

## 83. ఉత్తరాలంకారము

తే॥ గీ॥ ఉత్తరము కిఞ్చిదాకూత యుక్తమైన
గూఢ ముత్తరమై ప్రీతిఁగూర్చు కృతుల
పాంథ! వేతసి ప్రబలమై పరఁగు నెచట
అచట నీ నది సుతరమై యలరుచుండు 143

ఉత్తరమన సమాధానము. ఆ యుత్తరము గూఢము, చిత్రము నని రెండు విధములుగ నుండును. ఉత్తరము కించిత్ సాకూతమై (ఒకానొక ప్రత్యేకాభిప్రాయముతో కూడినదై) గూఢమైనదిగనున్న యెడల నది గూఢోత్తరమగును.

ఉదా :- ఓ పాంథ! (ఓ పథికుడా) వేతసి (ప్రబ్బలి) దట్టముగ నున్నచోట నది సుతర (సుఖముగా దాటి పోదగినది)గా నుండును.

ఒకానొక తెరువరి "ఈ నదిని ఎచట సులభముగా దాటవచ్చు" నని యడిగినపుడు అచటి తరుణి అతని పొందు నాశించి యిచ్చిన ప్రత్యుత్తరమే ఈ యుదాహరణ వాక్యము. కావున ఇది సాకూత (సాభిప్రాయ) సమాధానము. అక్కడకు కనిపించు ఒక ప్రదేశ

మును నిర్దేశించి చూపుచు "అదిగో వేతసి దట్టముగ నున్నచోటి నది సుఖముగా తరింపఁద నది" అనుటలో ఆ చోటు సంకేత స్థాన మనియు, అచట స్వాతంత్ర్యమనియు ఆకకూర గర్భిమై ఉత్తరము గూఢమైనది. కాన నిది గూఢోత్తరమునకు లక్ష్యమగు చున్న వి.

సం॥ కిఞ్చిదాకూత సహితం స్యాద్గూఢోత్తర ముత్తరమ్,
యత్రాసౌ వేతసీ పాన్థః తత్రేయం సుతరా సరిత్.

కించిత్+ఆకూత+సహితమ్=ఒకానొక, ఆశయముతో, కూడు కొనిన: ఉత్తరమ్=సమాధానమ్: గూఢ+ఉత్తరమ్=గూఢోత్తరా లంకారము: స్యాత్=అగును, హేపాంథ=ఓ తెరువరీ: యత్ర= ఎచట: అసౌ=ఇదిగో ఈ కన్పించుచున్న; వేతసీ=ప్రబ్బలి; (ఉన్నదో) తత్ర=అచట: ఇయం+సరిత్=ఈ నది; సుతరా=సుల భముగా దాటశక్యమైనది.

## చి త్రో త్త ర ము

తే॥ గీ॥ పొసఁగు ప్రశ్నకన్యోత్తరమున కభిన్న
ముత్తరం బీయ చిత్రమై యొప్పు కృతుల
ఏదెదురుకొను ముండ్లతో? నెలయుఁ బ్రాజ్ఞుఁ
డెద్ది? వాణి జనుల కిచ్చునేది? విద్య. 144

ఒకానొక ప్రశ్నకు, అన్యయగు నుత్తరమునకును అభిన్న మైన (వేఱుకాని లేక ఒక్కటే యగు) ఉత్తరము (సమాధానము) చెప్పిన యెడల నది చిత్రోత్తరాలంకార మగును.

ఉదా :- 1- ఏది ముండ్లతో నెదురుకొనును? ఉత్తరము ఏదు (ముండ్లపంది). ఇట ప్రశ్నకు ఉత్తరము అభిన్నము.

2- 1. ప్రాజ్ఞుడు ఎద్ది పొందును. 2. సరస్వతి జనులకేది యిచ్చును? ఉత్తరము-విద్య

ఇందు 1, 2 ప్రశ్నలకు ఉత్తరము, విద్య. ఇట రెండు ప్రశ్నలకు అభిన్నమగు ఉత్తర మీయబడినది,

పై యుదాహరణములో 1వ ప్రశ్నకు ఉత్తర మభిన్నమై యున్నది. ఎట్లన: ఏది+ఎదురుకొనును అని ప్రశ్నించునపుడు పదవి భాగము జేసి ఏదిముండ్లతో నెదురుకొనును? ఏదు+ఎదురు కొనును అని పదవి భాగముచేసి "ఏదు ముండ్లతో నెదురుకొనును" అని ప్రత్యుత్తరమీయగా ప్రశ్నోత్తరములు రెండును అభిన్నము లైనవి. 2వ ఉదాహరణములో మొదటి ప్రశ్నకును (ప్రాజ్ఞులెద్ది పొందును అను దానికిని) అన్యప్రశ్న (సరస్వతి జనుల కేది యిచ్చును ? అను వేఱు ప్రశ్నకును అభిన్నమగు (వేఱుకానిదగు) విద్యయను ఉత్తర మీయబడినది. కావున నిట ప్రశ్న కభినోత్తరము మొదటి దానిలోను, ఒక ప్రశ్నకు అన్యోత్తరమునకు రెండవ లక్ష్యములో అభిన్నమగు -వేఱుకానిదగు విద్యయను- ఉత్తర మీయబడి నందు వలన నిది చిత్రోత్తరమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ ప్రశ్నోత్తరాంతరాభిన్న ముత్తరం చిత్రముచ్యతే,
కే దారపోషణరతాః; కే ఖేటాః ? కిం చలం ? వయః

ప్రశ్న=ఉత్తరా న్తర+అభిన్నమ్=ప్రశ్నకంటెను; మఱియొక ఉత్తరముకంటెను, అభిన్నమైన (వేఱు కానటువంటి); ఉత్తరమ్=సమాధానము; చిత్రమ్=చిత్రోత్తరాలంకారమని; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. దార+పోషణ+రతాః=భార్యను, పోషించుట యందు, ఆసక్తి కలవారు; కే=ఎవరు? (అని ప్రశ్న) (దీనికి) కేదార+పోషణ+రతాః= (పంటనిచ్చు) పొలమును, పోషించుట యందుః ఆసక్తికలవారు (అనునది సమాధానము). ఖేటాః=ఆకాశమునఁ, సంచరించునవి; కే=ఏవి: చలమ్=(నిలకడ లేకుండ లేక ఆగక) పోవునది; కిమ్=ఏది? (ఈ రెండింటికి) వయః=పక్షులు, వయస్సు అను నర్థము గలది సమాధానము.

# 84 సూక్ష్మాలంకారము

ఆ. వె. ఎఱిఁగి పరుని తలఁపు నితరసాశయ చేష్ట
కృతుల సూక్ష్మమయ్యె నెసఁగుచుండు
కాంచుచుండ నేను కాంత యప్పు డచట
చేరుముక్క జుట్టుచేతఁ గప్పె. 145.

పరుని అభిప్రాయము నెఱిఁగిన వ్యక్తి పర విషయమున నొనర్చిన సాభిప్రాయ చేష్టితము సూక్ష్మాలంకార మగును. పరభావ వేత్త యొక్క పర విషయకమైన సాకూత చేష్టయే సూక్ష్మాలంకార మనియు చెప్పవచ్చును.

ఉదా :— నేను చూచుచుండగనే కాంత అప్పుడే అచట తన శిరోజ ములచే చేరు ముక్కను కప్పెను.

ఇట కాముకుని ఉద్దేశించి కాముకి చేసిన సాభిప్రాయ చేష్ట తెలుపబడినది. కాముకుని చూపును బట్టియే అతఁడు సంకేత సమ యమును తెలిసికొన గోరుచున్నాడని గ్రహించిన కాముకి అచట నున్న యితరులకు తెలియకుండుటకై కేశములతో చేరు ముక్క కప్పినట్టి చేష్ట మూలమున గూఢముగ సంకేతిత సమయమును తెల్పెను. ఇట మణి సూర్యుడని, కేశములు చీఁకటి యని ఆమె అభిప్రాయము. కాఁగా చీఁకటిచే సూర్యుఁడు కప్పఁబడినపుడు అనఁగా చీఁకటి పడిన పిమ్మట సంకేత కాలమగు నామె ఈ సాకూత చేష్టచే తెలియఁజేసెను. కావున నిది సూక్ష్మాలంకారమునకు లక్ష్య మగును. సాభిప్రాయోత్తరము— గూఢోత్తరాలంకారమనియు, సాకూత చేష్ట సూక్ష్మాలంకారమనియు గ్రహింపఁదగును.

సం॥ సూక్ష్మం పరాశయాభిజ్ఞేతర సాకూత చేష్టితమ్,
మయి పశ్యతి సా కేశైః సీమన్తమణి మావృణోత్.

పర+ఆశయ+అభిజ్ఞ+ఇతర+సాకూత+చేష్టితమ్ = పరుని అభిప్రాయమును, ఎఱిఁగినట్టి, ఇతరుఁడొనర్చు, సాభిప్రాయమగు చేష్ట: సూక్ష్మః=సూక్ష్మాలంకారము (అగును). మయి+పశ్యతి+(సతి)=నేను చూచుచున్నవాఁడను కాఁగా అనఁగా నేను చూచుచుండఁగనే: సా=ఆమె; కేశైః=శిరోజములచే; సీమన్తమణిం=చేరుచుక్క (పాపటబొట్టు) యందలి, రత్నమును: అవృణోత్=కప్పెను.

## 85. పిహితాలంకారము

ఆ. వె. పరుల వృత్త మెఱుఁగు వారి సాకూత మౌ
చేష్ట పిహిత మనఁగఁ జెల్లు కృతుల.
వేగు వేళ వచ్చు ప్రియునిఁ జూచిన కాంత
తల్పకల్పనమును తానె చేసె.

పరుల నిగూఢ వృత్తాంతము నెఱిఁగినవారు చేయు సాకూత (సాభిప్రాయ) చేష్టయే పిహితాలంకారము అగును.

ఉదా :- వేగు వేళ (ప్రభాత సమయమున) వచ్చుచున్న ప్రియుని గాంచి ప్రియ స్వయముగ తల్పము సమర్చెను.

ఇట "రాత్రి వసతి గృహము నందు మేల్కొని యుండుటచే శ్రాంతుఁడవైతివి. ఇది విశ్రాంతి గైకొను వేళ" యను నభిప్రాయ మా తల్పకల్పన చేష్టయందు గర్భితమై యున్నది. కావున నిది పిహితాలంకారమునకు లక్ష్యమగుచున్నది. సూక్ష్మాలంకారము నందు పరభావము దెలిసి భవిష్యత్కాలమున జరుగనున్న విషయము సాకూత చేష్టచే ప్రకటితమగును. పిహితమున పరుని గత వృత్తాంతము సాకూత చేష్టచే ప్రకాశితమగును.

సం॥ పిహితం పరవృత్తాంత జ్ఞాతుః సాకూత చేష్టితమ్।
ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్పం మకల్పయత్.

పరవృత్తాన్త జ్ఞాతుః=ఇతరుల వృత్తాంత, మెఱింగిన వారి యొక్క; సాకూత+చేష్టితమ్ = సాభిప్రాయచేష్ట; పిహితమ్=పిహితా లంకారము (అగును). ప్రాతః=ఉదయమున; ప్రియే+(గృహ+ఆగతే)=ప్రియుఁడు, ఇంటికి రాఁగా; కాన్తా=భార్య; తల్పమ్=పాన్పును; అకల్పయత్=కల్పించెను (ఏర్పఱచెను).

## 86. వ్యాజోక్త్యలంకారము

తే॥ గీ॥ అన్యహేతూక్తి నాత్మకార్యంపు గుప్తి
చేయ వ్యాజోక్తి నాఁగృతిఁ జెలఁగుచుండు.
ఆలయారామ సుమధూళి నాత్మతనువు
ధూసరితమయి చెలి! చూడు వాసి తగ్గె. 141

ఇతర కారణమును చెప్పి తానొనర్చిన పనిని మఱుఁగుపఱచుట వ్యాజోక్తి యగును. వ్యాజోక్తి యన కపటముతో కూడిన వాక్య మని అర్థము. సత్యమును దాఁచుటకై అసత్య కారణమును చెప్పుట వ్యాజోక్త్యలంకార మనఁబడును.

ఉదా :- ఓ సఖీ! గృహారామ మందలి పుష్పరజముచే నా దేహము
ధూసర వర్ణము గలదై నది చూడుము.

ఒక స్త్రీ గృహోద్యానము నందు జారునితో క్రీడించునపుడు భూమిపై పొరలాడుటచే నామె యొడలు ధూళిధూసరితమైనది. కాఁగా తన చేష్టను కప్పిపుచ్చుచు చెలితో కాంత యన్న వాక్యమిది. జారునితోఁ క్రీడించుటలో నంటిన భూధూళిని ఆరామపుష్పరజము అంటి ఒడలు ధూసరితమైనదని అసత్య కారణము చెప్పి తన చేష్టితము నిట మఱుఁగుపఱచుటచే నిది వ్యాజోక్త్యలంకారమున జెల్లును.

సం॥ వ్యాజోక్తి రన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్,
సఖి! పశ్య గృహారామ పరాగై రస్మి ధూసరా.

అన్య+హేతు+ఉక్త్యా=మఱియొక, కారణమును, చెప్పుటచే; ఆకారస్య=(కొలదిగ వికృతమైన) రూపము యొక్క; గోపనమ్=మఱుఁగుపఱచుట: (ఇతి)+యత్=(అనునది) యేది (కలదో), (అది) వ్యాజ+ఉక్తిః=వ్యాజోక్తియను నలంకారము (అగును). హే సఖి=ఓ చెలీ!; గృహ+ఆరామ+పరాగైః=ఇంటి, పూఁతోట యందలి, పుప్పొడులచే: ధూసరా= ధూసర వర్ణముగల దానను (దుమ్ముకొట్టుకొన్న శరీరము కలదానను); అస్మి=అగుచున్నాను, పశ్య=చూడుము.

## 87. గూఢోక్త్యలంకారము

తే॥ గీ॥ పరున కుద్దిష్టమగు దాని నొరుని గూర్చి
గూఢముగఁ బల్క గూఢోక్తి కొఱలు కృతుల
వృష! పరక్షేత్రమున్ వీడి వేగఁ బొమ్ము
వచ్చుచున్నాఁ డిడిగొ క్షేత్రపాలకుండు. 148

ఇతరునకు చెప్పఁదలచిన విషయమును, ఒరుని (వేఱొకరిని) సంబోధించి గూఢముగ (ప్రక్కనున్నవారికి దెలియకుండునట్లు) పలికిన యెడల గూఢోక్త్యలంకార మగును. ఇట చెప్పెడు వ్యక్తి యొకడు. ఉద్దిష్ట వ్యక్తి (చెప్పదగినవాఁడు) వేఱొకడు. కాని ఆ వ్యక్తిని గాక వేఱొక అప్రకృత వ్యక్తిని సంబోధించి చెప్పుట జరుగును. కావున ప్రకృత వ్యక్తి నిగూఢముగ నుండుట ఇందలి ప్రత్యేకత.

ఉదా :- ఓ వృషమా! (వృషభమా!) పరక్షేత్రము నుండి వేగముగ తొలఁగి పొమ్ము. క్షేత్రపాలకుఁడిదె వచ్చుచున్నాఁడు.

ఇట పరకళత్రమును అనుభవించుచున్న కాముకుని గూర్చి చెప్పదగినది ఈ వాక్యము. కాఁగా సమీపమున పరుల క్షేత్రమందు

పైరు మేయుచున్న ఒక వృషభమును నిర్దేశించి చెప్పఁబడినది. కాముకుడు గూఢముగ నున్నాడు. దానికంతటికిని క్షేత్ర, క్షేత్ర పాలక శబ్దములు మూలములైనవి. క్షేత్ర శబ్దమునకు పంట భూమి, భార్య అను నర్థములు గలవు, అట్లే క్షేత్రపాలక శబ్దమునకును పొలముకాపు, భర్త అను నర్థములు గలవు. ఈ శ్లేషార్థముచే "ఓయీ! పర కళత్రమును విడిచిపొమ్ము, ఆమె భర్త ఇదే వచ్చుచున్నాఁడు" అన్న వివక్షితార్థము స్పష్టమగుచున్నది. సందర్భమును బట్టి అట్టి యర్థము గ్రాహ్యమగును. ఆ యర్థము సందర్భర్భ మెఱుఁగని వారికి స్ఫురింపదు. కావున నిది గూఢోక్త్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ గూఢోక్తి రన్యోద్దేశ్యం చేద్యదన్యం ప్రతి కథ్యతే,
వృషాపేహి పరక్షేత్రా దాయాతి క్షేత్ర రక్షకః.

అన్య+ఉద్దేశ్యమ్=అన్యుని ఉద్దేశించిన; యత్=ఏ వాక్యము, (కలదో) (అది) అన్యం+ప్రతివేఱొకరిని గూర్చి; కథ్యతే+చేత్=చెప్పఁబడుచున్నదయ్యేనేని గూఢోక్త్యలంకారమగును. హేవృష=ఓ వృషభమా!; పరక్షేత్రాత్=అన్య క్షేత్రము నుండి; అపేహి=తొలఁగిపొమ్ము; క్షేత్రపాలకః=క్షేత్రస్వామి; ఆయాతి=వచ్చుచున్నాడు.

## 88. వివృతోక్త్యలంకారము

తే॥ గీ॥ శ్లిష్టగుప్తమున్ గవి యెట్లొ చెప్పెనేని
వివృత మను నలంకారమై వెలయుచుండు,
వృషః పర క్షేత్రమున్ వేగ వీడి పొమ్ము
టంచు సూచనాయుతముగ నలరఁజెప్పె. 149

శ్లేషయుక్తమై గుప్తమైయున్న వివక్షితార్థమును కవి సూచనాత్మకముగ బయల్పఱచెనేని వివృతోక్త్యలంకార మగును.

ఉదా :- ఓ వృషభమా! పరక్షేత్రము నుండి తొలగిపొమ్ము అని
సనూచనముగా బలికెను.

ఇట "ఓ వృషభమా! పరక్షేత్రము నుండి తొలఁగిపొమ్ము" అనునది గూఢోక్తి. కాని "సనూచనముగ బలికెను" అను మాటలచే నీ వాక్యము కేవలము వృషభము నుద్దేశించి పల్కినది కాదను విషయము బయల్పఱుప బడుటచే నిది వివృతోక్త్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ వివృతోక్తిః శ్లిష్టగుప్తం కవినాఽఽవిష్కృతం యది.
వృషాపేహి పరక్షేత్రాదితి వక్తి సనూచనమ్.

శ్లిష్ట+గుప్తమ్=శ్లేషాదులచే, గోపనము చేయబడినదై; కవినా=కవిచేత; ఆవిష్కృతమ్=బయలుపఱుపబడినది; (స్యాత్)+ యది=ఐన యెడల; వివృత+ఉక్తిః= వివృతోక్తియను నలంకార మగును. హే వృషః=ఓ వృషభమా!; పరక్షేత్రాత్=అన్యక్షేత్రము నుండి; అపేహి=తొలఁగిపొమ్ము; ఇతి=అని; సనూచనమ్=సూచనగా, వక్తి=వచించుచున్నాడు.

## 89. యుక్త్యలంకారము

ఆ. వె. ఆత్మ మర్మగుప్తి నాశించి క్రియచేత
పరుల వంచనంబె పరఁగు యుక్తి.
చిత్రమందు నిన్ను చిత్రించు చెలి యన్యఁ
గని విరివిలు చేతఁ గలుగ గీసె. 150

తన రహస్యము దాఁచుటకై క్రియతో పరులను వంచించుట యుక్త్యలంకార మనఁబడును.

ఉదా :- చిత్రమందు నిన్ను చిత్రించుచు మాచెలి అన్యస్త్రీని చూచి విరివింటిని చేతిలో నమరగీసెను.

ఇది నాయకునితో దూతిక చెప్పిన మాట. చెలి నీ చిత్రము గయునపుడు మఱియొక స్త్రీ తన దగ్గఱకు రాగా తన రహస్యమును కప్పిపుచ్చుటకై చిత్రము చేతిలో విరి (పువ్వు) వింటిని గీసెను. అప్పుడా చిత్రము మన్మథునిదిగా తలంపబడును- ఇట్లు నాయకుని యందు తనకున్న యనురాగమును దాచుటకై నాయిక బొమ్మ చేతిలో కుసుమ ధనువును లిఖించునట్టి క్రియచేత పరస్త్రీని వంచించుటజరిగినది. కావున నిది యుక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ యుక్తిః పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే,
త్వామాలిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరేఽలిఖత్.

మర్మ+గుప్తయే=రహస్యమును, దాచుటకై; క్రియయా= (ఒకానొక) చేష్టచే; పర+అతిసంధానమ్=ఇతరులను వంచించుట; యుక్తిః=యుక్త్యలంకారము(అగును), త్వామ్=నిన్ను; ఆలిఖన్తీ= చిత్రించుచున్న (మా చెలి); అన్యామ్=ఇతర స్త్రీని; దృష్ట్వా=చూచి; కరే=(బొమ్మ) చేతియందు; పౌష్పం+ధనుః=పూవింటిని; అలిఖత్= చిత్రించెను.

## 90. లోకోక్త్యలంకారము

తే॥ గీ॥ అరయ లోకోక్త్యలంకార మలరుచుండు
కృతుల లోకప్రవాదానుకృతియె నిలుప.
దనుల మూసికొనుచు నీవు కడఁక నటులె
కడపు మాత్ర మేమియు లేక కొలఁది నెలలు 151

లోక ప్రవాదము ననుకరించి చెప్పుటయే లోకోక్త్యలంకార మనఁబడును.

ఉదా :- త్వరపడక కనులు మూసికొనుచు కొలఁది నెల లటులనే కడపుము.

ఈ వాక్యము ప్రోషిత భర్తృకయగు నొక నాయిక నోదార్చుచు ఆమె చెలికత్తె చెప్పినది.

ఇట కొలఁది నెలలు "కనులు మూసికొనుము" అనునది లోకోక్తి ఈ లోకోక్తికి ఓర్పుతో కష్టములు సహించుచు కొలఁది నెల లుండమ"ని యర్థము. అంతియే కాని కనులు మూసి అంధత్వ మును పొందుమని మాత్రము కాదు. ఇట్లు ప్రత్యేకార్థమును దెల్పుచు లోకమున కొన్ని పలుకుబళ్లు లోకోక్తులు లేక సామెతలు అను పేర వ్యాప్తమై యున్నవి. అట్టి పలుకుబడి ఇట అనుకరింపబడుటచే నిది లోకోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ లోక ప్రవాదాను కృతిర్లోకోక్తిరితి కథ్యతే,
సహస్వ కతిచిన్మాసాన్ మీలయిత్వా విలోచనే.

లోక+ప్రవాద+అనుకృతిః=లోకమందలి, వాడుకను, అను కరించుటః లోక+ఉక్తిః+ఇతి=లోకోక్తియను నలంకారము, అని, కథ్యతే=చెప్పఁబడుచున్నది. విలోచనే=కనులను: మీలయిత్వా= మూసికొని; కతిచిత్=కొన్ని; మాసాన్=నెలలు; సహస్వ=(కష్టము లను) ఓర్చుకొనుము.

## 91. ఛేకోక్త్యలంకారము

తే॥ గీ॥ కథితలోకోక్తి యన్యార్థ గర్భితంబు
నైన ఛేకోక్త్యలంకార మమరు కృతుల.
"భుజగమే యెఱుఁగఁ గలదా భుజగచరణ
మరయుమో మిత్రమా!"" యంచు నతఁడు వలికె. 152

లోకోక్తియే అన్యార్థ (అర్థాంతర) గర్భితమై యొప్పునెడల ఛేకోక్త్యలంకార మగును. ఇందు లోకోక్తి లక్షణములతో పాటు అర్థాంతరము కూడ వ్యక్తమగుచుండును.

ఉదా :- ఓ మిత్రమా! భుజగచరణమును భుజగమే యెఱుఁగునని గ్రహింపుము.

సందర్భము :- ఇట నల్గురు వ్యక్తులకు సంబంధించిన ప్రసక్తి కలదు. 1. రాముడు 2. కృష్ణుడు 3. గోపాలుఁడు 4. గోవిం

# 84 సూక్ష్మాలంకారము

ఆ. వె. ఎఱిఁగి పరుని తలఁపు నితరసాశయ చేష్ట
కృతుల సూక్ష్మమయ్యు నెసఁగుచుండు
కాంచుచుండ నేను కాంత యుప్పు డచట
చేరుచుక్క జుట్టుచేతఁ గప్పె. 145.

పరుని అభిప్రాయము నెఱిఁగిన వ్యక్తి పర విషయమున నొనర్చిన సాభిప్రాయ చేష్టితము సూక్ష్మాలంకార మగును. పరభావ వేత్త యొక్క పర విషయకమైన సాకూత చేష్టయే సూక్ష్మాలంకార మనియు చెప్పవచ్చును.

ఉదా :- నేను చూచుచుండగనే కాంత అప్పుడే అచట తన శిరోజ
ములచే చేరు చుక్కను కప్పెను.

వి. ఇట కాముకుని ఉద్దేశించి కాముకి చేసిన సాభిప్రాయ చేష్ట తెలుపబడినది. కాముకుని చూపును బట్టియే అతఁడు సంకేత సమయమును తెలిసికొన గోరుచున్నాడని గ్రహించిన కాముకి అచట నున్న తదితరులకు తెలియకుండుటకై కేశములతో చేరు చుక్క కప్పినట్టి చేష్ట మూలమున గూఢముగ సంకేతిత సమయమును తెల్పెను. ఇట మణి సూర్యుడని, కేశములు చీఁకటి యని ఆమె అభిప్రాయము. కాఁగా చీఁకటిచే సూర్యుఁడు కప్పఁబడినపుడు అనఁగా చీఁకటి పడిన పిమ్మట సంకేత కాలముగ నామె ఈ సాకూత చేష్టచే తెలియఁజేసెను. కావున నిది సూక్ష్మాలంకారమునకు లక్ష్యమగును. సాకూతోత్తరము- గూఢోత్తరాలంకారమనియు, సాకూత చేష్ట సూక్ష్మాలంకారమనియు గ్రహింపఁదగును.

సం॥ సూక్ష్మం పరాశయాభిజ్ఞేతర సాకూత చేష్టితమ్,
మయి పశ్యతి సా కేశైః సీమన్తమణి మావృణోత్.

పర+ఆశయ+అభిజ్ఞ+ఇతర+సాకూత+చేష్టితమ్ = పరుని అభిప్రాయమును, ఎఱిఁగినట్టి, ఇతరుడొనర్చు, సాభిప్రాయమగు చేష్ట: సూక్ష్మ:=సూక్ష్మాలంకారము (అగును). మయి+పశ్యతి+ (సతి)=నేను చూచుచున్నవాడను కాఁగా అనఁగా నేను చూచుచుండ గనే: సా=ఆమె; కేశైః=శిరోజములచే; సీమన్తమణిం=చేరుచుక్క (పాపటబొట్టు) యందలి, రత్నమును: ఆవృణోత్=కప్పెను.

## 85. పిహితాలంకారము

ఆ. వె. పరుల వృత్త మెఱుఁగు వారి సాకూత మౌ
చేష్ట పిహిత మనఁగఁ జెల్లు కృతుల.
వేగు వేళ వచ్చు ప్రియునిఁ జూచిన కాంత
తల్పకల్పనమును తానె చేసె.

పరుల నిగూఢ వృత్తాంతము నెఱిఁగినవారు చేయు సాకూత (సాభిప్రాయ) చేష్టయే పిహితాలంకారము అగును.

ఉదా :- వేగు వేళ (ప్రభాత సమయమున) వచ్చుచున్న ప్రియుని
గాంచి ప్రియ స్వయముగ తల్పము నమర్చెను.

ఇట "రాత్రి వసతి గృహము నందు మేల్కొని యుండుటచే శ్రాంతుఁడ వైతివి. ఇది విశ్రాంతి గైకొనువేళ" యను నభిప్రాయ మా తల్పకల్పన చేష్టయందు గర్భితమై యున్నది. కావున నిది పిహితాలంకారమునకు లక్ష్యమగు చున్నది. సూక్ష్మాలంకారము నందు పరభావము దెలిసి భవిష్యత్కాలమున జరుగనున్న విషయము సాకూత చేష్టచే ప్రకటితమగును. పిహితమున పరుని గత వృత్తాంతము సాకూత చేష్టచే ప్రకాశితమగును.

సం॥ పిహితం పరవృత్తాంత జ్ఞాతుః సాకూత చేష్టితమ్।
ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్ప మకల్పయత్.

పరవృత్తాన్త జ్ఞాతుః=ఇతరుల వృత్తాంత, మెఱింగిన వారి యొక్క: సాహత+చేష్టితమ్ = సాభిప్రాయచేష్ట: పిహితమ్=పిహితా లంకారము (అగును). ప్రాతః=ఉదయమున: ప్రియే+(గృహ+ఆగతే)=ప్రియుఁడు, ఇంటికి రాఁగా: కాన్తా=భార్య: తల్పమ్= పాన్పును; అకల్పయత్=కల్పించెను (ఏర్పఱచెను).

## 86. వ్యాజోక్త్యలంకారము

తే॥ గీ॥ అన్యహేతూక్తి నాత్మకార్యంపు గుప్తి
చేయ వ్యాజోక్తి నాఁగృతిఁ జెలఁగుచుండు.
ఆలయారామ సుమధూళి నాత్మతనువు
ధూసరితమయి చెలి! చూడు వాసి తగ్గె. 141

ఇతర కారణమును చెప్పి తానొనర్చిన పనిని మఱుఁగుపఱచుట వ్యాజోక్తి యగును. వ్యాజోక్తి యన కపటముతో కూడిన వాక్య మని అర్థము. సత్యమును దాఁచుటకై అసత్య కారణమును చెప్పుట వ్యాజోక్త్యలంకార మనఁబడును.

ఉదా :– ఓ సఖీ! గృహారామ మందలి పుష్పరజముచే నా దేహము ధూసర వర్ణము గలదై నది చూడుము.

ఒక స్త్రీ గృహోద్యానము నందు జారునితో క్రీడించునపుడు భూమిపై పొరలాడుటచే నామె యొడలు ధూళిధూసరితమైనది. కాఁగా తన చేష్టను కప్పిపుచ్చుచు చెలితో కాంత యన్న వాక్యమిది. జారునితోఁ క్రీడించుటలో నంటిన భూధూళిని ఆరామపుష్పరజము అంటి ఒడలు ధూసరితమైనదని అసత్య కారణము చెప్పి తన చేష్టితము నిట మఱుఁగుపఱచుటచే నిది వ్యాజోక్త్యలంకారమగు నని తెల్లును.

సం॥ వ్యాజోక్తి రన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్,
సఖి! పశ్య గృహారామ పరాగై రస్మి ధూసరా.

అన్య+హేతు+ఉక్త్యా=మఱియొక, కారణమును, చెప్పుటచే; ఆకారస్య=(కొలదిగ వికృతమైన) రూపము యొక్క; గోపనమ్= మఱుఁగుపఱచుట: (ఇతి)+యత్=(అనునది) యేది (కలదో), (అది) వ్యాజ+ఉక్తిః=వ్యాజోక్తియను నలంకారము (అగును). హే సఖి=ఓ చెలీ; గృహ+ఆరామ+పరాగైః=ఇంటి, పూలతోట యందలి, పుప్పొడులచే: ధూసరా= సర వర్ణముగల దానను (దుమ్ము కొట్టుకొన్న శరీరము కలదానను); అస్మి=అగుచున్నాను, పశ్య=చూడుము.

## 87. గూఢోక్త్యలంకారము

తే॥ గీ॥ పరున కుద్దిష్టమగు దాని నొరుని గూర్చి
గూఢముగఁ బల్క గూఢోక్తి కొఱలు కృతుల
వృషః పరక్షేత్రమున్ వీడి వేగఁ బొమ్ము
వచ్చుచున్నాఁ డిడిగొ క్షేత్రపాలకుండు. 148

ఇతరునకు చెప్పఁదలచిన విషయమును, ఒరుని (వేఱొకరిని) సంబోధించి గూఢముగ (ప్రక్కనున్న వారికి దెలియకుండునట్లు) పలికిన యెడల గూఢోక్త్యలంకార మగును. ఇట చెప్పెడు వ్యక్తి యొకడు. ఉద్దిష్ట వ్యక్తి (చెప్పదగినవాఁడు) వేఱొకడు. కాని ఆ వ్యక్తిని గాక వేఱొక అప్రకృత వ్యక్తిని సంబోధించి చెప్పుట జరుగును. కావున ప్రకృత వ్యక్తి నిగూఢముగ నుండుట ఇందలి ప్రత్యేకత.

ఉదా :- ఓ వృషమా! (వృషభమా!) పరక్షేత్రము నుండి వేగముగ తొలఁగి పొమ్ము. క్షేత్రపాలకుఁడిదె వచ్చుచున్నాడు.

ఇట పరకళత్రమును అనుభవించుచున్న కాముకుని గూర్చి చెప్పదగినది ఈ వాక్యము. కాఁగా సమీపమున పరుల క్షేత్రమందు

పైరు మేయుచున్న ఒక వృషభమును నిర్దేశించి చెప్పబడినది. కాముకుడు గూఢముగ నున్నాడు. దానికంతటికిని క్షేత్ర, క్షేత్రపాలక శబ్దములు మూలములైనవి. క్షేత్ర శబ్దమునకు పంట భూమి, భార్య అను నర్థములు గలవు, అట్లే క్షేత్రపాలక శబ్దమునకును పొలముకాపు, భర్త అను నర్థములు గలవు. ఈ శ్లేషార్థముచే "ఓయీ! పర కళత్రమును విడిచిపొమ్ము, ఆమె భర్త ఇదే వచ్చుచున్నాఁడు" అన్న వివక్షితార్థము స్పష్టమగుచున్నది. సందర్భమును బట్టి అట్టి యర్థము గ్రాహ్యమగును. ఆ యర్థము సందర్భర్భ మెఱుఁగని వారికి స్ఫురింపదు. కావున నిది గూఢోక్త్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ గూఢోక్తి రన్యోద్దేశ్యం చేద్యదన్యం ప్రతి కథ్యతే,
వృషాపేహి పరక్షేత్రా దాయాతి క్షేత్ర రక్షకః.

అన్య+ఉద్దేశ్యమ్=అన్యుని ఉద్దేశించిన; యత్=ఏ వాక్యము, (కలదో) (అది) అన్యం+ప్రతివేఱొకరిని గూర్చి; కథ్యతే+చేత్=చెప్పఁబడుచున్నదయ్యేనేని గూఢోక్త్యలంకారమగును. హేవృష=ఓ వృషభమా!; పరక్షేత్రాత్=అన్య క్షేత్రము నుండి; అపేహి=తొలఁగిపొమ్ము; క్షేత్రపాలకః=క్షేత్రస్వామి; ఆయాతి=వచ్చుచున్నాడు.

## 88. వివృతోక్త్యలంకారము

తే॥ గీ॥ శ్లిష్టగుప్తమున్ గవి యెట్లొ చెప్పెనేని
వివృత మను నలంకారమై వెలయుచుండు,
వృష పర క్షేత్రమున్ వేగ వీడి పొమ్ము
టంచు సూచనాయుతముగ నలరఁజెప్పె. 149

శ్లేషయుక్తమై గుప్తమైయున్న వివక్షితార్థమును కవి సూచనాత్మకముగ బయల్పఱచెనేని వివృతోక్త్యలంకార మగును.

ఉదా :- ఓ వృషభమా! పరక్షేత్రము నుండి తొలఁగిపొమ్ము అని సనూచనముగా బలికెను.

ఇట "ఓ వృషభమా! పరక్షేత్రము నుండి తొలఁగిపొమ్ము" అనునది గూఢోక్తి. కాని "సనూచనముగ బలికెను" అను మాటలచే నీ వాక్యము కేవలము వృషభము నుద్దేశించి పల్కినది కాదను విషయము బయల్పఱుప బడుటచే నిది వివృతోక్త్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ వివృతోక్తిః శ్లిష్టగుప్తం కవినాఽఽవిష్కృతం యది.
వృషాపేహి పరక్షేత్రాదితి వక్తి ససూచనమ్.

శ్లిష్ట+గుప్తమ్=శ్లేషాదులచే, గోపనము చేయబడినది; కవినా=కవిచేత; ఆవిష్కృతమ్=బయలుపఱపబడినది; (స్యాత్)+యది=ఐన యెడల; వివృత+ఉక్తిః= వివృతోక్తియను నలంకారము. హే వృషః=ఓ వృషభమా!; పరక్షేత్రాత్=అన్యక్షేత్రము నుండి; అపేహి=తొలఁగిపొమ్ము: ఇతి=అని: ససూచనమ్=సూచనగా, వక్తి=వచించుచున్నాడు.

## 89. యుక్త్యలంకారము

ఆ. వె. ఆత్మ మర్మగుప్తి నాశించి క్రియచేత
పరుల వంచనంబె పరఁగు యుక్తి.
చిత్రమందు నిన్ను చిత్రించు చెలి యన్యఁ
గని విరివిలు చేతఁ గలుగ గీసె. 150

తన రహస్యము దాఁచుటకై క్రియతో పరులను వంచించుట యుక్త్యలంకార మనఁబడును.

ఉదా :- చిత్రమందు నిన్ను చిత్రించుచు మాచెలి అన్యస్త్రీని చూచి విరివింటిని చేతిలో నమరగీసెను.

ఇది నాయకునితో దూతిక చెప్పిన మాట. చెలి నీ చిత్రము గయునపుడు మఱియొక స్త్రీ తన దగ్గఱకు రాగా తన రహస్యమును కప్పిపుచ్చుటకై చిత్రముచేతిలో విరి (పువ్వు) వింటిని గీసెను. అప్పుడా చిత్రము మన్మథునిదిగా తలంపబడును. ఇట్లు నాయకుని యందు తనకున్న యనురాగమును దాచుటకై నాయిక బొమ్మ చేతిలో కుసుమ ధనువును లిఖించునట్టి క్రియచేత పరస్త్రీని వంచించుటజరిగినది. కావున నిది యుక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

శ్లో॥ యుక్తిః పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే,
త్వామాలిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరేఽలిఖత్.

మర్మ+గుప్తయే=రహస్యమును, దాచుటకై; క్రియయా= (ఒకానొక) చేష్టచే; పర+అతిసంధానమ్=ఇతరులను వంచించుట; యుక్తిః=యుక్త్యలంకారము(అగును); త్వామ్=నిన్ను; ఆలిఖన్తీ= చిత్రించుచున్న (మా చెలి); అన్యామ్=ఇతర స్త్రీని; దృష్ట్వా=చూచి, కరే=(బొమ్మ) చేతియందు; పౌష్పం+ధనుః=పూవింటిని; అలిఖత్= చిత్రించెను.

## 90. లోకోక్త్యలంకారము

తే॥ గీ॥ అరయ లోకోక్త్యలంకార మలరుచుండు
కృతుల లోకప్రవాదానుకృతియె నిలుప.
దనుల మూసికొనుచు నీవు కడఁక నటులె
కడపు మాత్ర మేమియు లేక కొలఁది నెలలు 151

లోక ప్రవాదము ననుకరించి చెప్పుటయే లోకోక్త్యలంకార మనఁబడును.

ఉదా :- త్వరపడక కనులు మూసికొనుచు కొలఁది నెల లటులనే కడపుము.

ఈ వాక్యము ప్రోషిత భర్తృకయగు నొక నాయిక నోదార్చుచు ఆమె చెలికత్తె చెప్పినది.

ఇట కొలఁది నెలలు "కనులు మూసికొనుము" అనునది లోకోక్తి. ఈ లోకోక్తికి ఓర్పుతో కష్టములు సహించుచు కొలఁది నెలలుండుమ"ని యర్థము. అంతియే కాని కనులు మూసి అంధత్వమును పొందుమని మాత్రము కాదు. ఇట్లు ప్రత్యేకార్థమును దెల్పుచు లోకమున కొన్ని పలుకుబళ్లు లోకోక్తులు లేక సామెతలు అను పేర వ్యాప్తమై యున్నవి. అట్టి పలుకుబడి ఇట అనుకరింపఁబడుటచే నిది లోకోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ లోక ప్రవాదాను కృతిర్లోకోక్తిరితి కథ్యతే,
సహస్వ కతిచిన్మాసాన్ మీలయిత్వా విలోచనే.

లోక+ప్రవాద+అనుకృతిః=లోకమందలి, వాడుకను, అనుకరించుటః లోక+ఉక్తిః+ఇతి=లోకోక్తియను నలంకారము, అని, కథ్యతే=చెప్పఁబడుచున్నది. విలోచనే=కనులను: మీలయిత్వా=మూసికొని; కతిచిత్=కొన్ని; మాసాన్=నెలలు; సహస్వ=(కష్టములను) ఓర్చుకొనుము.

## 91. ఛేకోక్త్యలంకారము

తే॥ గీ॥ కథితలోకోక్తి యన్యార్థ గర్భితంబు
లైన ఛేకోక్త్యలంకార మమరు కృతుల.
"భుజగమే యెఱుఁగఁ గలదా భుజగచరణ
మరయుమో మిత్రమా!"" యంచు నతఁడు వలికె. 152

లోకోక్తియే అన్యార్థ (అర్థాంతర) గర్భితమై యొప్పునెడల ఛేకోక్త్యలంకార మగును. ఇందు లోకోక్తి లక్షణములతోపాటు అర్థాంతరము కూడ వ్యక్తమగుచుండును.

ఉదా :- ఓ మిత్రమా! భుజగచరణమును భుజగమే యెఱుఁగునని గ్రహింపుము.

సందర్భము :- ఇట నల్గురు వ్యక్తులకు సంబంధించిన ప్రసక్తి కలదు. 1. రాముడు 2. కృష్ణుడు, 3. గోపాలుఁడు 4. గోవిం

డుఁడని ఆ నల్వుర పేర్లు అని యనుకొనుఁడు. అప్పుడు రాముఁడు కృష్ణుని వద్దకేగి గోవిందుని వృత్తాంతమెఱుఁగ గోరఁగా కృష్ణుఁడు కొంతదూరమున కన్పించు వ్యక్తిని చూపించుచు "భుజగ చరణములు భుజగమే యెఱుఁగును (పాముకాళ్ళు పాముకే తెలియును) అనుచు అర్థాంతర గర్భితమగు లోకోక్తిని చెప్పెను. ఈ లోకోక్తిని బట్టి గోవిందుని వృత్తాంతము తనకు (కృష్ణునకు) తెలియదు. ఆతని వృత్తాంతము లోక వ్యవహారము లందు ఐక్యముగ నడచు కొనునట్టి ఆ గోపాలునకే తెలియునను కృష్ణుని యభిప్రాయము పై లోకోక్తి మూలమున తెలుపఁబడినది. వారలిద్దరు సామాన్య లోక వ్యవహారములందేకాక విశేష (ప్రత్యేక) వ్యవహారములందును కలసి మెలగు దురను నర్థాంతరము కూడ దీనిచే తెలుపబడినది. ఇట్లిచట లోకోక్తి అర్థాంతర గర్భితమై ప్రయుక్తమైనది. కావున నిది ఛేకోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఛేకులనగా ప్రతిభ గలవారు. వారే ఇట్టి లోకోక్తులను ప్రయోగింపగలరు. వానిని అర్థము చేసికొన గలరు. ఇది ఇట్లు ఛేకులకు సంబంధించిన ఉక్తియై "ఛేకోక్తి"గా సార్థకమగుచున్నది.

సం॥ ఛేకోక్తిర్యత్ర లోకోక్తేః స్యాదర్థాన్తర గర్భితా,
భుజఙ్గ ఏవ జానీతే భుజఙ్గ చరణం సఖే.

యత్ర=ఎచట: లోకోక్తేః=లోకోక్తి (సామెత), అర్థాంతర గర్భితా=అన్యార్థము అన్తర్గతమై ఉండునది; స్యాత్=అగునో (అచట); ఛేకోక్తిః=ఛేకోక్తి యను నలంకారము (అగును); హే సఖే!=ఓ మిత్రమా! భుజఙ్గ చరణమ్ = పాము పాదమును; భుజఙ్గః+ఏవ=పామే: జానీతే=ఎఱుఁగును.

## 92. వక్రోక్త్యలంకారము

తే॥ గీ॥ కొఱలు వక్రోక్తి శ్లేషకాకువుల వలన
నలరు నన్యార్థ కల్పనం బమరెనేని
కొడుకు నభిమతంబు తెలిసికొను మనంగ
కొనఁగ నర్థ ముండవలదె? అనియె పత్ని. 153

శ్లేషచేతఁగాని, కాకువు (శోకభయాదుల వలన కలుగు ధ్వని వికారము) చేతఁగాని అర్థాంతర కల్పనమమరిన యెడల వక్రోక్త్యలంకారమగును.

ఉదా :- కొడుకు నభిమతము తెలిసికొనుమని భర్త యనఁగా,
కొనుటకు అర్థముండవలదా? అని భార్య ప్రశ్నించెను.

ఇట భర్త ఒకానొక విషయమున కుమారుని అభిమతమేమో తెలిసికొను మనగా భార్య కొనుటకు అర్థముండ వలదా? అని ప్రశ్నించెను. భర్త అభిప్రాయములో తెలిసికొనుము అనునది ఒకే పదము. దానికి కుమారుని అభిప్రాయమేమో అడిగి కనుగొనుమని అర్థము. ఆ పదమునే భార్య తెలిసి+కొనుము (ఆ వస్తువు మంచిది అవునో కాదో తెలిసికొని కొనుము) అను నభిప్రాయము కలదిగా భావించి, చేతిలో కొనుటకు కావలసిన ధనము ఉండవలెను గదా! చేతిలో అర్థము (ధనము) లేదు. కావున కొనుట యెట్లు? అను నభిప్రాయమును పత్ని తెల్పుట స్పష్టము. ఇది యంతయు ఏక పదమును విడదీయుటచే కల్గిన వేరొక యర్థమును బట్టి జరిగి నది. ఇట శ్లేష వలన నర్థాంతర కల్పనము జరిగినది. కావున నిది వక్రోక్త్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ వక్రోక్తిః శ్లేషకాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్,
ముంచ మానం దినం ప్రాప్తం నేహ నందీ హరాన్తికే.

శ్లేష+కాకుభ్యామ్=శ్లేష వలనగాని, కాకుస్వరము వలనగాని, అపర+అర్థ+ప్రకల్పనమ్=మరియొక, అర్థము యొక్క, కల్పనము; (జరిగిన యెడల); వక్ర+ఉక్తిః=వక్రోక్తి(వక్రముగు ఉక్తి) యను నలంకారము (అగును). మానమ్=ప్రణయకోపమును; ముఞ్చ=విడువుము, దినమ్=పగటివేళ: ప్రాప్తమ్=చేరువైనది, ప్రాప్తమ్=చేఁజిక్కినః నందినమ్=నందినిని: మా ముఞ్చ=విడువవలదు, నన్దీ=నందిని; ఇహ=ఇచట; న=లేదు,(ఆ నందిని) హర+అన్తికే=శివుని దగ్గఱ; (ఉన్నది).

తే॥ గీ॥ తనరఁ బరికింపక తగ దీ కన లనంగ,
కనలు తగనిదే యని మాలఁ గలఁగ మోదె. 154

చక్కగా పరిశీలించ కుండ ఇట్టి కోపము తగదని చెప్పఁబడిన వనిత, ఈ కోపము తగనిదే? అనుచు మాలతో నామె అతనిని మోదెను. అను నీ యుదాహరణమందు "ఈ కోపము తగనిదా?" అని కాకుస్వరముచే "ఇది తగినదే" అను నర్థాంతరమును కల్పించుట జరిగినంది కాన నిది రెండవ వక్రోక్తికి ఉదాహరణ మగుచున్నది.

సం॥ అసమాలోచ్య కోపస్తే నోచితోఽయ మతీరితా,
నైవోచితోఽయ మితి తం తాడయామాస మాలయా.

అసమాలోచ్య=చక్కగా నాలోచింపకుండ; అయమ్+తే+కోపః=ఈ, నీ, కోపము; ఉచితః+న=తగినది, కాదు; ఇతి+ఈరితా=అని చెప్పబడిన వనిత; అయమ్=ఇది; ఉచితః+న+ఏవ=తగినది కానే కాదా!: ఇతి=అని: తమ్=అతనిని: మాలయా=పూదండతో; తాడయామాస=కొట్టెను.

గమనిక :- మొదటి ఉదాహరణములోని సంస్కృత పద జాలమును తెనుఁగు భాషలోని కనుడించుట దుర్ఘట మగుటనుబట్టి

సందర్భోచితముగ తెనుఁగు పదముల నుపయోగించియే శ్లేషచే నర్థాంతరము కల్పించి చూపుట జరిగినది.

## 93. స్వభావోక్త్యలంకారము

తే॥ గీ॥ జగతి జాత్యాదు లందుండు సహజభావ
వర్ణనమె స్వభావోక్తినా వఱలుచుండు
స్తబ్ధకర్ణములు తరంగితాక్షు లలర
మృగచయము చూచు మోరను మీఁదికెత్తి. 155

జాతి క్రియాదులకు సంబంధించి యుండు స్వభావమును వర్ణించుట స్వభావోక్త్యలంకారమని చెప్పబడుచున్నది. ఇట జాత్యాదులన జాతి-క్రియా-గుణాదులని అభిప్రాయము. సహజ స్వభావ వర్ణన మనగా వాని వానికి ఉన్న భావము నున్నట్లే వర్ణించుట. కాన నిది స్వభావోక్తి యని సార్థకమగుచున్నది.

ఉదా :- స్తబ్ధ కర్ణములు, తరంగితాక్షులు గల మృగచయము మోరయెత్తి చూచుచున్నది.

ఇట మిక్కిలి పిఱికితనము గల మృగజాతి ఏ క్షణమున నెటు నుండి ఏ శబ్దము వచ్చుచున్నదో, ఏ ప్రమాదము రానున్నదోయను నిత్యశంకతో చెవులు ఱిక్కించి, మోరయెత్తి తరంగితములగు కనులతో బెదురు చూపులు చూచుచుండుట సహజము. ఆ సహజభావమే ఇట వర్ణింపబడినందున ఇది స్వభావోక్త్యలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్,
కురఙ్గై రుత్తర ఙ్గాక్షైః స్తబ్ధ కర్ణై రు దీక్ష్యతే.

జాతి+ఆది+స్థస్య=జాతి, క్రియాదులందున్న; స్వభావస్య= సహజభావము యొక్క; వర్ణనమ్=వర్ణించుటయే; స్వభావ+ఉక్తిః=

స్వభావోక్తి అను నలంకారము అగును. ఉత్తరఙ్గ+అక్షైః=తరంగాయ మాణములగు, కనులు గల్గి నట్టియు; స్తబ్ధకర్ణైః=చలింపని చెవులుగల; కురఙ్గైః=లేళ్ళచే; ఉదీక్ష్యతే=చూడఁబడుచున్నది.

## 94. భావికాలంకారము

ఆ. వె. భావికమగు భూత భావ్యర్థములఁ గృతి।
గనులఁ గాంచునట్లు తనరఁజెప్ప
ఇపుడు గూడ నింగి నీక్షించుచున్నాను
విబుధ-దనుజ సమర విక్రమంబు. 156

భూత- భావికాల విషయములను ఇపుడు కనులతో చూచుచున్నట్లు వర్ణించిన యెడల భావికాలంకార మగును. లోగడ జరిగి పోయిన గాని, భవిష్యత్తులో జరుగనున్నవిగాని అగు విషయములను ఇపుడే జరుగుచు కనులతో చూచుచున్నట్లే వర్ణించిన భావికాలంకార మగును.

ఉదా :- దేవ- దానవ సమర పరాక్రమము ఇప్పుడును ఆకాశమున చూచుచున్నాను.

ఇట ఎప్పుడో జరిగిన సురాసుర యుద్ధమున ప్రదర్శించిన పరాక్రమమును నేడు చూచుట అసంభవము. అట్టిదానిని ప్రత్యక్షముగ చూచుచున్నట్లు చెప్పుటచే నిది భావికాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ భావికం భూతభావ్యర్థ సాక్షాత్కారస్య వర్ణనమ్,
అహం విలోకయేఽద్యాపి యుధ్యన్తేఽత్ర సురాసురాః.

భూత+భావి+అర్థ+సాక్షాత్కారస్య=జరిగిపోయిన, జరుగబోవునట్టి కార్యముల యొక్క, సాక్షాత్కారము యొక్క; వర్ణనమ్=వర్ణనము; భావికమ్=భావికాలంకారము (అగును), అత్ర=ఇచట;

అద్య+అపి=నేడుకూడ; సుర+అసురాః=దేవతలుః రాక్షసులును; యుధ్యన్తే=యుద్ధము చేయుచున్నారు, అహమ్=నేను; విలోకయే=చూచుచున్నాను.

## 95. ఉదాత్తాలంకారము

తే॥ గీ॥ ఋద్ధి చరితంబో వర్ణ్యాంగ మిద్ధచరిత
మునో నుడువ నుదాత్తమనఁగఁ దనరుకృతుల
శంకరార్జునుల కెచట సమరమయ్యె
నా హిమాచలసాను వ దౌను సుమ్ము. 187

సమృద్ధి చరితమునుగానీ, అన్యమున కంగమగు శ్లాఘ్యచరితమునుగానీ వర్ణించెనేని కృతుల నుదాత్తాలంకార మగును.

ఉదా :- ఎచట శంకరార్జునులకు సమరమయ్యెనో ఆ హిమాచల శిఖర మదియే సుమ్ము.

ఇచట వర్ణ్యము హిమాచలము. పురాణ ప్రసిద్ధమైన శంకరార్జునుల చరితము దాని కంగముగా నుడువబడినది. కావున నిది ఉదాత్తాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఋద్ధి చరిత వర్ణనమునకు ఉదాహరణము:- మణులు గూర్చిన పెక్కు స్తంభముల యందలి ప్రతిబింబ శతములందు అతికష్టము మీద నాంజనేయుఁడు రావణుని గుర్తించెను.

ఇట రావణుని సౌధ మనేక రత్నఖచిత స్తంభములతో నొప్పు చున్నదనియు, ఆ రత్న స్తంభము లన్నింటిలో రావణుని ప్రతిబింబములు కన్పించుచుండుట వలన నిజమైన రావణుఁడెవరో ఆంజనేయుఁడతి కష్టము మీద గుర్తించె ననుటలో రావణుని ఐశ్వర్య సమృద్ధి ఎంతటిదో చక్కగ వర్ణింపబడినది. కాన నిది ఋద్ధి చరిత వర్ణన రూపోదాత్తాలంకారమునకు లక్ష్యమగు చున్నది.

సం॥ ఉదాత్త మృద్ధిశ్చరితం శ్లాఘ్యం చాన్యోప లక్షణమ్,
సానౌ యస్యాభవద్యుద్ధం తద్ధూర్జటి కిరీటినోః.

ఋద్ధిః=సమృద్ధి యొక్క; చరితమ్=చరిత్రమునో, అన్య+ఉపలక్షణమ్=అన్యము (ఇట వర్ణ్యము) నకు, అంగముగు; శ్లాఘ్యమ్=స్తుత్యమైన; చరితం+చ=చరిత్రనో (వర్ణించిన యెడల) ఉదాత్తమ్=ఉదాత్తాలంకారము(అగును). యస్య=ఏ హిమాచలము యొక్క; సానౌ=కొండశిఖర మందు; ధూర్జటి+కిరీటినో+ఈశ్వర-అర్జునులకు; యుద్ధమ్=సమరము; అభవత్=అయ్యెనో (జరిగెనో అని భావము); (ఆ కనఁబడునది) తత్=అదియే (ఆ కొండ శిఖరమే అని భావము).

## 96. అత్యుక్త్యలంకారము

తే॥ గీ॥ అద్భుతా సత్య శౌర్య దానాది వర్ణ
నంబె కృతులందు నత్యుక్తి నాగ నెసఁగు,
దాతవై నీవు రాజేంద్ర! తనరుచుండ
అమరతరువులే యర్థులై యలరుచుండు. 158

అద్భుతమును, అసత్యమునగు శౌర్యము, దానము మున్నగు వానిని వర్ణించిన యెడల అత్యుక్త్యలంకారము అగును. ఆశ్చర్యకరమై అసత్యములగు పరాక్రమము, ఔదార్యము మొదలగువాని వర్ణనము అత్యుక్త్యలంకారమని భావము.

ఉదా :- ఓ రాజేంద్రః నీవు మహాదాతవు కాఁగా యాచకులు కల్ప మందారాది దేవ వృక్షములే.

ఇట రాజేంద్రుని యొక్క దాతృత్వము అత్యతిశయముగా చెప్పబడినది. కోరిన కోర్కెల నెల్ల దీర్చునవని ప్రసిద్ధిఁబడసిన కల్ప మందారాద్యతరువులకు యాచకత్వమును చెప్పుట అతిశయ

కదనమే. అవి యాచకత్వమును పొందుట జరుగనిపని- కావున నది అసత్యము. రాజేంద్రుని దాతృత్వాతిశయము మిట్లు అచ్చెరువు గొల్పుచు అసత్యమైనది వర్ణింపబడుటచే నిది అత్యుక్త్యలంకారము నకు లక్ష్యమగుచున్నది. సంపదత్యుక్తి యున్నచోట ఉదాత్తాలంకారమనియు, శౌర్యాద్యత్యుక్తి యున్నచోట అత్యుక్త్యలంకార మనియు కొందఱు అందురు.

తే॥ గీ॥ సతత జృంభమాణ వనితా స్తనములకును
చాలకుండ నమర్చె భుజాంతరమును
సుందరీభావి కుచవృద్ధి సుంతఁ గనక
అల్ప మవకాశ మా బ్రహ్మ అహరఁగూర్చె. 159

ఇట పూర్వార్ధమందు అవకాశము యొక్క అసదుక్తి మాత్రమే, ఉత్తరార్ధమున అత్యంతాసదుక్తి ఉండుటయే సద సదుక్తి తారతమ్యమే అతిశయోక్తి అత్యుక్తులకు భేదమని గ్రాహ్యము.

సం॥ అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాది వర్ణనమ్,
త్వయి దాతరి రాజేంద్రః యాచకాః కల్పశాఖినః.

అద్భుత+అతథ్య+శౌర్య+ఔదార్య+ఆది+వర్ణనమ్=ఆశ్చర్యకరమును, అసత్యమును అగు, పరాక్రమము, ఔదార్యము మొదలగు వానియొక్క, వర్ణనము; అతి+ఉక్తిః=అత్యుక్త్యలంకారము; (అగును), హే రాజేంద్ర=ఓ రాజోత్తమా! త్వయి+దాతరి+(సతి)= నీవు దాతవగుచుండ; యాచకాః=యాచకులు; కల్పశాఖినః=కల్ప వృక్షములే.

## 97. నిరుక్త్యలంకారము

తే॥ గీ॥ నామములకు యోగమున నన్యమగు నర్థ
కల్పనంబె నిరుక్తియై గ్రాలు కృతుల

ఇట్టి చేతలవలననే ఎంతు నిన్ను
సత్యదోషాకరుఁడ వని సతము నేను 160

వ్యుత్పత్తిని బట్టి నామములకు అర్థాంతరమును కల్పించిన యెడల నిరుక్త్యలంకార మగును. సామాన్యముగ నామములకు రూఢ్యర్థము, యౌగికార్థము అని రెండు రీతుల అర్థములుండును. అవి రెండును భిన్నములును కావచ్చును. అట్టి సందర్భము లందు ఒక నామమునకు రూఢ్యర్థము ఒకటి కాఁగా వ్యుత్పత్తినిబట్టి అన్యార్థమును కల్పించుట జరిగిన యెడల నది నిరుక్త్యలంకార మగునని భావము.

ఉదా :- ఇట్టి చేతల వలన నేను నిజముగా నిన్ను దోషకరునిగా నెంతును.

ఇది చంద్రుని ఉద్దేశించి విరహిణి చెప్పినమాట- ఇటువంటి జన సంతాపకరమగు చేష్టల వలననే "నీవు దోషాకరుఁడవు- దోషములకు ఆకరుఁడవు- అని నేనెంచుచున్నాను. ఇట దోషాకరమను నామమునకు రాత్రికి కర్త అనునది రూఢ్యర్థము. దోషములకు ఆకరుఁడవు (గనివి) అను అర్థము కూడ వ్యుత్పత్తిని బట్టి ప్రస్తుత సందర్భమున కల్పింపబడినది. కావున నిది నిరుక్త్యలంకారము నకు లక్ష్యమగుచున్నది.

సం॥ నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్,
ఈదృశైశ్చరితైర్జానే సత్యం దోషాకరో భవాన్.

యోగతః=ఆయా శబ్దములకుండు వ్యుత్పత్తిని బట్టి; నామ్నామ్=అర్థ విశేషముల దెల్పు నామములకు; అన్యార్థత్వ+ప్రకల్పనమ్=వేఱొక యర్థమును గల్పించుట; నిరుక్తిః=నిరుక్తియను నలంకారము; (అగును) ఈదృశైః=ఇటువంటి జన సంతాపకరము

లగు; చరిత్రైః=ప్రవృత్తులచేత; (హే చంద్ర=ఓ చంద్రుఁడా) భవాన్=నీవు, సత్యమ్=నిజముగా; దోష+ఆకరః=దోషములకు గనివి (అని) జానే=తెలిసికొందును.

## 98. ప్రతిషేధాలంకారము

తే|| గీ|| కృతిఁ బ్రసిద్ధ నిషేధాను కీర్తనంబె
కనఁగఁ బ్రతిషేధ మను నలంకారమగును.
కితవ! జూదంబు గాదిది కేల నడుప,
వాడి శరములఁ బఱపుచు నాడు క్రీడ. 161

నిర్జ్ఞాతము (బాగుగ తెలిసినది) అగు నిషేధమును మఱల చెప్పిన యెడల ప్రతిషేధాలంకార మగును. నిషేధము చెప్పకున్నను ప్రసిద్ధమే. ఐనను నిషేధమును తిరిగి చెప్పనేని ప్రతిషేధాలంకార మగునని భావము. అనుపయుక్తమగునా నిషేధము అర్థాంతరమును దెల్పుచుండును.

ఉదా : ఓ కితవ! ఇది జూదముగాదు. నిశితశరములఁ బఱపుచు నాడెడు యుద్ధక్రీడ ఇది.

యుద్ధ రంగమున శత్రుపక్షములో నున్న జూదరి నుద్దేశించి ప్రగల్భుఁడు చెప్పినమాట. ఇట యుద్ధము జూదము కాదనుట ప్రసిద్ధమైన విషయము. ఐనను ఇది జూదము కాద"ని మఱల నిషేధము చెప్పఁబడినది. అది ఈ సందర్భమున ఉపయోగపడనిదై "నీ ప్రాగల్భ్యము జూదము నందేగాని యుద్ధమందు ఉపయోగపడద"ను ఉపహాసమును దెల్పుచున్నది. ఆ యుపహాస మిచట "కితవ" శబ్దముచే నావిష్కృతమైనది. ఇట్లు ఇట ప్రసిద్ధమగు నిషేధమునకు అనుకీర్తనమున్నది. నిషేధము సందర్భమునకు ఉపయో

ంపనిదయ్యు నర్థాంతరగర్భితమై కితవ శబ్దముచేఁ బ్రకటింపఁ బడుటచే నిది ప్రతిషేధాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధస్యాను కీర్తనమ్,
న ద్యూత మేతత్కితవ! క్రీడనం నిశితైః శరైః.

ప్రసిద్ధస్య=ప్రసిద్ధమైన; నిషేధము యొక్క; అను కీర్తనమ్=పునఃకథనము; ప్రతిషేధః=ప్రతిషేధమను నలంకారము; (అగును). హే కితవ!=ఓయి జూదరీ: ఏతత్=ఇది: ద్యూతం+న=జూదము గాదు. నిశితైః=వాడియగు: శరైః=బాణములతో; క్రీడనమ్=ఆడుటయే.

## ౧౧. విధ్యలంకారము

ఆ॥ వె॥ చెప్పనేని తిరిగి సిద్ధమౌ నర్థంబు
విధ్యలంకృతి యన వెలయుచుండు
పంచమస్వర మది ప్రభవించు సమయాన
కోకిలం బదౌను కోకిలంబు. 162

సిద్ధించిన అర్థమునే తిరిగి విధించిన యెడల నది విధ్యలంకారమగును. నిర్జ్ఞాతమగు విధి అనుపయుక్తిచే బాధితమగుచు అర్థాంతర గర్భీకరణముచే చారుతరమయ్యె నేనిఅది విధ్యలంకారమనఁ బడునని భావము.

ఉదా :- పంచమస్వరము యొక్క ఆవిర్భావ సమయము రాగానే కోకిల కోకిలయే యగును.

ఇంట రెండవ కోకిల పదముచే కోకిలకు కోకిలత్వమును విధించుట అనుపయుక్తము (ఉపయోగకరము కానిది) అయి శ్రుతి మధుర పంచమ స్వరముల శోభిత్వమును వ్యక్తము చేయు

గలుగుచున్నది. ఆ విశేష మిచట పంచమ స్వరావిర్భావ సమయ విశేషణముచే ఆవిష్కృతమగు చున్నది. విశిష్టార్థ స్ఫూర్తికై సిద్ధార్థము తిరిగి విధింపబడినది. కావున నిది విధ్యలంకారమునకు లక్ష్యమగుచున్నది.

ఇట విధి నిషేధములకు సంబంధించినంత వఱకు ఉదాహరణములందు వ్యంగ్యములే అయినను అర్థాంతర సంక్రమిత వాచ్యరూపములగుట వలన ధ్వనిభావమునకు ఆస్పదములు కానేరవు. స్వేయోక్తిచేతనే వ్యంగ్యము ఆవిష్కరింపబడు చున్నది. వ్యంగ్యావిష్కరణమందును అలంకారముండునని ప్రస్తుతాంకురాలంకారమును చెప్పెడు సందర్భమున నిర్ణయింపబడినది.

సం॥ సిద్ధస్యైవ విధానం యత్తామాహు ర్విధ్యలంకృతిమ్,
పఞ్చ మోదఞ్చనే కాలే కోకిలః కోకిలో భవేత్.

సిద్ధస్య + ఏవ=సిద్ధించిన దానియొక్కయే; విధానమ్=(తిరిగి) విధించుట (ఇతి) యత్ = (అనునది) యేది (కలదో): తామ్= దానిని; విధి+అలంకృతిమ్=విధ్యలంకారము (అని) ఆహుః=చెప్పుదురు, పఞ్చమ+ఉదఞ్చనే=పంచమ స్వరము ఆవిర్భవించునట్టి; కాలే=కాలము (వసంతర్తువు) నందు; కోకిలః=కోయిల; కోకిలః= నిజమగు కోయిల; భవేత్=అగును.

## 100. హేత్వలంకారము:

ఆ॥ వె॥ కార్యకారణములఁ గలిపి నుడివెనేని
హేత్వలంకృతి యన నెసఁగు నొకటి
అమృతకిరణుఁ డడిగొః యంబరమునఁ దోఁచు
మానవతుల మహితమాన ముడుప.

సామాన్యముగ కారణము వలన కార్యము జనించును. అట్టి కార్యముతో పాటే కారణమును కూడ కలిపి ఒకే వాక్యమందు నుడివిన యెడల నది హేత్వలంకారము అగును.

ఉదా :- అడిగో! చూడు మానవతుల మానముడుప అమృతకిరణుఁ డుదయించుచున్నాఁడు

ఇట చంద్రోదయమునకు మానవతీ మానచ్ఛేదమునకు కారణ కార్య సంబంధమున్నది. కుపితలగు మానవతుల కోపము చంద్రోదయమున సడలి కాంతుల యెడ ప్రసన్నలగుదురు. ఇట్లు ఇచట హేతు- హేతుమత్తులను ఒకే వాక్యమందు చెప్పుటచే నిది హేత్వలంకారమునకు లక్ష్యమగుచున్నది.

సం॥ హేతోర్హేతుమతా సార్ధం వర్ణనం హేతు రుచ్యతే,
అసావుదేతి శీతాంశు ర్మానచ్ఛేదాయ సుభ్రువామ్.

హేతుమతా + సార్ధమ్=కార్యముతో గూడ; హేతోః=కారణము యొక్క; వర్ణనమ్=వర్ణించుటను; హేతుః=హేత్వలంకారముగ; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. అసౌ=ఈ; శీత+అంశుః=చల్లని కిరణములు గల చంద్రుఁడు; సుభ్రువామ్=స్త్రీల యొక్క; మానచ్ఛేదాయ=మానచ్ఛేదము కొఱకు; ఉదేతి=ఉదయించుచున్నాడు.

ద్వితీయ భేదము తే॥గీ॥ హేతు-హేతుమద్దైక్యంబు నెసఁగఁజెప్ప
బుధులు హేత్వలంకారమై పొసఁగు నండ్రు
అరయ వెంకటాధీశు కటాక్షము లిల
వఱగు లక్ష్మీవిలాసముల్ ప్రాజ్ఞులకును.

హేతువునకును, హేతుమంతము (కార్యము) నకును ఐక్యమును చెప్పిన యెడల హేత్వలంకార మగునని కొందఱు విద్వాంసు లందురు.

ఉదా :- వేంకటాధీశుని కటాక్షములు విద్వాంసులకు లక్ష్మీ విలాసములు.

ఇచట కటాక్షములు హేతువు. ఆ కటాక్షముల వలన కలుగు లక్ష్మీవిలాసములు హేతుమంతము అనగా కార్యము. అవి రెండును భిన్నములైనను కటాక్షములే లక్ష్మీవిలాసములని కారణ కార్యములకు ఏకత్వము చెప్పబడినది. కావున నిది హేత్వలంకారమునకు లక్ష్య మగుచున్నది. ఈ యేకత్వ కథనము వలన వేంకటేశ్వరుని కటాక్ష వీక్షణము జరిగిన వెంటనే ప్రాజ్ఞులకు అవశ్యముగ లక్ష్మీవిలాస ప్రాప్తి కల్గునన్న విశ్వాసము కల్గుటయే ప్రయోజనము.

సం॥ హేతు- హేతుమతోరైక్యం హేతుం కేచిత్ప్రచక్షతే
లక్ష్మీవిలాసా విదుషాం కటాక్షాః వేఙ్కటప్రభోః.

హేతు- హేతుమతోః=హేతువు యొక్క తుమంతము (కార్యము)యొక్క; ఐక్యమ్=ఏకత్వమును కూడ. కేచిత్=కొందఱు (పండితులు); హేతుమ్ = హేత్వలంకారముగ; ప్రచక్షతే=చెప్పుదురు వేఙ్కట ప్రభోః=శ్రీ వేంకటేశ్వరస్వామి యొక్క; కటాక్షాః= క్రీగంటి చూపులు; విదుషామ్= ప్రాజ్ఞులకు: లక్ష్మీ విలాసాః=సిరి విలాసములు.

తే॥ గీ॥ సాధ్యసులభత లక్ష్య లక్షణము లొప్ప
ప్రాకసాధుని కోర్కెముల్ పరగఁ జూప
నాంధ్ర బాలశంప్రాలోక మమరునట్లు
వరశతాలంకృతుల సిట్లు వల్కినాఁడ.

ఆయా పుటలందు పొరపాటున విటుపబడిన కొన్ని శ్లోక తదర్థములు.

59వ పుటలో 17వ అలంకారము చివఱ నుండ వలసినది

సం॥ వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా,
తాపేన భ్రాజతే సూరః శూరశ్చాపేన రాజతే.

వాక్యయోః = రెండు వాక్యములకు; ఏక సామాన్యే=ఒకే

సామాన్య ధర్మము (భిన్న పదములతో) చెప్పబడగా: ప్రతివస్తు ఉపమా= ప్రతివస్తూపమాలంకారముగ: మతా=(పండితులచే)అంగీ కరింపబడినది. సూర:=సూర్యుడు: తాపేన=ఎండచే; భ్రాజతే= ప్రకాశించును శూరః=వీరుడు; చాపేన=వింటిచే, రాజతే=ప్రకా శించును.

60వ పుటలో చిట్టచివఱ నుండవలసినది.

సం॥ వాక్యార్థయో: సదృశయో రైక్యారోపో నిదర్శనా,
యద్దాతుః సౌమ్యతా సేయం పూర్ణేందో రకలఙ్కతా.

సదృశయోః = సమానములగు: వాక్యార్థయోః=ఉపమానోప మేయ వాక్యార్థములకు; ఐక్య+ఆరోపః=అభేదము నారోపించుట; నిద ర్శనా=నిదర్శనాలంకారము (అగును). దాతుః=దాతయొక్క; సౌమ్యతా+ఇతి+యత్=సౌమ్యత్వము (మంచితనము) అనునది యేది కలదో; సా+ఇయమ్=అయ్యదియే: పూర్ణ+ఇన్దోః=పూర్ణ చంద్రుని యొక్క; అకలఙ్కతా=నిష్కళంకత (స్వచ్ఛత యని తాత్పర్యము).

3) 62వ పుటలో 9 బంతుల తరువాత నుండవలసినది.

సం॥ అపరాం బోధనం ప్రాహుః క్రియయాఽసత్సదర్థయోః,
నశ్యేద్రాజ విరోధీతి క్షీణం చంద్రోదయే తమః.

4) 88వ పుటలోగల సంస్కృత శ్లోకమునకు ప్రతి పదార్థము.

(సం॥ ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే,
వినాపి తన్వి హారేణ వక్షోజౌ తవ హారిణౌ.)

విరోధస్య=విరోధమునకు: ఆభాసత్వే=ఆపాతముగ భాసించిన యెడల; విరోధ+ఆభాసః=విరోధాభాసాలంకారము; ఇష్యతే=(పండి

తులచే) అంగీకరింపబడు చున్నది. హేతన్వి= ఓ తరుణీ; తవ=నీ యొక్క; వక్షోజౌ = కుచములు; హారేణ+వినా+అపి=హారము, లేకున్నను; హారిణౌ=హారులై యున్నవి, (మనోహరములై యున్నవి.)

5) 94వ పుటలో 9 బంతుల తరువాత చేర్పవలసినది.

సం॥ కార్యాత్కారణ జన్మాపి దృష్టా కాచిద్విభావనా,
యశః పయోరాశి రభూత్కర కల్పతరో స్తవ.

కార్యాత్=కార్యము నుండి; కారణజన్మ+అపి=కారణ ముద్భవించుటయు, కాచిత్=ఒకానొక; విభావనా= విభావనాలంకారము; దృష్టా=చూడబడినది (అంగీకరింప బడినదని భావము). తవ=నీ యొక్క: కర+కల్పతరోః=కరమనెడి కల్పవృక్షము నుండి: యశః+పయోరాశిః=కీర్తియనెడి పాల సముద్రము; అభూత్=జనించెను.

6) 115వ పుటలో 5 బంతుల తరువాత చేర్పవలసినది.

సం॥ లుబ్ధో న విసృజత్యర్థం నరో దారిద్ర్య శఙ్కయా,
దాతాపి విసృజత్యర్థం తయైవ సను శఙ్కయా.

లుబ్ధః=లోభియగు; నరః=జనుఁడు; దారిద్ర్య+శఙ్కయా= దారిద్ర్యము కలుగునను అనుమానముతో; అర్థమ్=ధనమును; న విసృజతి=దానము చేయఁడు. దాతా+అపి=దాతయగు జనుఁడును; తయా+శఙ్కయా+ఏవ= ఆ (దారిద్ర్యము కలుగునను) అనుమానము చేతనే; అర్థమ్+ధనమును; విసృజతి+నను=దానము చేయును గదా.

7) 117వ పుటలో 6వ బంతి తరువాత చేర్పవలసినది.

సం॥ భవన్తి నరకాః పాపాత్ పాపం దారిద్ర్య సంభవమ్,
దారిద్ర్య మప్రదానేన తస్మాద్దానపరో భవేత్.

పాపాత్=పాపము వలన; నరకాః=ఎపెఫమ్ములగు నరకములు; భవన్తి=కలుగుచున్నవి. పాపమ్=పాపము; దారిద్ర్య+సంభవమ్= దారిద్ర్యము వలన సంభవించునది. దారిద్ర్యమ్=దరిద్ర స్థితి; అప్రదానేన=దానము చేయకపోవుట వలన (కలుగును). తస్మాత్= ఆ కారణము వలన; (నరుఁడు) దానపరః=దానముచేయుట యందు ఆసక్తి కలవాఁడు; భవేత్=కావలయును.

8. 139వ పుటలో 7 బంతుల తరువాత చేర్చవలసినది.

సం॥ అనన్తరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపిజాతం,
ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః.

అనన్త+రత్న+ప్రభవస్య = అంతులేని, రత్నములకు, ఉత్పత్తిస్థానమైన; యస్య= ఏ హిమవంతునకు; హిమమ్=మంచు; సౌభాగ్య+ విలోపి= భాగ్యవత్త్వమును, లోపింపజేయునది; న+ జాతమ్=కాజాలదు. తథాహి= యుక్తమే కదా! ఏకః+ దోషః= ఒక్క, దోషము (ఉన్నను. అది) గుణ+సన్నిపాతే = గుణముల సముదాయమునందు; ఇందోః+ కిరణేషు= చంద్రుని కిరణముల యందు; అఙ్కః+ ఇవ= మచ్చవలె; నిమజ్జతి= మునుగుచున్నది. లీనమగుచున్నదని తాత్పర్యము

9. 164వ పుటలో 7బంతుల తరువాత చేర్చవలసినది.

సం॥ సామాన్యం యది సాదృశ్యాద్విశేషో నోపలక్ష్యతే,
పద్మాకరప్రవిష్టానాం ముఖం నా లక్షి సుభ్రువామ్.

సాదృశ్యాత్= సాదృశ్యము వలన; విశేషః= విశేషము; న+ ఉపలక్ష్యతే+ యది= కన్పట్టినియెడల: సామాన్యమ్= సామాన్యాలంకారము, (అగును). పద్మ+ ఆకరమ్= కమలములకు ఆకరమగు సరస్సును; ప్రవిష్టానాం= ప్రవేశించినట్టి; సుభ్రువామ్= తరుణులయొక్క; ముఖమ్=మొగము; న+అలక్షి=కన్పట్టుటలేదు.

# అవశ్యము చేయఁదగు సవరణలు

| పుట | పంక్తి | సవరణ |
|---|---|---|
| | 6 క. | అంకిత భక్తజనావలి |
| | 7. | శంకల, దీర్చుచువసైక శాంతకటులనా |
| | 13. | సచ్ఛ్రీదయము |
| | 19. | బుధుఁడు జయదేవుఁడా బాలగోపఁగోకు |
| | 21. | అమరవాణిఁ బంద్రా.... |
| 2 | 7. | ....................బోధన నాదరించి |
| 38 | 19. | వెలలు సిద్ధ మసిద్ధ మన్ భేదమంటు |
| 45 | 2. | అది అపహ్నవ గర్భమై యలరెనేని |
| 50 | 16. | కీర్తినాఁ బరఁగు ముందు వెనుక లిటుగం బఁడినన్ |
| 52 | 25. | జాతి-కదళికా-నిశాపతి లేఖలఁ గల్గు |
| 55 | 13. | ప్రథిత విక్రమమునఁ బార్థివుండు |
| 63 | 17. | పలుకఁగ వ్యతిరేక మలరు కృతుల |
| 66 | 5. | హృద్యమయ్యును వినయ విహీనమైన<br>విద్య కొఱగాని దండుగ విబుధవరులు. |
| 67 | 7. | వీడు పేరోలగము గ్రాలు నిస్తులముగ |
| 71 | 25. | కలఁచ నబ్ధి భూరి శిలీ ముఖంబు లొత్తి, |
| | 27. | ఉచ్చర ద్భూరి కీలాల ముద్గిరింప |
| 91 | 13 | పరఁగు నాలుగవ విభావనంబు |
| 92 | 10. | పంచమంబయిన విభావనంబు |
| 94 | 11. | కారణము పుష్కలం బైనఁ గార్య సిద్ధి |
| 119 | 5. | మనసిజుం డా విలాసిని మనసునందు |
| | 6. | మనసు నీయందు నిలిచెను మనుజనాథ! |
| 120 | 16. | దానికంటెఁ గవి యుదాత్త సూక్తి |

125 10. ఒంటి పర్యాయమున్నై కృతి నొప్పు, నొకటఁ
గడఁగి పర్యాయమున ననేకంబు చెప్ప
ఆ ప్రదీపాలఁ దోఁచు స్నేహక్షయంబు
కామినీ మానసములందుఁ గానరాదు.

162 24......................లేదు
25. నాగఁ గృతుల సాహిత్య మనంగ నొప్పు

## తప్పు ఒప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 12 | ద్వయో | ద్వయోః | | 16 | త్రిధాదిప్య | త్రిధాధిక్య |
| 8 | 9-10 | చెప్పఁబడినది | చెప్పఁబడినది | | 23 | విషయ= | విషయ+ |
| | 22 | వ ర్తింపును | వ ర్తింపును | 24 | 9 | విలోచనం= | విలోచనం+ |
| | 25 | ఒకనొకఁడు | ఒకానొకఁడు | | 20 | ముఖచంద్ర | ముఖచంద్రః |
| 9 | 7 | సమాగము | సమాగమము | 27 | 9 | ఇ వతే | ఇష్యతే |
| 11 | 3 | ష్మర | స్మర | | 14 | నిషయ | విషయ |
| 13 | 6 | పూర్ల | పూర్ణ | | 18 | ఒక విని | ఒకనిని |
| | 18 | యోప-మా | యోపమా | | 26 | దర్జునితో | దర్జునునితో |
| | 20 | ద్వయో | ద్వయోః | 28 | 2 | వాకము | వాక్యము |
| 15 | 3 | ప్ర క్త్రి | వ క్త్రి | | 10 | దాను లక్ష్యము | ధానుష్క-లక్ష్యము |
| 16 | 3 | ప్రతీపాలంకార | ప్రతీపాలంకార | 28 | 17 | వి య | విషయ |
| | 10 | గర్వేణ | గర్వేణ | | 19 | వి. య | విషయ |
| | 11 | గర్వించి సంత | గర్వించినంత | 29 | 5 | ందేహ | సందేహ |
| | 17 | ధర్పమేల ? | దర్పమేల ? | 31 | 11 | ఆరోపార్థ | ఆరోపార్థః |
| 19 | 23 | విషయభేద | విషయ్యభేద | | 12,13 | ధర్మము | ధర్మము |
| 20 | 8 | ఆసురార్ధ దిత | ఆసుర్ధపోదిత | | 14 | సుధాంశు | సుధాంశుః |
| | 16 | ప్రభేదము | (అభేదము | | 18 | యుక్తి | యుక్తి |
| 23 | 19 | రూపాలంకారం | రూపకాలంకారం | | 23 | విజ్జ | విజ్ఞ |
| | 3 | ముఖేంద్రము | ముఖేంద్రుడు | 32 | 3 | తపనఁడు | తపనుఁడు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | 12 | చంద్రతత్త్వముు | చంద్రతత్త్వము | 50 | 11 | (భర్తనేసు) | (భర్తచే నేసు) |
| | 19 | బడి బ్నా | బడబాగ్ని | | 26 | ఇట ఇట | ఇట |
| | 25 | నేందు స్త్రవో | నేందుస్త్రీవో | 51 | 23 | తాహి | హితా |
| 33 | 2 | తీవ్ర | తీవ్రః | 52 | 7 | పదవిలాసము | పద్మవిలాసము |
| | 6 | ఉత్థిత | ఉత్థితః | | 2 | నటించి | నటింప |
| | 16 | రాకపోతే | రాకపోయిన | 52 | 1 | ఉత్ప్రేక్ష | తుల్యయోగితా |
| | 23 | అహ్లాద | ఆహ్లాద | 54 | 5 | ఘాతిఃమిత్ర | ఘాతిర్మిత్ర |
| 34 | 9 | అర్థః | అర్థః | | 16 | సాకు | సాకు |
| | 10 | పర్యస్తాపహ్నుతి | పర్యస్తాపహ్నుతి | 55 | 12 | ప్రథిత | బహుళ |
| 35 | 14 | కల్గిన తాపము | కల్గిన తాపము | | 13 | 1 ,, | బహు |
| | 27 | +ంరోతి | +కరోతి | | 2 | బాలకుండు | బాల్యపుండు |
| 38 | 10 | కైతవాసహ్నుతి | కైతవాపహ్నుతి | 56 | 14 | పూలు3 రాసరి | పూలగు త్రి |
| 39 | 17 | (అగుచున్నది) | అగుచున్నవి | 19 | 20 | అర్థావృత్తి | అర్థావృత్తి |
| 40 | 21 | రోపసి | రోదసి | | 26 | 3, 4 | 4 |
| | 23 | ఉత్ప్రేక్షింప | ఉత్ప్రేక్షింప | 58 | 7 | అగుచున్నవి | అగుచున్నవి |
| | 26 | చెప్పబడు | చెప్పబడ | 59 | 8 | నీవె అవని | నీవె యవని |
| 42 | 8 | విక్షేపణాత్ | విక్షేపణాద్ | | 20 | భావము | భావము |
| | 8 | నివాసు | నివాసము | 60 | 10 | వాక్యార్థములకు | వాక్యార్థములకు |
| | 14 | పై | పై | 61 | 4 | నేము | నీము |
| 44 | 23 | భేద | అభేద | 61 | 17 | కొండఃయః | కొండయు |
| | 27 | శితాః | శితాః= | 62 | 5 | అర్ధములు | అర్థములు |
| 45 | 4 | మొప్ప | మొలుక | | 10 | అర్థమో | అర్థయోః |
| 46 | 8 | 1. ఆ రాజు | ఈ రాజు | | 25,26 | అర్థము | అర్థము |
| | | 2. ఆ రాజు | ఈ రాజు | 63 | 5 | సదర్థము | దర్థమునసేసే |
| | 17 | న్యత్వ | అన్యత్వ | | 17 | సుడువంగ | పలుకంగ |
| | 19 | సుహాపతేః | మహీపతేః | | 23 | సార్ధక | సార్థక |
| | 25 | స్పృశింపుమనసగన్ | స్పృశియించు | 64 | 6 | మార్ధవ | మార్దవ |
| | | | ననన్ | | 11 | న్యూన్యత్వ | న్యూత్వ |
| 47 | 7 | జనను | జనను | 19 | 1 | న్నతి | ఉన్నతి |
| | 19 | అతిశయింప | అవతరింప | | 2 | ప్రకృతి | ప్రకృతి |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | 21 | సహోక్త్యలంకారము | సహోక్త్య | 84 | 11 | నివః | నిష్ఠ్యః |
| | | | అలంకారము | 93 | | ప్రతిష్య | ప్రతిపెన |
| 65 | 20 | రజ్ఞ+నః | రజ్ఞానః | | 25 | ప్రార్థితమే | ప్రార్థితమే |
| | 26 | చివల | చివర | 87 | 30 | హాయలయ్యె | హాయలగును |
| 66 | 21 | వస్తువు లేక గుణము | వస్తువో | 82 | 2 | హూహూ ! | |
| | | | గుణమో | 89 | 13 | కానిదె | కానిదే |
| 67 | 12 | నిస్తులముగ | తులము లేక | | 17 | విరియంబు | విరిహాక్క |
| | 13 | లేకుంటచే | లేకుండుటచే | 90 | 14 | అవనియుండు | అవనియందు |
| 68 | 12 | ప్రస్తుతము | ప్రస్తుతవిషయము | | 18 | అసిఘుజగము | అసిభుజగము |
| 59 | 9 | యెడల | యెడల | 91 | 10 | +ఘుజంగము | +భుజంగమః |
| 71 | 7 | పురుషార్థముల | పురుషార్థముల | | 26 | చతుర్థ | చతుర్థ |
| 72 | 5 | అర్థాధారము | అర్థాధారము | 95 | 7 | అసంభవ | అసంభవ |
| | 6 | శబ్దార్థోభయా | శబ్దార్థోభయా | | 9 | అలర్కార | అలంకార |
| | 9 | శ్లే | శ్లేష | | 48 | అసంభమైన | అసంభవమైన |
| 73 | 8 | శిలమైనవి | శిలమైన | 96 | 12 | స్త్రిలు | స్త్రీలు |
| | 24 | ఉచ్చరద్యూరి | ఉచ్చరద్యూరి | | 26 | అనంతరమే | అనంతరమే |
| 74 | 7 | ప్రకృత్యాకృత | ప్రకృత్యాప్రకృత | 97 | 8 | విటపమె | విటపమె |
| 77 | 22 | వాక్యార్ధ | వాక్యార్థ | | 12 | అజ్ఞనః | అజ్ఞనాః |
| 79 | 7 | వర్ధమును | వర్తమును | | | పానాంశుల | పథికుల |
| | 10 | వ్యంగ | వ్యంగ్యగం | | 18 | సంగతి | ససంగతి |
| 15. | 18,22 | వ్యర్థము | వ్యర్థము | 98 | 10 | సమూహా | సమూహాః |
| | 22 | స్థితి | స్తితి | | 12 | చేసెను | చేసెను |
| | 24 | వి యము | విషయము | | 16 | గోత్రోద్ధరక | గోత్రోద్ధరణకు |
| 80 | 7 | భగ్నః | భగ్న్య | 99 | 11 | జాతమగా | జాతముగా |
| | 13 | బర్యాయోక్త | బర్యాయోక్త | | 12 | విషమై | విషయమై |
| | 27 | యామి | యామి | 100 | 10 | వర్త్యతే | వర్ణ్యతే |
| 82 | 18 | వ్యాజస్తుత్య | వ్యాజస్తుత్య | | 24 | కారగుణము | కారణగుణము |
| 82 | 17 | కః ర్తవ్యం | కర్తవ్యం | 101 | 12 | అవిము | తాము |
| 83 | 9 | ఇట్టిది | ఇట్లిది | 101 | 14 | విషమా | విషమాలంకార |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 102 | 11 | ,, ,, | విషమాలంకార | 130 | 3 | గపున | గమన |
| | 11 | విషపు | విషము | | 12 | గతానం | గతానాం |
| 103 | 5 | నిప | నీప | | 23 | మెసఃగంగ | మెసగింపు |
| 104 | 15 | వి యు | విషయ | 134 | 7 | రావ్యార్థాపత్తి | కావ్యార్థాపత్తి |
| 105 | 3 | అర్దిస | అర్థినః | 135 | 2 | వ్యావర్తిన | వ్యావర్తన |
| | 11 | తుల | స్తుతుల | | 9 | పుష్ట | పుష్ట |
| 107 | 22 | యుతరే | యుత్రైతే | 136 | 16 | శిరస్సున | సూత్రము శిరస్సున |
| 109 | 10 | పరస్పరము | పరస్పరము | 137 | 1 | అర్థాపత్త్యలంకారము | వికస్వరాలంకారము |
| 110 | 11,14 | వేడు | వేయు | | | | |
| | 23 | గొప్ప | గొప్ప | 138 | 13 | ఇల | అల |
| | 26 | గాని | గాని | | 17 | అవస్త | అనస్త |
| | 3 | విశేసాలంకార | విశేషాలంకార | 138 | 2 | కన్పింపదు | కన్పింపదని |
| | 9 | బహిరంతరత | బహిరంతరత | | 28 | సాగారా | సాగరా |
| | 23 | నళాత్యాపుర | నళాత్యాపుర | 140 | 4 | పొతల | ప్రోతల |
| 113 | 14 | త్రై × పన | త్రైః + నీవ | | 7 | న | నల్ల |
| | 25 | వాడుసు | వాడుసు | | 11 | సూహా | సూహా |
| 114 | 8 | సిద్దికే | సిద్ధికి | | 26 | అన్యసం | అన్యస్య |
| | 12 | అనుగుణ్యె | అనుగుణ్యా | 141 | 13 | సత్యము | సత్యము |
| | 2 | వేరాక | వేడాక | 143 | 5 | ప్రశంశా | ప్రశంసా |
| 116 | 11 | యుగ | త్యాగేన | 144 | 4 1 | వానిత్రై | ఆమెత్రై |
| | 13 | వలప | వలవ | | 2 | తలంచు | అరయు |
| 118 | 13 | గృహీతముధ | గృహీతముక | | 5 | కడకడి | కడికాని |
| | 24 | ప్రలంబన | ప్రలంబన | | 6 | లాఘవము | లాఘవము, |
| 119 | 24, 25 | లక్షణముసు | లక్షణము | | 24 | సత | గత |
| 120 | 2 | సిరాకగ్యాలంకార | సిరావశ్యాలంకార | 145 | 9 | వాఞ్ఛతా | వాఞ్ఛితా |
| 121 | 20 | పరుగు వోలెడె | పాయదోసె | | 16 | వెలయు | వెలయు |
| 124 | 6 | పరివృత్త్యలంకారము | పరివృత్త | | 18 | మూల మంప | మూలపంప |
| | 19 | పారిపోవుట | పారిపోగా | | 23 | నిధిని | నిధిని |
| 126 | 32 | డపురపండు | సత్వరంబు | 147 | 8 | చక్రమునిగి | స్నానమాడి |



# స్వవిషయము

జననము : 1921

జన్మస్థానము : గోవాడ, అమృతలూరు మండలం
గుంటూరు (జిల్లా)

తల్లిదండ్రులు : శ్రీ సుబ్రహ్మణ్యమ్మ,
లక్ష్మీనారాయణగారలు

ప్రాథమికవిద్య : గోవాడ

ఉన్నతవిద్య : (సంస్కృతము), అమృతలూరు. అమృతలూరు (మం)
గుంటూరు జిల్లా

కళాశాల విద్య : శ్రీ నారసింహ సంస్కృత కళాశాల, చిట్టిగూడూరు,
గూడూరు మండలము, కృష్ణా జిల్లా

సంస్కృతాంధ్రాధ్యాపకత్వము

1. 1943-44 శ్రీ సంస్కృతోన్నత పాఠశాల, శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడు, చిత్తూరు జిల్లా
2. 1944-45 శ్రీ సంస్కృతాంధ్ర హిందీ మహావిద్యాలయము, పాలపర్రు, పెదనందిపాడు మండలము, గుంటూరు జిల్లా
3. 1945-1972 గుంటూరు జిల్లా పరిషత్ హైస్కూల్స్ :
1. కొల్లూరు 2. ఇంటూరు 3. రేవేంద్రపాడు 4. గోవాడ
5. జంపని 6. దుగ్గిరాల 7. గారపాడు 8. పెదరావూరు.
4 1972-1981 శ్రీ గోగినేని కనకయ్య ఓరియంటల్ కాలేజీ, తాడికొండ
గుంటూరు జిల్లా
5. 1981-1992 గౌరవసంస్కృతాంధ్రాధ్యాపకత్వము 1. శ్రీ ఆనందానంద వేదాంతకళాశాల, శ్రీ వ్యాసాశ్రమము, యేర్పేడు 2. ప్రియదర్శిని జూనియర్ కాలేజీ, విజయవాడ, ప్రసాదంపాడు.

ప్రచురణలు : I ముద్రితములు II. అముద్రితములు, I 1. బాలశతకము 2. సూక్తిసుధాకరము 1, 2 భాగములు II. 1. సూక్తిసుధాకరము 3, 4, 5, 6, 7, 8, 9, 10 భాగము 2 శాకుంతల సూక్తులు 3. ఆంధ్రనీతులు (భర్తృహరి నీతి శతకానువాదము) 4. విద్యార్థి 5. విద్యాలయము 6. తర్కసంగ్రహము 7. ప్రబోధము 8 దివ్యస్మృతులు 9. మానవుడు 10. స్వతంత్రభారతము-తత్ఫలితము 11. ఆంధ్ర ప్రశస్తి 12. ఆంధ్రవేదాంతడిండిమము 13. ఆంధ్రవేదాంతసారము 14. ఖగోళ దీపిక 15. ఖండకృతులు 1, 2, 3 భాగములు 16. సంస్కృతవైశిష్ట్యము 17. వ్యాసావళి 18 ప్రాచీన భారత విజ్ఞాన శాస్త్రవైభవము 19. జలార్గళ శాస్త్రము.